

మత్స్యశాఖ అధికారుల సమావేశం: పశుసంపద, మత్స్యశాఖామంత్రి శ్రీ ఎమ్. పళ్లంరాజు, 25–5–62 న హైదరాబాదులో రాష్ట్ర మత్స్య శాఖ అధికారుల వార్షిక సమావేశాన్ని ప్రారంభించారు.

కృష్ణపై రెండవ వంతెన: విజయవాడ వద్ద కృష్ణపై కొత్త వంతెనకు 30–5–62 న రాష్ట్ర ముఖ్యమంత్రి శంఖు స్థాపన చేశారు. వెనుక పాత వంతెనను చూడవచ్చు.

# విషయసూచిక



ముఖచిత్రం:— విశాఖపట్నం జిల్లా కొండకర్ల సరస్సులో చేపలు పట్టే దృశ్యం

వెనుకఅట్ట మీది చిత్రం:— విశాఖపట్నం జిల్లా అరకులోయలో—గిరిజనుల ధిమ్సా నృత్యం.

# సఖీసంలాపము

శ్రీ చెలమచెర్ల రంగాచార్యులు

( వనపంక్తి - కృష్ణవేణితో... )

పొంగి పోయెదవేల నింగి నంటెదు బేల!
క్రుంగగాదగు చోట సంగీత మానోట!
  ఆగకే నెచ్చెలీ! ఆగకే కృష్ణా!
  సాగదే బ్రతుకింక సోగకన్నుల జింక!
పూల బాటలపైన శూలాలు నాటిరే
నిండుగుండెలలోన గండురాళ్ మీటిరే
  ఆగకేనెచ్చెలీ! ఆగకే కృష్ణా!
  సాగదే బ్రతుకింక సోగకన్నులజింక!
తెరటాలతో తూలి నెరపగాదిక కేళి
సుళ్లసుళ్లన కన్నెహల్లీ సకాలున్నె
  ఆగకే నెచ్చెలీ! ఆగకే కృష్ణా!
  సాగదేబ్రతుకింక సోగకన్నులజింక!
నిరవరోధమ్ముగా నిరుపద్రవమ్ముగా
నివ్వెటెల్లిన వేణి గవ్వలైతే రాణి!
  ఆగకే నెచ్చెలీ! ఆగకే కృష్ణా!
  సాగదే బ్రతుకింక సోగకన్నులజింక
భీషణమ్మైన యా ఘోష విన్నావటే
కదలిరాయడు వాడు కదలి రమ్మన్నాడు.
  ఆగకే నెచ్చెలీ! ఆగకే కృష్ణా!
  సాగదే బ్రతుకింక సోగకన్నులజింక!

( కృష్ణవేణి - వనపంక్తితో... )

సంగీతములుగాక సాహిత్యములుగాక
మంగళోదయవేళ క్రుంగుటేలనె గోల?
చూడవేయిరువంక చూడు మోనెలవంక
పచ్చపచ్చని చేలు లచ్చి చూపుల జాలు
దీటుగా అతిరథుఁడు కాటన్ భగీరథుఁడు
లాలింపనాడునే నాలించి నిల్చితిని
ఒకసారి యా దిక్కు వికచ నేత్రా చూడు
కందోయి పండువై గనుపించునాడు.

జీవనమ్మది కొంత పావనమ్మయె గా
మానవార్చన పుణ్యమాధవార్చనయెగా
పొంగకేమే సఖీ! మంగళోదయవేళ
భృంగాళిపాడదే సంగీతి మధువేళ

క్రమకోటి త్రయీ కంఠాల నేఁడు నా
సోదరులు వేఁడిరే యాదరమ్మున నిల్తు
సాగరమ్మట ఎంత చక్కనైనదొ పేరు
పతిపేరు పడతులకు బంగారు మేల్ పేరు

అడుగు పెట్టిన చోట అణిముత్యాల్పండ
బడుగు డెందాలలో పండుగల్ వడిసింద
నిలుతునే యీ నాఁట నెచ్చెలీపూదోట
నాటించి పట్టెదను నాథు చక్కికిబాట

సరసుఁడే నాస్వామి సఖి సాగరస్వామి
ప్రజ మేలుగూర్పగా భళిభళీయని మెచ్చు
కల్యాణకారులకు గలదె స్వేచ్ఛాయాత్ర
నియతిబద్ధముకాదె నెలతరవిరథయాత్ర

# వెలుగుబాటలు

"ఉదయభాను"

ఆంధ్రప్రదేశ్‌కు ఒక శతాబ్దపు మునిసిపల్ చరిత్ర ఉంది. సమీకృత మునిసిపాలిటీలబిల్లును ఆమోదించే వరకూ తెలంగాణ ప్రాంతానికి హైద్రాబాదు జిల్లా మునిసిపాలిటీల చట్టం (1956). ఆంధ్రప్రాంతానికి మద్రాసుజిల్లా మునిసిపాలిటీల చట్టం (1920) అమలు జరుగుతూ ఉంటుంది.

టోల్, ఆక్ట్రాయి, అడ్వర్టయిజ్‌మెంట్ పన్నుల వంటి కొన్ని అంశాలలో వ్యత్యాసాలు మినహా ఉభయ చట్టాలూ యించుమించు ఒకే విధంగా ఉన్నాయి ఆంధ్ర ప్రాంతములోని మునిసి పాలిటీలు ప్రసూతి శిశుపోషణతో సహా ప్రజారోగ్యం, ప్రాథమిక సెకండరీవిద్య, దీపాలు, రోడ్డు సౌకర్యాలు కూడ సమకూరుస్తాయి. తెలంగాణ మునిసిపాలిటీలకు ఎక్కువగా అలాంటి పనులు లేవు. సమీకృత చట్టానికి మద్రాసు చట్టం ప్రాతిపదికగా స్వీకరించబడింది అయితే హైద్రాబాదు చట్టంలోని కొన్ని మంచి అంశాలు చేర్చబడినవి. ఈ చట్టాల అమలులో పొందిన అనుభవం దృష్ట్యా మరికొన్ని కొత్త అంశాలు చట్టంలో చేర్చబడినవి.

ఒక శతాబ్దం క్రితం మునిసిపాలిటీలు ఏర్పడినప్పుడు అవి యింతటి విస్తృత కృషి జరుపుతాయని యెవరూ ఊహించలేదు. క్రమేణా అభివృద్ధి చెందిన మునిసిపాలిటీలు సమాజ ఆర్థిక, సాంఘిక జీవనంలో ప్రముఖ పాత్రను నిర్వహించడంతోపాటు మరణ శాతాన్ని తగ్గించి ప్రజలకు విద్య, తదితర సౌకర్యాల్ని కూడ కల్గిస్తున్నవి.

## ప్రత్యేక శాఖ

సంవత్సరం క్రితం వరకూ మునిసిపల్ పరిపాలన స్థానిక పరిపాలనలో భాగంగా ఉండేది. మునిసిపాలిటీలు, పంచాయతీలు, స్థానిక సంస్థలు (జిల్లాబోర్డులు మున్నగునవి) అన్నీ కలసి స్థానిక పరిపాలనా శాఖలో ఉండేవి. అయితే సంవత్సరం క్రితం మునిసిపల్ పరిపాలనా శాఖను విడదీశారు. పంచాయతీ రాజ్‌ను ప్రవేశ పెట్టడంతో జిల్లాబోర్డుల స్థానే పరిషత్తులు వచ్చాయి. బ్లాకు స్థాయిలో పంచాయతీ సమితులు ఏర్పడినవి. గ్రామ పంచాయతీలు సమితులు, పరిషత్తులు కలపబడి వాటికి ప్రత్యేక పరిపాలనా వ్యవస్థ నెలకొల్పబడింది. మునిసిపాలిటీలను విడదీసి, ఒక డైరక్టరేట్ ప్రత్యేకంగా ఏర్పాటు చేయబడింది

మన దేశాభ్యుదయానికి నగరాలు, పట్టణాలు నాడీ కేంద్రాల వంటివి. అందువలన పట్టణ జీవనానికి సంబంధించిన అనేక సమస్యల్ని అవి పరిష్కరించాల్సి ఉంది. మన మంత్రులు, నాయకులలో చాల మంది ప్రారంభంలో స్థానిక స్వపరిపాలనలో విశేషానుభవాన్ని గడించిన వారే.

## మునిసిపాలిటీల బాధ్యత

రోడ్ల నిర్మాణం, మార్కెట్లు, బావులు, చెరువులు, బండ్లు బస్సులు, లారీల స్టాండ్‌లు, ప్రసూతి శిశుపోషణ కేంద్రాలు, పాయిఖానాలు, మూత్రశాలలు, వీధి దీపాలు, పార్కులు, ఆటస్థలాలు, పాఠశాలలు, ఏర్పాటు చెయ్యడం మొదలుకొని మురికిపేటల నిర్మూలననుండి మంచినీటి సరఫరా, డ్రైనేజి సౌకర్యాల్ని కల్పించడం వరకూ అన్నీ మునిసిపాలిటీల బాధ్యతే మునిసిపల్ పరిపాలనలో ఉన్న టౌన్ ప్లానింగ్ విభాగం ద్వారా ఆయా పట్టణాలు సక్రమంగా అభివృద్ధి చెందేటట్లు కట్టడాలను క్రమ పర్చడం జరుగుతుంది

## మునిసిపల్ అధ్యక్ష మండలి

మునిసిపల్ అధ్యక్షులందరికీ ఒక సంఘం ఉండాలనే భావం 1947 లోనే అవిభక్త మద్రాసు రాష్ట్రంలో కలిగింది. 1948లో రాష్ట్ర మునిసిపల్ అధ్యక్షమండలి (ఛేంబర్) ఏర్పడింది. ప్రస్తుతం ఆంధ్ర ప్రాంతానికే ఛేంబర్ ఉంది. కమీషనర్లకు

కూడా ఒక మండలి ఉంది. అయితే తెలంగాణ ప్రాంతానికి యింకా అలాంటివి ఏర్పడలేదు. అధ్యక్షుల, కమీషనర్ల సమిష్టి సమావేశంకూడా గత సంవత్సరం హైద్రాబాదులో జరిగింది.

ఛేంబర్ సూచనలకు ప్రభుత్వం ఎంతో విలువ యిస్తుంది. వారి తీర్మానాలు కొన్ని ఆమోదించబడ్డాయి కూడా.

తెలంగాణ, ఆంధ్ర మునిసిపల్ చట్టాల విలీనీకరణ అయిన తరువాత తెలంగాణ మునిసిపల్ అధ్యక్షులు కూడ ఛేంబర్‌లోచేరి దానిని మరింత ఉపయోగకరం చేయడం జరగవచ్చు.

## పట్టణాభివృద్ధి

ఆయా పట్టణాల్ని అందంగా రూపొందించుకోవడానికి మునిసిపాలిటీలు వివిధ పథకాల్ని రూపొందించవచ్చును. మురికి పేటల నిర్మూలన, గృహ నిర్మాణ పథకాలకు ప్రభుత్వ ఆర్థిక సహాయం లభిస్తుంది. కేంద్ర ప్రభుత్వం కూడా సహాయం చేస్తుంది. మంచినీటి సరఫరా పథకాన్ని కూడా యీ విధమైన సహాయంతో అమలు జరుపుకోవచ్చు. కొన్ని మునిసిపాలిటీలు అభివృద్ధి కార్యకలాపాలలో ముందంజవేస్తూ ప్రభుత్వ సహాయాన్ని పూర్తిగాపొంది అనేక నిర్మాణ కార్యక్రమాలను చేపడుతుండగా కొన్ని మునిసిపాలిటీలు అంత చురుకైన పాత్రను వహించలేక పోతున్నవి. ఇప్పుడు ఇటువంటివి చురుగ్గా పనిచేసే చర్యలు గైకొనబడుతున్నవి.

## తెలంగాణ మునిసిపాలిటీలు

తెలంగాణలో మునిసిపల్ పరిపాలన వ్యవస్థ ఆంధ్ర ప్రాంతానికికొంత భిన్నంగా ఉంటుంది. ఆంధ్రలో జన సంఖ్య పెరిగిన మేజర్ పంచాయతీలు చివరకు మునిసిపాలిటీలుగా రూపొందించబడతాయి. తెలంగాణలో [illegible]000 జనాభాను మించిన ప్రతి గ్రామం పట్టణ మునిసిపాలిటీ అవుతుంది. 15000 జనాభాకు మించిన పట్టణాలకు సిటీ మునిసిపాలిటీలున్నాయి.

తెలంగాణలో పట్టణ మునిసిపాలిటీలు 59 ఉన్నాయి. వాటికి ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్లు ఉంటారు. అయితే రామన్నపేట, షాబాద్, అచ్చంపేట, పర్గి, నర్సాపూర్, రామాయనపేట, రామగిరిరావుపేట, సిర్పూరు, బోత్‌క్రలలో ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్లు లేరు. అక్కడ వారి పనిని మునిసిపల్ అధ్యక్షులే స్వయంగా చూస్తారు.

ఈ పట్టణ మునిసిపాలిటీలు ఆస్తిపన్ను, వాహనాలు, పశువులపై పన్ను, వృత్తిపన్ను, యాత్రికులపై పన్ను, వినోదపన్ను, చరాస్థి మార్పిడిపై పన్ను విధిస్తూ యింకా లైసెన్సు ఫీజు, సంతలలో అమ్మబడే పశువులపై రిజిస్ట్రేషన్ ఫీజు, భవన నిర్మాణ పర్మిట్ ఫీజుద్వారా కూడా ఆదాయాన్ని సంపాదిస్తాయి. వీటిలో చాలా వరకూ మునిసిపాలిటీలు ఆర్థికంగా పటిష్ఠంగాలేవు. వీటి వార్షికాదాయం రు. 10,000 నుండి రు. 20,000 వరకూ ఉంటుంది. ఈ మొత్తం ప్రజా సౌకర్యాలకు ఏమాత్రం సరిపోదు. అందువలన ప్రభుత్వం ఆర్థిక సహాయంచేసి తోడ్పడుతున్నది.

ఈ మునిసిపాలిటీలు వీధి దీపాలు, రోడ్లు, పాయఖానాలు, బావులు, పార్కుల నిర్మాణాభివృద్ధుల విషయమై శ్రద్ధవహిస్తాయి. వీటి ఆర్థికవ్యవస్థ సక్రమంగా ఉండని కారణంగా యికనుండి యివి పంచాయతీలుగా మార్చబడుతాయి. ఇందుకు సంబంధించిన బిల్లు కూడా ప్రస్తుతం శాసనసభ ఆమోదానికై ఉంది.

## హైద్రాబాదు కార్పొరేషన్

హైద్రాబాద్, సికింద్రాబాద్ నగరాలకు యిటీవలివరకూ వేర్వేరు కార్పొరేషన్లు ఉండేవి. రెండేండ్ల క్రితం ఉభయ కార్పొరేషన్లు విలీనం కావించబడ్డాయి. హైద్రాబాదు మునిసిపల్ కార్పొరేషన్ పరిపాలనా వ్యవస్థను మెరుగు పరిచే కార్యక్రమం యిటీవల ప్రారంభించబడింది. మునిసిపల్ సిబ్బంది యావత్తూ మార్చబడుతున్నది. ఈ సందర్భంలో ప్లానింగ్‌శాఖ కార్యదర్శి శ్రీ సి నరసింహం లోగడ పరిశీలించి సమర్పించిన నివేదిక అమలు జరపబడుతున్నది.

శ్రీ సంజీవరెడ్డి మంత్రివర్గంలో మునిసిపల్ పరిపాలనా మంత్రి అయిన శ్రీ అలపాటి వెంకట్రామయ్య మొన్నటివరకూ తెనాలి మునిసిపాలిటీకి అధ్యక్షులుగా పనిచేసి మునిసిపల్ పరిపాలనలో ప్రత్యక్షానుభవాన్ని సంపాదించినవారు కాబట్టి రాష్ట్రంలో పట్టణాల అభివృద్ధికి ఏదో కొంత నిర్మాణాత్మకమైన పనినిచేసి చూపాలనే దీక్షలో ఉన్నారు. హైద్రాబాద్ రాష్ట్రరాజధాని గనుక ముందుదానిని అభివృద్ధి పరచాలని ఆయన సంకల్పిస్తున్నారు. తరువాత అంతర్జాతీయ ప్రాముఖ్యంగల విశాఖపట్నం అభివృద్ధి పట్ల ప్రత్యేకశ్రద్ధ తీసుకొంటున్నారు.

హైద్రాబాద్ నగర ఆదాయం కోటి రూపాయిలే ఉండటం ఏమంత సమంజసంగా లేదన్నారు ఇటీవల శ్రీ అలపాటి. మద్రాసు కార్పొరేషన్ ఆదాయం రు. 4 కోట్లున్నప్పుడు, యించుమించు

అంతే వైశాల్యం ఉన్న హైద్రాబాద్ కార్పొరేషన్ ఆదాయం రు. 2.50 కోట్లయినా ఉండాలన్నారు. అందుకు వీలుగా పన్నుల వసూలులో ఉన్న వీకేజీలను సరిచేయాలనే సంకల్పంతో ఉన్నారు.

ఎక్కడెక్కడ వ్యర్థమైన ఖర్చులున్నాయో కనిపెట్టి వాటిని అరికట్టాలనీ ఇంకా వివిధ రూపాలలో ఆదాయాన్ని హెచ్చించాలని చూస్తున్నారు.

కలకత్తా, బొంబాయి, మద్రాసు, ఢిల్లీల తరువాత దేశంలో ఐదవ పెద్ద నగరమైన హైద్రాబాద్ ప్రస్తుతం 64 చదరపు మైళ్ళ వైశాల్యం 13 లక్షల జనాభా కలిగిఉంది. టౌన్ ప్లానింగ్ శాఖ రూపొందించిన బృహత్ ప్రణాళికలో హైద్రాబాద్ నగరంలో సమీప గ్రామాలు, పట్టణాల్ని విలీనంచేసి నగరాన్ని మరింత విస్తృత పరిచే ప్రతిపాదన ఉంది.

కార్పొరేషన్‌కు చట్టబద్ధంగా ఏర్పడే స్థాయీ సంఘం ఉంటుంది. అవి పరిపాలనా, ఆర్థిక వ్యవహారాల్ని పరిష్కరిస్తుంది అదిగాక పనిని సత్వరం నిర్వహించే నిమిత్తం నిర్మాణాలు, లైసెన్సు, కార్మిక విద్యా, ప్రచార, ఇబ్బందులు, న్యాయ, ఆరోగ్య విషయాలకు 8 ప్రత్యేక కమిటీలున్నాయి.

ఈ కమిటీలు తరచు సమావేశమౌతూ అనేక ప్రతిపాదనలను రూపొందిస్తాయి. కార్పొరేషన్ అనేక ప్రసూతి, శిశు సంక్షేమ కేంద్రాల్ని నిర్వహిస్తున్నది. కుష్ఠురోగుల వసతి గృహాన్నికూడా నడుపుతున్నది కొన్ని కుటుంబ నియంత్రణ కేంద్రాల్ని కూడ నిర్వహిస్తున్నది ఆహార పదార్థాల కల్తీలను లేబరేటరీ పరీక్షద్వారా కనిపెట్టి నేరస్థుల్ని ఆహార పదార్థాల కల్తీ నిరోధ చట్టం క్రింద శిక్షించడం జరుగుతున్నది.

హైద్రాబాద్ కార్పొరేషన్ డ్రయినేజిపథకాన్ని పెరుగుతున్న నగరావసరాలకు వీలుగా పెంపొందిస్తున్నది. బృహత్ ప్రణాళిక చివరకు ఆమోదించబడి, అమలు జరిగితే ఆంధ్రప్రదేశ్ రాజధానీ నగరం మరింత శోభాయమానంగా రూపొందుతుందనడంలో సందేహంలేదు

## విజయవాడ మునిసిపాలిటీ

హైద్రాబాద్ తరువాత రాష్ట్రంలో ఎక్కువ ప్రాముఖ్యం గలది విజయవాడ మునిసిపాలిటీ. 1959 లో యీ మునిసిపల్ కౌన్సిల్ రద్దు కావించబడింది. ఇప్పుడిది స్పెషల్ ఆఫీసర్ పరిపాలనలో ఉంది. 1888లో ఏర్పడిన యీ మునిసిపాలిటీ వాణిజ్య కేంద్రం అయినందున త్వరితగతిని అభివృద్ధిచెంది సెలక్షన్ గ్రేడ్‌కు వచ్చింది. వైశాల్యం 9 చదరపు మైళ్ళే అయినా జనాభా 2,33,635 ఉంది. ఆదాయం 55 లక్షల వరకూ ఉంది. నీటి సరఫరా అభివృద్ధికీ, డ్రెయినేజికి పథకాలు ఆమోదించబడి అమలు జరుగుతున్నాయి.

తృతీయ ప్రణాళికా కాలంలో రోడ్లకు, సిబ్బంది యిండ్లకు పాఠశాల భవనాలు, ఆటస్థలాలు, స్టేడియం, వైద్య సంస్థలు, పాయిఖానాల భవనాలకు, మార్కెట్లు, తక్కువ ఆదాయం వచ్చే వారి గృహనిర్మాణానికి, మురికిపేటల నిర్మూలనకు, ముత్యాలంపాడు కాలనీకి, నీటి సరఫరా అభివృద్ధి, డ్రయినేజీలకు రు. 4,18,29,000 ఖర్చు అంచనా వేయబడింది.

## విశాఖపట్నం మునిసిపాలిటీ

ప్రథమశ్రేణి రేవు, నౌకాశ్రయం, హిందూస్తాన్ నౌకాశ్రయం కాల్టెక్సునూనె శుద్ధి కార్మాగారం, విమానాశ్రయం, పారిశ్రామిక ఎస్టేట్, ఐదుమైళ్ళ సముద్రతీరం గల యీ పట్టణం ఆగ్నేయాసియాలోనే ఎంతో ప్రాధాన్యాన్ని పొందింది.

1858 లో మునిసిపాలిటీగా రూపొందిన విశాఖపట్నం యిప్పుడు సెలక్షన్ గ్రేడ్‌లో ఉంది. 11 మైళ్ళకు మించిన వైశాల్యం గల యీ పట్టణం జనాభా 1,78,431. ఇటీవల యీ మునిసిపల్ కౌన్సిల్‌కూడా రద్దుచేయబడి, ఇప్పుడు స్పెషల్ ఆఫీసర్ పరిపాలనలోఉంది దానికి రు. 30 లక్షల వరకూ ఆదాయం ఉంది. పట్టణానికి మంచినీటి సరఫరా సౌకర్యం ఉన్నా డ్రెయినేజి పథకం యింకా యేర్పడలేదు ఇకముందు యేర్పడే అవకాశం ఉంది.

తృతీయ ప్రణాళికాకాలంలో మార్కెట్లు, భవనాలు, విద్య, రోడ్లు నీటి సరఫరా, డ్రెయినేజి, మురికిపేటలు మున్నగు పథకాలకు రు. 12,45,21,000 ఖర్చు అంచనా వేయబడింది. ఈలోగా రు. 5 లక్షలతో పట్టణాభివృద్ధి ట్రస్టును ఏర్పాటు చేయాలని సంకల్పించబడింది. నీటి సరఫరాకు సంకల్పించబడిన పథకం భవిష్యత్‌లో ఎన్నడూ నీటి యిబ్బంది రాకుండా చూసేటంతటి విస్తృతమైనది

## గుంటూరు మునిసిపాలిటీ

గుంటూరు సంస్కృతికి, విజ్ఞానానికీ కళలకు నిలయమైన

చరిత్రాత్మకమైన పట్టణం. ఇక్కడికి 20 మైళ్ళలోనే బౌద్ధ విశ్వవిద్యాలయం వర్ధిల్లిన అమరావతి ఉంది. విర్జీనియా పొగాకు ఎగుమతి దృష్ట్యా యిటీవలగా గుంటూరు అంతర్జాతీయ మార్కెట్‌లో ప్రముఖస్థానాన్ని ఆక్రమించుకొంది. 12 చదరపు మైళ్ళ వైశాల్యం 1,87,068 జనాభాగల గుంటూరు మునిసిపల్ కౌన్సిల్ కూడా రద్దు చేయబడింది. ఆదాయం రు. 32 లక్షలకు పైగా ఉంది. పట్టణానికి మంచినీటి సరఫరా ఉంది. రు. 108,33 లక్షల ఖర్చుతో భూగర్భ డ్రయినేజి పథకం మంజూరు అయింది. అందులో రు 59.24 లక్షలతో కూడిన ప్రథమ దశ అమలు జరుగుతున్నది. డ్రయినేజి పథకంతోసహా వివిధ కార్యక్రమాల్ని రు. 79,00,000 తో తృతీయ ప్రణాళికలో చేపట్టాలని మునిసిపాలిటీ సంకల్పిస్తున్నది.

## వరంగల్ మునిసిపాలిటీ

తెలంగాణలో హైద్రాబాద్, సికింద్రాబాద్‌ల తరువాత పెద్ద పట్టణం వరంగల్. చారిత్రక ప్రాముఖ్యంగల యీ పట్టణంలో ప్రాంతీయ ఇంజనీరింగ్ కళాశాల ప్రాంతీయ వైద్య కళాశాల, ప్రభుత్వ శిక్షణ కళాశాల పొలిటెక్నిక్ కూడా ఉన్నాయి. 1952 లోనే యిది మునిసిపాలిటీగా రూపొందించ బడింది. 22,23 చదరపు మైళ్ళ వైశాల్యం 1,56,163 జనాభాగల యీ మునిసిపాలిటీలో వరంగల్, ఖాజీపేట అనే రెండు రైల్వే స్టేషన్లున్నాయి; 1962 ఆగస్టు 15వ తేదీకి సిద్ధమయ్యే వరంగల్ కొత్త నీటి సరఫరా పథకం వరంగల్ పౌరులకు 20 ఏండ్లవరకూ నీటి యిబ్బంది లేకుండా చేస్తుంది. తృతీయ ప్రణాళికలో రు. 2,3 కోట్ల ఖర్చుతో డ్రయినేజి, నీటిసరఫరా అభివృద్ధి, తక్కువ ఆదాయం గలవారికి గృహనిర్మాణం, ఆఫీసు భవనాలు, రోడ్లు లాటి కార్యక్రమాలు చేపట్టబడుతాయి. త్వరలో కార్పొరేషన్ అయ్యేటంత శరవేగంగా నగరం అభివృద్ధి చెందుతున్నది.

ఇలాగే రాష్ట్రంలో యింకా రాజమండ్రి, కర్నూలు, కాకినాడ, ఏలూరు, నెల్లూరు, మచిలీపట్నం, నిజామాబాద్, ఖమ్మం లాటి అనేక విస్తృతమైన అభివృద్ధి పథకాలు చేపట్టబడుతున్నవి. మొత్తం రాష్ట్రంలో ఆంధ్రప్రాంతంలో 48 మునిసిపాలిటీలు, తెలంగాణలో 18 నగర మునిసిపాలిటీలు ఉన్నాయి. రాష్ట్ర జనాభాలో ఆరోవంతుమంది యీ పట్టణాలలో ఉంటున్నారు

## గ మ ని క

గత నెల ఆంధ్ర ప్రదేశ్ వెలుగుబాటలు వ్యాసంలో (10వ పుట) కళాశాలల విషయం చివర యీ క్రింది పంక్తులు చేర్చి చదువుకోవాలి.

— "కాని ప్రభుత్వం స్వయంగా ఆదిలాబాద్‌లో కళాశాలను నెలకొల్పకపోయినా అంతకుముందే ప్రైవేటు సంస్థ క్రింద ఉన్న కళాశాలను 1959 ఫిబ్రవరిలో ప్రభుత్వం స్వీకరించడంతో యీ కొరత తీరిపోయింది".



వెను దిరిగి చూడనేల జీవితము వైపు
వ్యర్థ యాపన మౌను స్మృత్యర్థ మెల్ల
అంకురించుచునుండు మారాకు కొరకు
రాలిపోవుచు నుండు కారాకు, చెలువ!

"మధుగీత"

کیلی یمب کتیٔ پتیؤ اتھؤ
کونگ کوئ رنگ کرنا ویو
زاوِلِ شال دونیو تیٔیؤ اتھؤ
کونگ کوئ رنگ کرنا ویو

"కుంకుమ వర్ణములో దానిని ముంచి తేలుస్తాను - దానికి సరిపడే శాలువ కుంకుమ రంగులోనే కుడతాను." అన్నదామె.

## కమనీయమైన కుంకుమ రాగం

తన నూతన గృహాలంకరణలో నిమగ్నమైన కాశ్మీరీ పెళ్ళికూతురు చక్కని ఊలుతో తన వాజని కుట్టుకోవాలని నిశ్చయించుకుంది.

# చేనేత వస్త్రాలు



మన సంప్రదాయానికి చిహ్నాలు

DA 61/502

# పండితారాధ్య చరిత్ర

శ్రీ నిడుదవోలు వేంకటరావు

పాల్కురికి సోమనారాధ్యుని ప్రసిద్ధ కృతియగు పండితారాధ్య చరిత్రను ఆంధ్ర గ్రంథమాలలో 30వ సంఖ్య గల ప్రమరిణగా నాంధ్ర పత్రికాధిపతులు క్రీ. శ. 1939లో ప్రకటించిరి. దానికి పరిష్కర్తలు కీ. శే. కళాప్రపూర్ణ చిలుకూరి నారాయణ రావుగారు. పరిష్కర్తలు గ్రంథమును పరిష్కరించుటయే గాక దానికి 348 పుటల పెద్ద ఉపోద్ఘాతమును, 197 పుటల సంజ్ఞా, అచ్చిక పదవివరణ పట్టికయు చేర్చిరి. వాస్తవముగా సుపరిష్కృతమగు నీముద్రణము వలననే పాల్కురికి సోమనాథుని కవితా విశేషములను, పాండితీ విశిష్టతను నాంధ్రలోకము గ్రహింపగల్గినది. కేవలము భాషా పరిణామ దృష్టితో నిందలి యుపోద్ఘాత పదపట్టికలను పరిశీలించిన, పరిష్కర్తల యఖండ భాషా పరిశ్రమ సువ్యక్తము కాగలదు.

ఇట్లున్నను నీ పరిష్కరణ మూలముననే పాల్కురికి సోమనాథుని కాలనిర్ణయ వివాదములు—వీరశైవమత సంప్రదాయములను గూర్చి విపరీతాభిప్రాయములు దేశమునందు వ్యాప్తమైనవని చెప్పక తప్పదు. దీనికి కారణమాదీర్ఘోపోద్ఘాతమున, పండితారాధ్య చరిత్రమున గల గ్రంథస్థ విషయ వివరణముకన్న తక్కిన విషయములు ప్రధానస్థాన మాక్రమించినవి. సువైదికమగు నారాధ్య సంప్రదాయ ప్రతిపాదనకు పరమ ప్రామాణికమై, ద్విపద కావ్యములయందద్వితీయమై, పాల్కురికి పాండిత్యమునకు, పరమావధియై, తెలుగువారి తొలి విజ్ఞాన సర్వస్వము, అని చెప్పదగిన యీ గ్రంథము నందలి శైవమతతత్త్వము—సాహితీ విశిష్టత—సంస్కృతి విజ్ఞాన సంపత్తి మొదలగునవి యీ ముద్రణమువలన ప్రవ్యక్తము కాకుండగనే యుండి పోయినవి.

ప్రస్తుతమీ పండితారాధ్య చరిత్ర ముద్రణప్రతులు లభించుట లేదు. కాబట్టి యీ గ్రంథమును పునర్ముద్రణము చేయుట యత్యావశ్యకమైయున్నది. వేఱొక దృష్టితో చూచిన నీగ్రంథము తప్పక ముద్రింపవలసినదే. చూడుడు.

నేడు జాతీయ సమైక్యతాసమస్య స్వతంత్ర భారతీయ నాయక వర్గమును హెచ్చుగా నాకర్షించుచున్నది. ఆసమస్యా పరిష్కారమునకు భాషా సమైక్యత ప్రధాన సాధనము—తెలుగుభాషలో ప్రప్రథముగా నేమి—చివరనేమి. పూర్వ భారతవర్ష ప్రధాన భాషయగు సంస్కృతముతో గూడ, రాష్ట్రేతర భాషలగు, ద్రవిడ కర్ణాట—మహారాష్ట్రాది భాషల స్వరూప స్వభావములను ప్రదర్శించినది పండితారాధ్య చరిత్రయే ఇరువది మూడేండ్ల క్రింద పరిస్థితులిప్పుడు లేవు. వివిధ భాషా ప్రయుక్త రాష్ట్రముల, భాషా వాఙ్మయ చరిత్ర మీనాడుగ్రహించుటకు, నర్థము చేసికొనుటకు తగిన యవకాశములు గలిగినవి. ముఖ్యముగా దక్షిణ భారతదేశమున చెలరేగుచున్న భాషా వైషమ్యములు పండితారాధ్య చరిత్ర పునర్ముద్రణ మూలమున సమసి పోవుటయేగాక దాక్షిణాత్య జాతీయ సమైక్యత భావమునకు నది దోహదము గల్పింపగలదు.

ఆంధ్ర గ్రంథమాలా ముద్రణమున * పరిష్కర్తలు తమకు ముందీగ్రంథమునకున్న వ్రాతప్రతులను గాని ముద్రణ ప్రతులను గాని సమగ్రముగా పరిశీలించినట్లు కానరాదు. నేటి గ్రంథ పరిష్కరణ విధానమునను సరించి తెలుపదగిన తాళపత్ర ముద్రిత గ్రంథ వివరణమిందులేదు. పరిష్కర్తలు పీఠిక ప్రారంభములో

"పండితారాధ్య చరిత్రము అచ్చుపడిన గుజిలీ ప్రతనిన్నీ

* ఇట్టి పట్టుల కీర్తిశేషులగు నారాయణరావుగారి యందు నాకగౌరవ భావమున్నదని పాఠకలోకము తలపకుండుగాత. ఇది విషయ ప్రధానమైనదిగాని వ్యక్తిగత మెంతమాత్రమును కాదు.

ఆంధ్ర ప్రదేశ్

కొన్ని తాటియాకుల ప్రతులనున్నూ ప్రభుత్వ ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారములోని బ్రౌనుదొర కొన్నిపాఠములు గుర్తించి యుంచిన రెండు కాగితపు సంపుటములనున్ను దగ్గిర పెట్టుకొని" అని మాత్రము వ్రాసిరి. కాని గ్రంథమును పరిశీలింపగా, పరిష్కర్తలు కేవలము పండితారాధ్య చరిత్రకుగల సంస్కృతానువాదమునుబట్టి గ్రంథమును పరిష్కరించి పాఠనిర్ణయము చేసినట్లున్నదిగాని–బ్రౌను దొరవారి ప్రతిగూడ సంపూర్ణముగా సంప్రతించినట్లు కానరాదు

1939 లో ముద్రణమునకు పండితారాధ్య చరిత్రమునకు క్రింది ముద్రణములు గలవు.

### 1. వరంగలు ముద్రణము * (క్రీ. శ. 1908)

శ్రీ శివధర్మ వర్ధనీ రామలింగేశ్వర ముద్రాక్షరశాలయందు సౌమ్య సంవత్సరాషాఢ శుద్ధ 15 శనివారము నాటికి శ్రీముదిగొండ శంకరారాధ్యశీల వారిచే పరిష్కరింపబడినది. శ్రీ కొడిమేల రాజా లింగారాధ్యుల వారు ముద్రణ కర్తలు.

### 2. విశాఖపట్టణముద్రణము (క్రీ. శ. 1915)

శ్రీ విజయ రామచంద్ర ముద్రాక్షరశాలయందు ఆనంద సం॥ ఆషాఢ బ॥ 13 సోమవారము నాటికి శ్రీ గురుమల్లికార్జున స్వాములవారి సేవకుడగు చింతకుంట పసపుల నాగయయోగిచేతను విడుదవోలు సుందరము పంతులువారి చేతను ముద్రింపబడినది.

పైవానిలో తొలిప్రతియగు వరంగలు ప్రతియందు లేఖక ప్రమాదాది దోషములు కొన్ని సవరింపబడి యున్నవి. పాఠములను గొన్నిటిని పరిష్కర్తలు సవరించి నపట్లుగూడగలవు. రెండవదియగు విశాఖపట్టణ ప్రతియందు లేఖక ప్రమాదములు మాత్రమే పరిష్కరింపబడినవి. మూలపాఠములట్లే యున్నవి యున్నట్లుగా ముద్రితములైనవి. ప్రామాణిక పాఠనిర్ణయము పట్లనీపద్ధతినున్న గ్రంథములే విలువగలవి యని విమర్శకులకు దెలిసిన విషయమే.

### 3. గణసహస్రమాలిక ముద్రణము (క్రీ. శ. 1897)

క్రీ. శ. 1908లో ముద్రణము వెలిసినను పండితారాధ్య చరిత్రలో సహస్రగణమాలిక–యున్న భాగము క్రీ. శ. 1897 లోనే ముద్రితమైనది ఆకాలమున నేలూరి నివాసులు శ్రీ మామిలా కందుకూరి శ్రీశైల వీరభద్ర ప్రసాదరావుగారు– "శివ గ్రంథ ముక్తావళి" పత్రికను నేలూరియందు నెలకొల్పి పండితారాధ్య చరిత్రను ముద్రింపదలపెట్టిరి. కాని **బసవ పురాణమునే తొలుత ముద్రింపుడని యప్పటిశైవులు కోరుటచే నాగ్రంథమును పూర్తిగ ముద్రించి, యావెనుక పండితారాధ్య చరిత్రమున సహస్రగణ మాలికను ముద్రించిరి

కర్ణాటాంధ్ర శైవ వాఙ్మయముల 'సహస్రగణమాలిక మల్లికార్జున పండితోపజ్ఞము. అదిశైవులకు పారాయణ గ్రంథము. పాల్కురికి సోమనాథుడు పండితారాధ్య చరిత్రమున దాని నంతయు సంధానించి యున్నాడు. గ్రంథాంతమున

ద్వి॥ "అరయనీకృతి సార్థమగు చతుర్థ ప్ర
కరణ మధ్యమున సంకలితమై వెలుగు
నవ్యగణ సహస్ర నామస్తవంబు
భవ్యంబు" అని ప్రత్యేకముగా పేర్కొన్నాడు.

ఈ గణ సహస్ర మాలికయేగాక–యీ మాలిక పూర్వోత్తరసందర్భములుగూడ నాగ్రంథమున ముద్రితమైనవి ***

---

* క్రీ. శ. 1922లో శివతత్త్వసార పీఠిక వ్రాయునపుడు కీ. శే. కొమర్రాజు వేంకటలక్ష్మణరావుగారీ వరంగలు ముద్రణమునే యుపయోగించిరి.

** క్రీ. శ. 1897 లో ముద్రితమైన బసవ పురాణము నీనాటికి విలువగలదే–ఆ గ్రంథమువెనుక–కందుకూరి వారి వంశావళి– నిరువదేడు తరములు–శ్రీశైల వీరభద్ర ప్రసాదరావుగారి వరకు గలదు. ప్రథమముద్రణ ప్రతులందు నెన్నియో విశేషములు ద్వితీయ ముద్రణమున లోపించినవి–వానివలన నెన్నియో తెలియదగిన విషయములు మరుగుపడినవి.

*** ఈ గ్రంథము 1897 ఏలూరిలో బాలాత్రిపురసుందరీ ముద్రాక్షరశాలలో ముద్రితమైనది. ఇందు గణసహస్ర మాలికయేగాక
1. వాలెకోటయ విరచితమగు ఎల్లమంద కోటప్పరగడ
2. పాల్కురికి సోమనాథరచిత సోమనాథ స్తవము
3. నమశ్శివాయాష్టకము
4. శ్రీ దక్షిణా మూర్త్యష్టకము
5. బసవాష్టకము–సోమనాథ రచితము
6. బసవస్తవము–పాలకొలను బసవన్నరచితము

ప్రస్తుత ముద్రణమున—మహిమ ప్రకరణము—69వ పుటలో

"ద్వి. "అంతనక్కడ మల్లికార్జునారాధ్యు
దెంతయురయమునసేగుచుమున్న"

మొదలుకొని 99 పుటలోనున్న

ద్వి. పుష్పించు నంతన పురహరుకరుణ
నొప్పారనుదయించె నూర్ధ్వ నేత్రములు

అన్నంతవఱకు—30 పుటల గ్రంథము గలదు.

—విశాఖ ముద్రణ ప్రతి-ప్రామాణికత—

విశాఖముద్రణ ప్రతి—బ్రౌను దొరవారి ప్రతులతో సమాన మగు ప్రామాణికత గలది. దీనిని పరిష్కర్తలు చూడక పోవుటచే గ్రంథమునందెన్నియో లోపములు గలిగినవి.

1. పై రెండింటియందు—పండితారాధ్య చరిత్రమునందలి ప్రకరణములలోని విషయములన్నియు వచన రూపముగ వ్రాయబడినభాగము గలదు. ఆ వచన భాగము ప్రస్తుత ముద్రణమునలేదు అవచన భాగమున నేయే ప్రకరణముల నెన్నెన్ని ద్విపదలున్నవో ఆసంఖ్య కూడా యీయబడి యున్నది.

2. విశాఖ పట్టణ ప్రతిగూడ నేడలభ్యముగావున దాని ముఖపత్రము నిట నిచ్చుచున్నాను,

శ్రీ శివాయనమః
శ్రీమాన్ జగద్గురు మల్లికార్జున
శ్రీ పండితారాధ్య చరిత్ర
శ్రీమదష్ట భాషా సుకవిత్వరచనా
బిరుదాంకితుఁగు పాల్కురికి
సోమనారాధ్య కవిచే రచయింపబడినది,

ఇది

మ|| రా|| విడుదవోలు సుందరము పంతుల వారిచేతను
శ్రీగురు శ్రీగిరిదిగంబర మల్లికార్జున స్వాములవారి సేవకుడగు
చింతకుంట పసపుల నాగయ్యగారి చేతను

మూడు ప్రతులు చూచి సవరింపబడి

చింతకుంట పసపుల నాగయ్యగారిచే
శ్రీ విజయ రామచంద్ర ముద్రాక్షరశాలయందు
ముద్రింపించి ప్రకటింపబడియె
విశాఖపట్టణము

1914 ఆనంద సం||ర ఆషాఢ బ|| 13 సోమవారము
వెల: రూపాయి.

పైమూడు ప్రతుల వివరములు. మూడును తాళపత్రప్రతులే.

1వ ప్రతి—నాగయయోగిగారు శ్రీ శైలమునుండి తెచ్చినది,

2వ ప్రతి—శ్రీ బిక్కవలి స్వామిగారి ప్రతి.

3వ ప్రతి—సుందరము పంతులవారి యొద్దప్రతి—

| ప్రకరణము | పేరు | ద్విపదసంఖ్య |
|---|---|---|
| ప్రథమ ప్రకరణము | దీక్షాప్రకరణము | 2000 |
| ద్వితీయ ,, | పురాతన ,, | 2720 |
| తృతీయ ,, | వాద ,, | 2021 |
| చతుర్థ ,, | మహిమ ,, | 2120 |
| పంచమ ,, | పర్వత ,, | 3050 |
| | | 11911 |

నేటి ముద్రణమున ద్విపదలకు సంఖ్యలు లేవు. గ్రంథ స్వరూపమును నిర్ణయించు నిట్టి భాగ మందు లేదు.

పై ద్విపద సంఖ్యా విశేషములు తెలియక పోవుటచే గ్రంథమున పెక్కుచోట్ల "ఈ పంక్తులు వ్రాత ప్రతులలో గాని, ప్రాత ముద్రిత ప్రతిలోగాని లేవు. సంస్కృతానువాదము లేదు." అని వ్రాయబడియున్నది. కాని యీ వ్రాత యెంతమాత్రమును సరి కాదు. ఒక్క యుదాహరణము మాత్రమే చూపెదను.

పుట 189

" చిన్మయానంద వశీకృత బుద్ధి
స్ఫురియింప శివుఁజూచి చూచి క్రాలుచును.

పుటయడుగున యధోజ్ఞాపికలో

ఈ పాదమునకు తరువాత బ్రౌనుప్రతిలో

"అలీల ప్రమథ గణానందవార్థిఁ
దేలుచు మునుగుచు దృఢతర భక్తి
శివునిచిత్తంబులో జేర్చివెందియును.
శివుకంటె నెన్నంబు దవులక యుండి"

అనే పంక్తులున్నవి. ఈ పంక్తులు వ్రాత ప్రతులలో గాని ప్రాత ముద్రిత ప్రతిలోగాని లేవు వీనికి సంస్కృతాను వాదము లేదు."

కాని యీ పాదము లన్నియు విశాఖ ప్రతియందు 72వ పుటలో నున్నవి.

మచ్చున కొక్కటి చూపితిని గాని గ్రంథమంతటను నిట్టి

పట్టులు గలవు ఇక పాఠభేదములను గూర్చి శబ్ద స్వరూప నిరూపణను గూర్చి చెప్పదగిన విషయములు త్రవ్వితండములు.

మన భాషలో ప్రాయికముగా సాహిత్య మంతయును సంస్కృత భాషానువాదములే యైనను, శివకవుల గ్రంథములను నందు ముఖ్యముగా పాల్కురికి సోమనాథుని కృతులందుల కప వాదములు—సోమనాథుని బసవ పురాణమును పండితారాధ్య చరిత్రమును తెలుగునుండి కన్నడమునకు నావెనుక సంస్కృతమునకు భాషాంతరీకరింపబడినవి. ఆయా భాషానువాదములలో స్పష్టముగా పాల్కురికి సోమనాథునిస్తుతించి యాతని తెలుగు గ్రంథమునను వదించుచుంటిమని చెప్పుటచే, తెలుగు గ్రంథమే యితర భాషాంతర గ్రంథములకు మూలములనుట నిర్వివాదము. ఇట్టివి తెలుగు సాహితీ గౌరవ విశిష్టతలను తేట పఱచునవి. అట్టి గౌరవమునకు పాత్రమైన పండితారాధ్య చరిత్రమును సంపూర్ణ వివరణలతో, *సప్రామాణిక పాఠములతో సమగ్ర వ్యాఖ్యతో, సమీచీనముగ పునర్ముద్రణమును సత్వరము గావింతురు గాక యని యాంధ్ర విద్వల్లోకమునభ్యర్థించు చున్నాను.

---

* పండితారాధ్య చరిత్రమునకు 17 తాళపత్రప్రతులొక్క మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారముననే యున్నవి. అందులో నాలు సమగ్రములు-తక్కినవి యసమగ్రములు. అవియైన భాషోద్ధారకులు బ్రౌనుదొరవారు, సంపాదించి భద్రపఱచినవి. ఇంకను కన్నడదేశమున శైవమఠములయందు, నారాధ్యులయిండ్లయందు నీ గ్రంథమునకు వ్రాతప్రతులుగలవు. తంజావూరు పుస్తక భాండాగారమున నొక్కప్రతి యసమగ్రము గాగలదు. వీనినన్నింటిని సేకరించి, పాఠ విర్ణయములను చేసి గ్రంథము పరిష్కరించి ప్రకటింపదగును.

*******************

# విద్యుచ్ఛక్తి సరఫరా

1965 ఏప్రిల్ నెలలో విజయవాద ఆపరేషన్ సర్కిలులోని దిగువ గ్రామాలకు విద్యుచ్ఛక్తిని సరఫరా చేశారు.

| గ్రామం | | తాలూకా |
|---|---|---|
| వింజమూరు | ... | ఉదయగిరి |
| చంద్రపాడియా | ... | ఆత్మకూరు |
| రాజవోలు | ... | ఆత్మకూరు |
| కలిగిరి | ... | ఆత్మకూరు |

1962 మార్చిలో అదే సర్కిల్‌లోని దిగువ గ్రామాలకు విద్యుచ్ఛక్తిని సరఫరా చేశారు.

| గ్రామం | | తాలూకా | | జిల్లా |
|---|---|---|---|---|
| ఇబ్రహీంపట్నం | ... | విజయవాద | ... | కృష్ణా |
| తురకపాలెం | ... | డిటో | ... | ,, |
| (కోసూరు సరిహద్దు) | | | | |
| శ్రీకాకుళం | ... | డిటో | ... | ,, |
| చినపారుపూడి | ... | గుడివాద | ... | కృష్ణా |
| దండిగానెపూడి | ... | గుడివాద | ... | ,, |
| చింతరెడ్డిపాలెం | ... | నెల్లూరు | ... | నెల్లూరు |

1962 ఏప్రిల్ నెలలో అనంతపురం సర్కిల్‌లోని దిగువ గ్రామాలకు విద్యుచ్ఛక్తిని సరఫరా చేశారు.

| గ్రామం | | తాలూకా | | జిల్లా |
|---|---|---|---|---|
| కృష్ణంసెట్టిపల్లె | ... | గిద్దలూరు | | కర్నూలు |
| మేలాపురం | ... | హిందూపురం | ... | అనంతపురం |

1962 ఏప్రిల్ నెలలో తెలంగాణా సర్కిల్‌లోని హైద్రాబాదుజిల్లా, ఇబ్రాహీంపట్నం తాలూకాలోని సైదారెడ్డిగూద (మరిచర్ల సరిహద్దు) గ్రామానికి విద్యుచ్ఛక్తిని సరఫరా చేశారు. 1962 మే నెలలో ఆదిలాబాదు జిల్లా, ఖానాపూర్ తాలూకాలోని దస్తూరాబాదు గ్రామానికి విద్యుచ్ఛక్తిని సరఫరా చేశారు.

పద్మశ్రీ

శ్రీ సి. నరసింహం

ఐ. ఏ. యస్.

పట్టణ ప్రాంతాల అభివృద్ధి ఇప్పుడు ఎక్కువగా జరుగుతోంది. క్రమ క్రమంగా ప్రతి పట్టణంలోను కొత్త కొత్త పేటలు వెలుస్తూ ఉన్నాయి. వాటితో పాటు మురికి పేటలు కూడా ఎక్కువవుతున్నాయి. పట్టణాల సంఖ్య కూడా పెరుగుతూనే ఉంది. 1951లో మన రాష్ట్రంలో లక్షకు మించిన జనాభా గల పట్టణాలు ఆరుండేవి. 1961లో అటువంటివి 11కు పెరిగినవి. మున్ముందు పట్టణాభివృద్ధికి కృషి ఇంకా తీవ్రంగా జరుగుతుంది. ఒక విధంగా చూస్తే మనము నగర నాగరికత యుగంలో ఉంటున్నామా అనిపిస్తుంది. క్రమేణా పట్టణాల ప్రభావం పల్లెప్రాంతాలన్నిటికీ సోకుతున్నది. మరికొంత కాలంపోతే పట్టణ ప్రభావానికి లోనుగాని గ్రామీణ ప్రాంతమే ఉండదేమో అనిపిస్తుంది.

పట్టణ వ్యాప్తికి కారణాలు — పరిశ్రమలు పెంపొందడం, పల్లెలలో జనాభా వత్తిడి ఎక్కువ కావడం, చాలినంత పని పల్లెలలో లేకపోవడం మూలంగా ఉపాధికోసం ప్రజలు పట్టణాలకు తరలి వెళ్లడం, పైగా, కొంతమంది మెరుగైన జీవన పరిస్థితి కోసం, విద్యాభివృద్ధికోసం కూడా పట్టణాలు చేరుకొంటున్నారు. పట్టణాలలో నివసించే వేలాది కుటుంబాల క్షేమం చాలా ముఖ్యమైన సమస్య. ఎందువల్లనంటే, నేటి పట్టణాల భౌతిక స్వరూపమంతా దీనిపై ఆధారపడి ఉన్నది. అందుకనే పట్టణ పరిపాలన అందు నివసించే కుటుంబాలజీవనస్థితికి అనుగుణ్యంగా ఉండాలి. పట్టణ పరిపాలన గురించి మనం మాట్లాడేప్పుడు, ఆ పురపాలక సభ్యుని పాత్ర పరిశీలించాలి. పౌర సమస్యల విషయంలో తాను ప్రజలకు ఎంత వరకు సేవచేయగలడన్న విషయాన్ని గూర్చికూడా ఆలోచించాలి. పురపాలక సభ్యుడు తను ఎన్నుకోబడిన ప్రాంతానికి ప్రాతినిధ్యం వహించాలంటే అక్కడి ప్రజల అవసరాలను ఎల్లప్పుడూ దృష్టిలో ఉంచుకోవాలి. అంతేగాక తాను ఆదర్శ పౌరుడుగా ప్రవర్తించాలి. తన నడవడి, చేతలు ఇతరుల దృష్టిని ఆకర్షించి మెప్పును పొందాలి. అప్పుడే తాను పౌరుల యొక్క సహకారాన్ని, గౌరవాన్ని సంపాదించుకోగలుగుతాడు. ఈ రెండు లేనిదే పురపాలక సభ్యుడు తన విద్యుక్త ధర్మాన్ని నెరవేర్చలేడు.

శక్తివంతమైన పురపాలక సభ్యుడు తన వార్డులో చక్కని జీవనావసరములను ఏర్పాటు చేయుటకు శ్రద్ధవహించవలెను. ఐతే అవి కల్పించుటలోను, వాటిని ఉపయోగించుటలోను, పౌరులు తమంతట తాము ఏమి చేయవలెనో, సమిష్టిగా ఏమిచేయవలెనో, పురపాలక సంఘము ఏమి చేయవలెనో, గుర్తించి ఎవరి విధులను వారు చేయునట్లు చూడవలెను.

పౌరుల అవసరాలు, కోరికలు పురపాలక సంఘముయొక్క ఆర్థిక స్థితిని గమనించి ఎంత వరకు ఆచరణీయమో గుర్తించవలెను. అదనముగా సొమ్ము కావలెనన్న, పౌరులే దానిని భరించవలెనన్న సంగతి జ్ఞాపకముంచుకొని వారిదృష్టికి తీసుకరావలెను. పురపాలక సంఘము తమదని, దానికి కావలసిన ధనము తామే ఇవ్వవలెనని, తమ అవసరాలను పురపాలక సంఘము ద్వారా తామే తీర్చుకొనవలెనని, పురపాలక సంఘము యొక్క ఆస్తులను ఏర్పరచిన సౌకర్యములను దుర్వినియోగము చేసిన నష్టమంతా తమదేనని పురపాలక సభ్యుడు పౌరులందరకు నచ్చజెప్పి వారి సహకారమును పొందవలెను.

బాధ్యతవంతమైన పురపాలక సభ్యుడు తను ఎన్నుకోబడిన ప్రాంతాలలో కావలసిన సౌకర్యాలన్నీ చేకూరేటందుకు అనుక్షణంకృషిచేయాలి. పురపాలక సంఘంలో తన కు లభించిన అందుకై సద్వినియోగం చేయాలి. కాని తన ప్రాంతీయ అవసరాలతో పాటు అందరి అవసరాలు కూడా గమనించాలి. సభ్యుని ప్రధానాశయం తన వార్డే అయినప్పటికీ యావత్తు పట్టణాభివృద్ధిని, ప్రజలందరి అవసరాలను ఆతనెప్పుడూ మరచిపోగూడదు. ఇతర ప్రాంతాల అభివృద్ధికి, పట్టణ సమగ్రాభివృద్ధికి

తీసికొన్న నిర్ణయాలపట్ల అతడు విముఖత చూపగూడదు. మరో మాట చెప్పాలంటే. పట్టణం యావత్తుకూడా ఒకే భాగంగా భావించాలి. ఒక ప్రాంతంపట్ల తీసుకొన్న నిర్ణయపు ప్రభావం క్రమంగా మిగిలిన ప్రాంతాలకు కూడా పాకుతుందన్న సంగతి గమనించాలి. అందువల్ల, పట్టణ సంపూర్ణాభివృద్ధికి సంబంధించిన విషయాలలోను, ఇతర ప్రాంతాల సమస్యలలోను అతడు ఎల్లప్పుడూ సహకరించాలి. ఆదర్శ సభ్యుడు, స్థానిక అవసరాలకన్న పట్టణ మంతటికీ ఉపకరించే అవసరాలకు ప్రాధాన్య మివ్వాలి. ఏ ప్రాంతంలో ఏ వసతి ప్రజలకు ఎక్కువగా ఉపకరిస్తుందో ఆలోచించి ఆ ప్రాంతంలో ఆట్టివసతిని కల్పించుటకు పురపాలక సభ్యుడు పాటుపడాలి.

తనచేత సేవ చేయించుకోడానికి ప్రజలకు హక్కున్న మాట నిజమే. కాని వారికి కొన్ని పౌర బాధ్యతలున్నాయి. పట్టణ జీవితంలో ప్రతిపౌరుడు నిర్వర్తించవలసిన బాధ్యతలు ఎన్నో ఉన్నాయి. ఆయా బాధ్యతలను వారు సరిగ్గా నిర్వర్తించిననాడే అందరి జీవితం సుఖదాయకమవుతుంది. కాని యీ పని తానొక్కడూ చేయలేడు. తాను పౌర సంఘాలను నెలకొల్పి వాటిద్వారా ప్రజలకు వారివారి బాధ్యతలను గుర్తింపచేయాలి. ఈ పౌర సంఘాలు కేవలం నామ మాత్రమే కాకుండా నిర్విరామంగా కృషిచేసేటట్లు చూడాలి. అందుకుగాను, అందులోని సభ్యులైతేనేమి, కార్యకర్తలైతేనేమి ఉత్తమ వ్యక్తులుగా ఉండాలి. కొన్ని విషయాలలో బాధ్యత కల్పించుకొని పౌరసంఘాలు వ్యవహరించినప్పటికీ వాటి కృషి మాత్రమే సరిపోదు. ప్రతి వీధిలోను యువక సంఘాలను ఏర్పాటు చేయించి, ఆ సంఘ సభ్యులు ఒక్కొక్కరికి కొన్ని గృహములను కేటాయించి అందు నివసించు కుటుంబాలు వారి పౌర ధర్మములను నెరవేర్చేటట్లు చూడాలి. పౌరులు వారివారి పరస్పర సహకారంతో సాధించవలసినవి ఎన్నో ఉన్నాయి. ప్రతిపౌరుడు పూర్తి సహకారంతోను ఉత్సాహంతోను పౌర సంఘాల కార్యక్రమాల్లో పాల్గొనాలి. పరస్పర సహకారంతో సాధించలేనిది ఏదీలేదని వారి మనస్సున నాటేటట్లు చేయాలి. అంతేకాదు స్వయంకృషి కార్యక్రమాల్లో పౌరులను సమీకరించి వారిలో ఉత్సాహాన్ని రేకెత్తింపజేయాలి

పురపాలక సంఘం ఏపనిచేసినా అది ప్రజాశ్రేయస్సుకేనని నమ్మాలి. పౌరులు పురపాలక సంఘ అధికారాన్ని, చట్టాలను మన్నించడమేగాక, వాటిని అమలు జరుపడానికి తోడ్పడేటట్లు వారికి పురపాలక సభ్యుడు బోధించాలి, పౌర సంఘాలు దీనిని గురించి పురజనులకు చెప్పాలి. ఆదర్శ పురపాలక సభ్యుడు తాను పురపాలక అధికారిగా భావించుకొని ప్రవర్తించరాదు. తనంతట తాను అధికారం చలాయించడం మరీతప్పు. ఇదీగాక పురపాలక సంఘచట్ట సమ్మతమైన చర్యలను అమలు జరుపుచున్నప్పుడు తాను కలుగ జేసుకొని, ఎంతమాత్రము వారికి అడ్డురాకూడదు.

ఇప్పటి పట్టణ పరిస్థితులలో సభ్యుడు మురికి పేటల అభివృద్ధికి, అవసరమైతే వాటి నిర్మూలానికి కృషి చేయవలసిన అవసరం ఎంతైనా ఉంది ఈ కార్య క్రమానికి తాను అన్నింటికంటే ఎక్కువప్రాముఖ్యత నివ్వాలి. పట్టణాభివృద్ధి ఎంతవరకు జరిగిందో పరిశీలించాలంటే, ఆ పట్టణాలలో మురికివాడల సంగతి ముఖ్యంగా ఆలోచించాలి. మురికివాడలు పట్టణాలకు చీడపురుగుల్లాంటివి. వాటి అభివృద్ధికి పురపాలక సభ్యుడు అందు నివసించే ప్రజలయొక్క సహకారం పూర్తిగా పొందాలి.

పట్టణాలలో ఎక్కువగా మరొక సమస్య ప్రజలను బాధిస్తుంది. అదేమంటే నిరుద్యోగం, నిరుద్యోగ సమస్య కేవలం ప్రభుత్వ కార్యాలలో తీరేది గాదు. ప్రతి ఒక్కడు తాను ఏదో ఒక ఉపాధిని కల్పించుకోవాలి. ఇందుకు పురపాలక సభ్యుడు దానికికావలసిన చేయూతనిచ్చి కుటీర పరిశ్రమలను నెలకొల్పటానికి తగినంత చర్య తీసుకోవాలి. పంచవర్ష ప్రణాళికలద్వారా ప్రభుత్వం ఎన్ని రంగాలలో ప్రజలకు సహకారం చేస్తుందో వివరాలు తెలుసుకొని అవి ప్రజలకు తెలియ జెప్పాలి.

ఒకవైపు పురపాలక సంఘంలో తాను ప్రజల అవసరాలను సంరక్షించడానికి పాటుపడాలి. మరొకవైపు నగరంలో సక్రమ పరిస్థితి నెలకొల్పడానికి ప్రజలు బాధ్యత వహించేటట్లు చూసుకోవాలి. ప్రజలు గౌరవ బాధ్యతలు అర్థం చేసుకొని, ఆచరణలో పెట్టేవిధంగా వారికి బోధించి ప్రోత్సాహపరచవలసినవాడు పురపాలక సంఘ సభ్యుడు. పట్టణం, శుభ్రంగా, సుందరంగా ఆరోగ్యవంతంగా ఉండడానికిఇది చాలా ముఖ్యం. ప్రజలు పన్నులు సక్రమంగా చెల్లించి పురపాలక సంఘం వాటి బాధ్యతలను సలక్షణంగా నిర్వహించేటట్లుచేయాలి పట్టణం నందనవనంగా రాణించాలంటే పురపాలక సభ్యునికంటే పౌరుల బాధ్యతే ఎక్కువ అన్న సత్యాన్ని ప్రజలు గ్రహించగలిగేటట్లు చేయాలి.

కొన్ని కుటుంబాల సమ్మేళనమే పట్టణం. ఆ కుటుంబాల

సమిష్టి ప్రయోజనం కోసం పాటుపడడమే వారికి సేవ చేయడమౌతుంది. ఈ విషయాన్ని బాగా గుర్తించగలిగినవాడే ఆదర్శవంతమైన పురపాలక సంఘ సభ్యుడుగా రాణించగలడు. పౌరుల సమస్యలే తన సమస్యలుగా భావించాలి. ఈరోజు ప్రజల్లో విశ్వాసం సడలిపోతున్నదంటే చాలాకాలంగా వారు అనేక మాయోపాయాలకు లోనుగావడమే కారణం. నిజాయతీలేని వ్యక్తులంటే ప్రజలకు విరక్తి కలిగింది. సాహసంగా, నీతి, నిజాయితీలతో పనిచేసే వ్యక్తుల కోసం ప్రజలు ఎదురు చూస్తున్నారు. తమకు ప్రాతినిధ్యం వహించేవారు విశ్వాస పాత్రులైయుండాలని, నిష్కల్మషహృదయంతో సేవ చేయగలిగినవారై ఉండాలని వారి ఆశ. వారికాశాభంగం కలగకుండా ప్రవర్తించే సభ్యుడే ఆదర్శ పురపాలక సభ్యుడుగా పరిగణింప బడుతాడు.

పట్టణాలు, ప్రజారోగ్యానికి, నీతి నిజాయతీలకు, స్వేచ్ఛా స్వాతంత్ర్యాలకు జన్మస్థానములుగా చేయాలంటే పురపాలక సభ్యుడు తాను ఆదర్శవంతమైన పౌరుడుగాను, సభ్యుడుగాను, సేవకుడుగాను తనవిద్యుక్తధర్మం నిర్వహించాలి. పట్టణ ప్రాంతాలలో సుఖంగా బ్రతకాలని ప్రజల వాంఛ. వారికి నిరాశకలిగేటట్లు ప్రవర్తించకూడదు నగరమంటే కేవలం ఒక వ్యాపార కేంద్రమే కాదు. ఎప్పుడైన ఒకసారి విలాసాలకు వెళ్లివచ్చే ప్రాంతమూ కాదు. ఆర్థిక నిమ్నోన్నతలు గడ్డకట్టిన మురికి వాడకాదు. అది ప్రజల వికాసానికి, విజ్ఞానానికి, నివాసానికి, కళాభివృద్ధికి ముఖ్య కేంద్రంగా ఉండేటట్లు ఆదర్శ సభ్యుడు ప్రయత్నించాలి. తనపట్టణమంటే గర్వపడాలి. గర్వపడి లాభంలేదు. అటిస్థానం దానికివచ్చేటట్టు కృషిచేయాలి. ప్రస్తుతంలో పురపాలక సంఘాలకు పూర్వంవలె ప్రజాసేవాపరులు సభ్యులుగా రావడంలేదనే నెపము పోయేటట్లు సభ్యుడు ప్రవర్తించాలి. సంఘ సేవకు అంతకంటె వేరేగొప్ప అవకాశం లేదని అట్టి సేవయే మానవసేవయని, మాధవ సేవయని భావించి నిరంతరం కృషి చేయాలి.

(ఆలిండియారేడియో హైదరాబాద్ కేంద్రంవారి సౌజన్యంతో)



ఆకులను రాల్చుకొలదిగ మ్రాకు పెరుగు.
కాంచు మా నారికేళ వృక్షమును, దేవి!
ప్రాత విశ్వాసముల నెల్ల వదలు కొమ్ము
క్రొత్త క్రొంగొత్త రుచులు రేకెత్త నిమ్ము.

"మధుగీత"

కథానిక :

# తెలియని ప్రతీకారం

శ్రీ పోతుకూచి సాంబశివరావు

కారు నడుస్తోంది వేగంగా. కనుచీకటి పడుతోంది. గాలి రివ్వున వీస్తోంది. గోపాలంలో ఆత్రుత హెచ్చయింది. రాత్రి ఒంటి గంటకు హైద్రాబాదు చేరాలి. ఒక రహస్య వ్యాపారంలో సంప్రదింపులు జరపాలి. లక్షల లాభం...కళ్ళు జిగేలుమన్నాయి

బొంబాయి నుంచి వచ్చిన వ్యాపారస్తులు సాయంత్రమే వచ్చి తన్ను కలుసుకోలేక తిరిగి పోతారేమోననే భయం ఆవేశించింది గోపాలానికి. విజయవాడలో రైలు ప్రమాదాన్నుంచి తప్పుకుని బయటపడ్డ గోపాలం. అయిన ఆలస్యానికి బాధపడుతూ తక్షణం ఒక టాక్సీ కుదుర్చుకుని అర్ధరాత్రి ప్రయాణం సాగించాడు

విజయవాడకు రెండుక్రోసుల దూరంలో రైలు పట్టాలు తప్పింది. బోగీలు క్రింద కూలాయి. ముందున్న బోగీలలోని జనంలో చాలామందికి గాయాలు తగిలాయి. ఒక రెండు డజనులు చావులు ప్రత్యక్షమయ్యాయి.

రైలు ప్రమాదంకు దాపులో గేటు దగ్గిర నిలుచున్న గోపాలం బోగీలు వాలిపోవడం గమనించి తెలివిగా, ఎదురుగా దుమికి గెంతేడు. తన బోగీలోనే ఉన్న జనానికి చాలా మందికి గాయాలు తగిలాయి. క్రింద కూర్చున్నవారు హఠాత్తుగా బోగీపైనున్న కర్ర బెర్తులు, ఇనుప ఫాన్లుపై బొర్లగిలబడి ఆ కుదుపులో బాధపడ్డారు. సామాను తీసుకుని, మెల్లిగా బయలుదేరేటప్పటికి. నిర్ణీత కాలం మించి చాలా ఆలస్యమైపోయింది. బోగీలోనే వుంటే గాయాలతో చనిపోవలసిందేననుకుని బ్రతికి బయటపడినందుకు సంతోషిస్తూ గోపాలం విజయవాడ చేరి టాక్సీ ఎక్కాడు.

టాక్సీ డ్రైవరు మాటాడకుండా నడుపుతున్నాడు. చుట్టూ దుబ్బులు. చేలు, చెట్లు, కొండలు, ఏవో దెయ్యాల్లా తిరుగుతున్నట్లు కనిపించాయి గోపాలానికి. ఆరోజు తనకు చాలా అదృష్ట దినమనుకున్నాడు. మరణం నుంచి తప్పుకోడం మామూలు విషయం కాదని అతనికి తెలుసు.

జేబులోంచి నర్సుతీసాడు గోపాలం. పాతికవేలు లెక్కపెట్టాడు. మద్రాసులో వ్యాపారం బాగా లాభించింది. చిన్న వ్యవహారాల్లోంచి పెద్ద లాభాలు తీయడం చాలా కష్టం. దానికి ప్రత్యేకమైన తెలివి కావాలి. ఇంటి దగ్గర కాచివుంచే లక్షల రూపాయల లాభం యివ్వగలిగే వ్యాపారస్తులను కలుసుకోవాలి ఎలాగైనా. గోపాలానికి ఒక ఆలోచన కదిలింది.

"డ్రైవర్"

"అయ్యా"

ఒంటిగంటలోపుగా హైద్రాబాదు చేర్చితే, నీకు యిస్తానన్న డబ్బు కాక మరో ఏభయి...బహుమతి......!

నవ్వాడు గోపాలం.

డ్రైవర్ వెనక్కి తిరిగి చూచాడు. గోపాలం చేతిలో నోట్లు కట్టలు మెరిసాయి విద్యుద్దీపం కాంతిలో.

"ఏభయి" నవ్వాడు డ్రైవరు.

గోపాలానికి ఆ నవ్వు అర్ధం కాలేదు.

"ఏభయి! ఏమూలకి ?" లోలోపల బాధపడ్డాడు డ్రైవరు.

టి.బి. వ్యాధితో యింట్లో బాధపడుతున్న తల్లి కంటిముందు కదిలింది. ఆమె రక్తం కక్కుకున్న సంఘటనలు అతన్ని చకితుణ్ణి చేసినాయి. డాక్టరు ఎవరూ సరిగా మందివ్వటం లేదు. వేయి ఖర్చు కావలసిన ఆ జబ్బు కాసీలతో సర్దుకోటంలేదు. తాను

తెచ్చిన జీతం యింటి తిండికే చాలనప్పుడు తల్లి రోగం నయం కావడం ఎలాగో తెలియటం లేదు.తండ్రి ఉంటే...ఎవరు తండ్రి? చిన్నప్పుడే తండ్రి చనిపోయాడని తల్లి చెప్పింది. అది నిజం కాదని పొరుగింటివారు అంటారు. తల్లిని తండ్రి వదిలేసాడని పుకారు. ఎవరు తనతండ్రి ? తండ్రినెరుగని ఒక అనాధబాలుడిలా బ్రతుకు తనది. బహుశా తండ్రి గురించి తనతల్లి బెంగతో బాధతో శల్యమైపోతున్న అనుమానం డ్రైవరు మనస్సులో ఎప్పుడూ మెదులుతుంది. తన తండ్రే వుంటే; తనకీ తన తల్లికీ యీ తిప్పలుండేవి కావుగా! డ్రైవరు ఆలోచనలు పరిపరి విధాల పోయాయి. ధనవంతులకామందుల సుఖాలు అతని కష్టాల ముందు అతన్ని పిచ్చివాణ్ణి చేశాయి. తన కష్టాలు తీర్చుకోడానికి, తన తల్లిని టి. బి. వ్యాధి నుంచి రక్షించడానికి ఒకటే మార్గం, జీవితంలో అవకాశాలు వినియోగించుకోవాలి. డ్రైవరు నిట్టూర్పు విడిచాడు.

గోపాలం త్వరగా పోవాలనే హెచ్చరికతో కారు వేగం హెచ్చించాడు డ్రైవరు.

శరవేగంతో కారు నడుస్తోంది. హఠాత్తుగా బ్రేకు వేసాడు డ్రైవరు. కారు వంకర తిరిగి రోడ్డు ప్రక్కకు తిరిగింది. చెట్టుకు ఢీకొనవలసిందే కాని కొద్దిగా తప్పింది.

ఆకాశంలో నక్షత్రాలు మెరుస్తున్నాయి. రాత్రి 10 గంటలు అయింది. ఎక్కడినుంచో నక్కల కూతలు వినవస్తున్నాయి.

కొండల మధ్య, గుబురు చెట్ల మధ్య, తారు రోడ్డు మీద కారు ఆగిపోయింది. డ్రైవరు కారుదిగి పరిశీలించాడు.

'ఏమయింది డ్రైవరు'?

''కారు చక్రానికి ఎద్దు నాళం గ్రుచ్చుకుంది ...... గాలి పోయింది''....

'అయితే'......

"పరవాలేదు. చక్రం మార్చాలి...ఒక అరగంట ఆలస్యం అంతే!"

గోపాలానికి విసుగు కలిగింది. కోపం వచ్చింది. ఏం చేయాలో తోచలేదు. మరీ విసుక్కుంటే మాత్రం ఏంచేయగలడు. అయినా డ్రైవరు తప్పుకాదే కారు ఆగిపోవడం. సర్దుకున్నాడు గోపాలం.

కారులోని సుత్తి, స్క్రూలు, అన్నీ తీసి వెనకాల ఉన్న స్పేరు చక్రం ఊడపీకి, ఏదో మరమ్మతుకు పూనుకున్నాడు డ్రైవరు. గోపాలం కారు దిగి ఒంటరిగా కొండల వైపు చూస్తూ సిగరెట్టు పీలుస్తున్నాడు.

ఎదురుగా ఏదో పాము చరచరా సాగిపోయింది

కొంచెం జడుసుకున్నాడు గోపాలం.

ఏమిటి యీ రోజున అన్నీ ప్రమాదాలే సంభవిస్తున్నాయి. అయినా అన్నింటిని దాటుకుని వస్తున్న తాను చాలా అదృష్టవంతుడననుకుని సంతోషించాడు గోపాలం.

గోపాలం సిగరెట్టు పొగలు రింగుల్లా ఆ చీకటిలో స్పష్టంగా కనిపిస్తున్నాయి. ఆకలి దహించుకుపోతోంది గోపాలానికి. ఏవో రెండు పళ్ళు టిఫిను విజయవాడలో తిన్నా, శరీరం సర్దుకో లేదు. ఆకలి, నీరసం అతని కళ్ళను త్రిప్పాయి.

ఏమిటో నెత్తిమీద పెద్ద బరువుతో పోట్లు తగిలినట్లుంది. నీరసంగా వున్న గోపాలం తల బ్రద్దలయి రక్తం స్రవించింది. యింకా ఎన్నో దెబ్బలు...సోషపోయి వాలిపోయాడు గోపాలం.

డ్రైవరు చేతిలోని సుత్తి చూశాడు. రక్తమయంగా ఉంది గోపాలం బట్టలనిండా రక్తం ప్రవహించింది. చేతిమీది రక్తం జేబు రుమాలుతో తుడుచుకుని, గోపాలం జేబులోని పర్సులాక్కుని తక్కిన జేబుల్లో ఏమీ డబ్బులేకుండా పూర్తిగా తస్కరించి అతని బెడ్డింగు సామాను క్రింద పారేసి కారు వెనక్కి త్రిప్పాడు డ్రైవరు.

రోడ్డు ప్రక్క పడిఉన్న గోపాలం శవాన్ని దుబ్బుల్లోకి లాగి, సామానులు చిందరగా విసిరేసి, డ్రైవరు కారు స్టార్టు చేశాడు. వెనకకు శరవేగంతో కారునడిచింది. రాత్రి నాల్గుగంటలకు విజయవాడ చేరాడు డ్రైవరు. కనుచీకటిలో, వేగుచుక్క వెలుగులో తిన్నగా యింటికి నడిచాడు.

తలుపు తట్టి లోపికి వెళ్ళాడు.

తల్లి ఏదో బాధతో మూల్గుతోంది.

గోపాలం తిన్నగా లోపలికి వెళ్ళి పర్సుతీసి లెక్కపెట్టాడు. పాతికవేల రూపాయలు. అతని కళ్ళు మెరిసాయి. జీవితంలో బ్రహ్మాండమైన మార్పు రాబోతోందని ఉవ్విళ్ళూరేడు.

ప్రొద్దున్నే లేచి డ్రైవరు డాక్టరును తీసుకవచ్చాడు. తల్లిని చూపించి మందులిమ్మన్నాడు. ఎంత ఖరీదైనా భరిస్తానన్నాడు. ఫీజు ముట్టిన డక్టరు సంతోషంతో ఒప్పుకున్నాడు వైద్యం చేయడానికి.

తల్లి ఆశ్చర్యపోయింది డబ్బెక్కడిదని. ఎవరో దయగల పెద్ద మనిషి దానం చేశాడు ఒక వందరూపాయలు అని అబద్ధమాడాడు.

తన టాక్సీ తీసుకొని వెళ్ళిపోయాడు డ్రైవరు తన పని లోకి. మధ్యాహ్నం డ్రైవరుతల్లి అతని పెట్టె సర్దుతోంది. అందు లో ఒక పర్సు...పర్సులో...ఒకఫొటో. తనఫొటో చిన్న నాటిది...తన కొడుకుతో...రెండేళ్ళ వయస్సునాటిది. అప్పుడే పద్దెనిమిది సంవత్సరాలు గడిచాయి!...ఎక్కడ దొరికింది ఈ ఫొటో కొడుక్కు... తల్లి ఆశ్చర్య పోయింది కొడుకు రాగానే అడిగింది. ఆయనే తనకి ఆడబ్బు దానం చేశాడన్నాడు డ్రైవరు.

అతని తల్లి ఒకక్షణం నిస్తబ్ధ రాలైంది. ఆయన సొమ్ము తోనా తనరోగం నయం కావడం? ఆయన వల్లనేనా తనకీ దుఃఖం. 'ఎందుకీ డబ్బు'. ఎందుకీ మందులు. ఇంతకంటె చనిపోవడం మేలు? తల్లి క్రుద్ధురాలైంది అరిచింది

'ఛీ...నాకీమందులూ వద్దు! డబ్బూవద్దు...ఆ డబ్బు ఆయ నపై విసిరేయి! నాకొద్దు...' మూల్గి ఏడ్చింది తల్లి

డ్రైవరుకు పరిస్థితి అర్థంకాలేదు.

'ఆయనే! ఎవరోతెలుసా?...ఆ ఫొటో ఎక్కడదొరికింది?'

'ఆ పర్సు ఆయనే యిచ్చారు?'

'ఆయన నీతండ్రి!...నిన్నునన్నూ వదిలివేసి హింసపెట్టిన ఆయనే నీతండ్రి!'

'ఆ!' డ్రైవరు మనస్సులో ఏవో అగ్ని గోళాలు బద్ద లయ్యాయి.

'ఆయన ఎక్కడున్నాడో పట్టుకెళ్ళి యిచ్చివేశేయి ఆడబ్బు!' అరిచింది తల్లి

'నేనిలాగే ఛస్తాను. చచ్చాక ఆయనవచ్చి నాశవాన్ని దూడిద చేయమను' ఆమె ఆవేశముతో ఏడ్చింది.

డ్రైవరు నిశ్చేష్టుడయ్యాడు.

'ఆయన...నాతండ్రి ...ఆయన...లేడు... యిప్పుడు... చనిపోయాడు '

డ్రైవరు మాటలు తడబడ్డాయి.

తల్లి నివ్వెర పోయింది.

ఆమె ఏడుపు ఒక్కసారిగా ఆగిపోయింది.

'ఆయన చనిపోయాడా...ఎలా?'

'నేనే చంపాను'...

డ్రైవరు తల్లికి శివ మెత్తినంత పనయింది. తనకొడుకు తన భర్తనే చంపాడా!...గోపాలం మీది కోపం చల్లారిపోయింది. సానుభూతి ఒక్కసారి పెల్లుబికింది. తనకష్టాలన్నీ మరచి పోయింది. తనకు పుస్తెకట్టిన భర్త చనిపోయాడు. తనకు తన కొడుకుకూ అన్యాయం చేసిన తనభర్త చంపబడ్డాడు...విధి... కొడుకుమీద ఆగ్రహం కలిగింది...ఏం చేయను? నిట్టూర్పు విడిచింది

ఆ రోజుల్లో ఒక సానిదాని సావాసం ప్రబలి తన్నువిడచి మద్రాసు పోయిన గోపాలం మళ్ళీ జాడలేదు. ఉత్తరాలకు జవాబు లేదు. తన బంధువుల తూలనాడాడు...తన్ను పొమ్మన్నాడు — ఒంటరిగా, బాధగా, బ్రతుకుగడిపింది, చివరకీదశ...ఆమెఏడ్చింది.

డ్రైవరు కళ్ళముందు ఎర్ర టోపీలు తిరిగాయి...కట కటాల జైలు కదిలింది...ఏనాటికి అంతేకావచ్చు...మూల్గాడులో లోపల డ్రైవరు.

అతనితల్లి తల బాదుకుంది. ఏడ్చింది—రక్తం కక్కుకుంది. ఆమె ఆరోగ్యం యింక ఎవరూ కాపాడ లేరని అందరికీ తెలిసి పోయింది

సూర్యుడుగూడా రక్తం కక్కుకుని అలసిపోయి నిశిధిలోకి జారిపోయాడు. తన్ను లేకుండా చేసిన సూర్యుణ్ణి పగతో చీకటి మింగేసింది



# ఆంధ్రప్రదేశ్‌లో

# కార్మిక విద్యా పథకాలు

శ్రీ బి. కృష్ణమూర్తి నాయుడు బి.ఎ;డి.ఎస్.ఎస్.ఎ.

దేశంలో పుష్కలంగా లభించే మానవ సంపద వినియోగానికి అవసరమయ్యే ఉద్యోగ అవకాశాలనుకల్పించి, త్వరితగతిని ఆర్థిక ప్రగతిని సాధించి, సాంఘిక సమానత్వాన్ని, న్యాయాన్ని చేకూర్చేందుకు ప్రభుత్వం పారిశ్రామీకరణను చేపట్టింది. పంచవర్ష ప్రణాళికలలో అత్యంత ప్రాధాన్యత నిచ్చింది. అందువల్ల 1975–76 నాటికి పరిశ్రమలలోని కార్మికుల సంఖ్య ఇప్పటికంటె నాలుగురెట్లు పెరుగవచ్చని అంచనావేశారు. సంఖ్యతో బాటు కార్మికులలో పరిజ్ఞానాన్ని, నైపుణ్యాన్ని, క్రమశిక్షణను పెంచవలసిన అవసరం ఉన్నది. మనదేశంలో కార్మికసమస్యలు, పారిశ్రామికఅశాంతి పెచ్చు పెరిగిపోడానికి ఇతర దేశాలలోలేని ప్రత్యేక కారణాలు ఉండటమే. మన కార్మికులు హెచ్చుమంది గ్రామీణ ప్రాంతాల నుండి వచ్చినవారు. వారిలో నిరక్షరాస్యత అధికం. పారిశ్రామిక వాతావరణానికి అవసరమయ్యే సాంకేతిక పరిజ్ఞానం శూన్యం. కార్మిక ఉద్యమం కూడా త్వరలో బలపడలేదు, పైగా వారు తమ బాధ్యతలనుగుర్తెరగనందున, సరియైననాయకత్వంలోపించినందున, కార్మికులు బాధ్యతారహితంగా ప్రవర్తించడంవల్ల సమ్మెలు మొదలగునవి పెచ్చుపెరిగి పారిశ్రామిక అశాంతి ఏర్పడుతుంది, అందువల్ల ఉత్పత్తి దెబ్బతింటుంది. పైగా కార్మికులలో సామాన్యవిద్యతోబాటు కార్మిక సమస్యలకు సంబంధించిన పరిజ్ఞానం లోపించడం వల్ల తమ గురుతర బాధ్యతలను గుర్తించి పంచవర్ష ప్రణాళికలను జయప్రదం చేయజాలరు.

ఇతర దేశాలలో ట్రేడ్ యూనియన్‌లే తమ కార్మికులలో విద్యావ్యాప్తిని చేసే బాధ్యత వహిస్తాయి. కాని మన దేశంలో ట్రేడ్‌యూనియన్‌లకు ఆర్థికస్థోమతలేని కారణంగా నేమి, తక్కిన కారణాల వల్లనేమి కార్మికులలో విద్యావ్యాప్తిని చేయడానికి సంతృప్తికరమైన కృషి జరగడం లేదు.

అందువల్ల ప్రభుత్వమే జోక్యంకల్పించుకోవలసి వచ్చింది. కార్మికులలో సామాన్య విద్యతోబాటు వారికి సంబంధించిన సమస్యలపై పరిజ్ఞానాన్ని, బాధ్యతా యుతమైన నాయకత్వాన్ని పెంపొందించి దాని ద్వారా పారిశ్రామిక ప్రశాంతతను పరిరక్షించాలని ప్రభుత్వం సంకల్పించింది. దీని ఫలితమే కార్మిక విద్యాపథకాన్ని రూపొందించడం. ఇందుకు కేంద్రకార్మిక శాఖామంత్రి శ్రీ గుల్జారీలాల్ నందా అభినందనీయులు.

ఈ పథక లక్ష్యాలు

1. పరిశ్రమల నిర్వహణకు, ప్రభుత్వ నిర్వహణకు తోడ్పడటంలో కార్మికులు తమ బాధ్యతలను గుర్తించే-టట్లు చేయడం.
2. యూనియన్‌లలో ఇతరుల జోక్యం తప్పించి, కార్యకలాపాలను, చట్ట సమ్మతంగా శాంతియుతంగా నిర్వహించడానికి అవసరమయ్యే పరిజ్ఞానాన్ని యివ్వడం,
3. ఉత్పత్తిని ద్విగుణీ కృతం చేసేందుకు అవసరమయ్యే సాంకేతిక పరిజ్ఞానాన్ని యివ్వడం.
4: ప్రజాస్వామ్య పరిపాలనలో కార్మికులకు శిక్షణ నివ్వడం.

5 కార్మికులను సంపూర్ణ వ్యక్తులుగా రూపొందించడం.

రెండవ ప్రణాళికా కాలంలోనే ప్రయోగాత్మక పథకనిర్వహణకు 60 లక్షల రూపాయలను కేటాయించడం జరిగింది. మనదేశ పరిస్థితులకు తగ్గట్టు ఈ పథకాలను రూపొందించేందుకు విదేశాలలోని ప్రవీణులతో సహా 8 మందిగల ఒక సంఘాన్ని ఫోర్డుఫౌండేషన్ సహాయంతో భారత ప్రభుత్వ కార్మిక శాఖ నియమించింది. ఈ ప్రవీణుల సంఘం దేశంలోని ప్రముఖ పారిశ్రామిక ప్రాంతాలలో పర్యటించి కార్మిక సంఘాలను, నాయకులను, విద్యాసంస్థలను, యజమానులను, కలుసుకొని వివరాలు సేకరించింది. ఈ సంఘం తన ప్రతిపాదనలను, సూచనలను ప్రభుత్వానికి సమర్పించింది. 1957 జూలైలో జరిగిన 15వ భారతీయ కార్మిక సదస్సు ఈ నివేదికను పరిశీలించి కొద్ది మార్పులతో ఆమోదించింది.

ఈ సూచనల మేరకు కార్మిక విద్యా పథకాన్ని అమలు జరిపే నిమిత్తం కార్మికుల ప్రతినిధులు, యజమానుల ప్రతినిధులు, ప్రభుత్వ ప్రతినిధులు, విద్యా సంస్థల ప్రతినిధులు సభ్యులుగా ఉన్న ఒక కేంద్ర మండలిని ప్రభుత్వం 1958లో ఏర్పాటు చేసింది. ఈ పథకాలను సక్రమంగా అమలు జరపడం, పర్యవేక్షణ చేయడం, ఉపాధ్యాయుల స్థాయిని పెంపొందించడం అటు కార్మికుల, యిటు పరిశ్రమల యజమానుల సహకారాన్ని సంపాదించడం, మొదలగు విధులన్నీ ఈ మండలి నిర్వహించ వలసి ఉంటుంది. ఈ రూపంలోనే ప్రాంతీయ స్థానిక మండలులను కూడా ఏర్పాటు చేశారు. ఈమండలులు కేంద్ర మండలికి తోడ్పడుతుంటాయి.

## పరిశోధన, సమాచార కేంద్రం

కేంద్ర మండలి అధ్వర్యాన పరిశోధన, సమాచార కేంద్రాన్ని స్థాపించారు. ఈ పథక నిర్వహణకు కార్మికులకు, కార్మిక ఉపాధ్యాయులకు అవసరమగు విద్యాపరికరాలను ఈ కేంద్రం సమకూర్చవలసి ఉంటుంది.

కార్మిక విద్యావ్యాప్తిలో కార్మిక సంఘాలు ప్రముఖపాత్ర వహించవలసి వుంటుందని ఈ పథకం సంపూర్ణంగా విశ్వసించింది. అందువల్ల కేంద్ర మండలి కార్మిక సంఘాలకు, సాంఘిక, విద్యా సంస్థలకు ఆర్థిక సహాయాన్ని ఒసగి, ప్రోత్సహించి ఈ పథక విస్తరణకు తీవ్ర కృషి చేస్తుంది.

## కార్మిక విద్యా పథకం — ఆర్థిక సహాయం

ప్రస్తుతం కేంద్ర ప్రభుత్వమే ఈ పథక నిర్వహణకు అయ్యే ఖర్చును భరిస్తున్నది. ముమ్ముందు రాష్ట్ర ప్రభుత్వాలు కూడా గ్రాంటులు యిస్తాయి. కార్మికులకు చెల్లించక నిలవయున్న వేతనాలను, జరిమానాల క్రింద, వసూలు చేసే సొమ్మును, కాంటీన్ల నుంచి వచ్చే లాభాలనుకూడా ఈ పథకనిధికి చేర్చాలనే ప్రతిపాదన కూడా వున్నది.

మూడవ ప్రణాళికలో ఈ పథకానికి 2 లక్షల రూపాయలు కేటాయించబడింది.

ఇక ఈ పథకం క్రింద రూపొందించిన విద్యావిధానాన్ని పరిశీలిద్దాం.

## విద్యా విధానం

ఇందులో మూడు దశలున్నాయి. ఉన్నత స్థాయిలో, ఉపాధ్యాయులకు, పరిపాలనా నిర్వహణాధికారులకు ఆరు మాసాలపాటు శిక్షణ నిస్తారు. వీరికి ప్రప్రథమంగా 1958 మే-నవంబరు నెలల మధ్య బొంబాయిలో శిక్షణ నిచ్చారు. ఆ పిదప రెండవ దఫా ఉపాధ్యాయులకు కలకత్తాలో 1959 నవంబరునుంచి 1960 ఏప్రెల్ వరకు శిక్షణ నిచ్చారు. ఇటీవలనే మూడవ జట్టుకూడా శిక్షణను పూర్తిచేసింది. శిక్షణను పూర్తిచేసిన వారిని ప్రాంతీయ శిక్షణ కేంద్రాలలో నియమిస్తారు.

ప్రాంతీయ స్థాయిలో కార్మికులకు శిక్షణ నిస్తారు. ప్రత్యేకంగా ఎన్నుకొనబడిన కార్మికులకు, ట్రేడ్ యూనియన్ల కార్యకర్తలకు మూడు నెలలపాటు ఈ శిక్షణ నిస్తారు. వీరిని కార్మిక ఉపాధ్యాయులంటారు.

ఇలాగా శిక్షణ పొందిన కార్మిక ఉపాధ్యాయులు ఆయా ఫ్యాక్టరీల ప్రాథమిక స్థాయిలో తరగతులను నిర్వహించి కార్మికులలో విద్యావ్యాప్తి చేస్తారు.

## ఆంధ్రప్రదేశ్‌లో

మన రాష్ట్రంలో ఈ పథకం 1959వ సంవత్సరం ఏప్రెల్ 24వ తేది అప్పటి ముఖ్యమంత్రిచే ప్రారంభింప బడినది. ప్రాంతీయ కార్మిక విద్యా కేంద్రం హైదరాబాద్‌లో నెలకొల్పబడినది. దీనికి ఒక అడ్మినిస్ట్రేటివ్ ఆఫీసరు, ఆరుమంది ఉపాధ్యాయ పాలకులు నియమింపబడ్డారు. ప్రాంతీయ స్థాయిలో ఉన్న అడ్‌హాక్ కమిటీ అధ్యక్షుడుగా రాష్ట్రలేబర్ కమీషనరు వ్యవహరిస్తారు.

రాష్ట్రంలోని వివిధ పరిశ్రమలనుంచి కార్మికులను

ఒక్కొక్క బాచ్‌కి 35 మందిని ఎన్నుకొని మూడు మాసాలపాటు హైదరాబాద్‌లోని ప్రాంతీయ కార్యాలయంలో శిక్షణ నిస్తారు. ఈ శిక్షణ కాలంలో వారు పరిశ్రమలలో పనిలో ఉన్నట్లే పరిగణించి యజమానులు వారి జీత బత్త్యాలను చెల్లిస్తారు. పైగా 5 మైళ్ళకు మించిన దూరం నుంచి శిక్షణ పొందడానికి వచ్చే కార్మికులకు ప్రాంతీయ కేంద్రం ప్రయాణపు ఖర్చులనుకూడా చెల్లిస్తుంది. శిక్షణా కాలంలో ప్రతి వారాంతంలోనూ ఏర్పాటు చేసే వినోద విజ్ఞాన యాత్రల ఖర్చును భరిస్తుంది. శిక్షణాంతంలో ఏర్పాటు చేసే అఖిల భారత విద్యా యాత్ర కయ్యే ఖర్చులో 75 శాతం ప్రాంతీయ కేంద్రం భరిస్తుంది. ఇలాగా కార్మికులకు తగు వసతులు కల్పించి వారికి ప్రోత్సాహమిచ్చి విద్యావ్యాప్తికి తీవ్ర కృషి జరుగుతున్నది.

## కార్మిక విద్యా పాఠ్య క్రమం

ప్రాంతీయ స్థాయిలో కార్మిక శాసనాలకు సంబంధించిన పరిజ్ఞానం శిక్షితులకు యివ్వబడుతుంది. ట్రేడ్ యూనియన్, ఉద్యమం, వాటి నిర్వహణ, కార్మిక వివాదాల పరిష్కార మార్గాలు మొదలగు కార్మిక సమస్యలపై ఉపన్యాసాలిస్తారు. అపుడపుడు విద్యావేత్తలు, కార్మిక నాయకుల ఉపన్యాసాలు కూడా ఏర్పాటు చేస్తారు. శిక్షితులకు ఆరోజు వార్తలను వివరించడం జరుగుతుంది. వారు బృందాలుగా విడిపోయి చర్చలు, సదస్సులు జరుపుకొంటారు. చలనచిత్ర ప్రదర్శనలు, సాంస్కృతిక ప్రదర్శనలు, స్థానికంగా ఉన్న పారిశ్రామిక సంస్థలకు యాత్రలను ఏర్పాటు చేస్తారు. శిక్షణ కాలం ముగియక ముందు ఒకసారి మాత్రం రాష్ట్రం వెలుపలనున్న ప్రాజెక్టులకు, పారిశ్రామిక సంస్థలకు విజ్ఞాన యాత్ర జరుపుతారు.

ఇవన్నీ గూడా కార్మికుల అవగాహన శక్తిని, శక్తి సామర్థ్యాలను, తెలివితేటలను పెంపొందించి వారిలో నాయకత్వ గుణాలను విస్తృతపరచినట్లౌతుంది, బాధ్యతాయుతుడైన కార్మికుని గా రూపొందించడానికే ఉద్దేశించబడినవి. కార్మిక విద్యా పథక లక్ష్యంకూడా యిదే.

## ప్రాథమిక కేంద్రాలు

ప్రాంతీయ కేంద్రంలో శిక్షణపొందిన కార్మిక ఉపాధ్యాయుడు ఫ్యాక్టరీ స్థాయిలో ప్రాథమిక తరగతులను నిర్వహిస్తాడు. అందుకు ప్రతిఫలంగా వారికి నెలకు 25 రూపాయలు చొప్పున యిస్తారు. ప్రాథమిక కేంద్రంలో ఒక్కొక్క బాచ్‌లోనూ 20,25 కార్మికులకు శిక్షణనిస్తారు. ఈ కేంద్రాలలో శిక్షణ పొందేవారికి పుస్తకాలు, పలకలు మొదలగు పరికరాలను ఉచితంగా సరఫరా చేస్తారు. కనీసం నెలకొకసారి అయినా వినోద విజ్ఞాన యాత్రలు ఏర్పాటు చేసి అందుకయ్యే ఖర్చును ప్రాంతీయ కేంద్రమే భరిస్తుంది కార్మిక సంక్షేమ కేంద్రాల శాఖ, తక్కిన సాంఘిక, విద్యా సంస్థల సాయంతో చలనచిత్ర ప్రదర్శనలు క్రీడోత్సవాలు ఏర్పాటు చేస్తారు. అప్పుడప్పుడు అతిథి ఉపన్యాసకులు వచ్చి వివిధాంశాలకు ప్రత్యేకంగా కార్మికులకు సంబంధించిన విషయాలను తెలుగులోనూ ఉర్దూలోనూ వివరిస్తారు. సదస్సులు గోష్ఠులు సాంస్కృతిక ప్రదర్శనలు ఏర్పాటు చేస్తారు.

## పథక ప్రగతి

కార్మిక విద్యా పథకాలను మన రాష్ట్రంలో అమలుజరపడంలో గణనీయమైన కృషి జరిగింది.

1962 మార్చి ఒకటవ తేదీనాటికి హైదరాబాద్‌లోని ప్రాంతీయ కేంద్రంలో 7 బట్ల కార్మిక ఉపాధ్యాయులకు శిక్షణ నిచ్చారు. ఇందులో మొత్తం 177 మంది శిక్షణను పూర్తి చేసుకొని వెళ్ళి ప్రాథమిక స్థాయిలో తరగతులను నిర్వహిస్తున్నారు.

ప్రాథమిక స్థాయిలోని కేంద్రాలు మొత్తం 62 ప్రశంసనీయంగా నిర్వహింపబడుతున్నాయి. వీటిలో 45 కేంద్రాలను జంట నగరాలలోని పారిశ్రామిక ప్రాంతాలలో స్థాపించారు తక్కినవి ఈ క్రింది పట్టణాలలో ఉన్నాయి

| | |
|---|---|
| ఆదోని | 3 |
| వరంగల్ | 3 |
| కొత్తగూడెం | 2 |
| సిరుపూర్ కాగజ్‌నగర్ | 2 |
| రామగుండం | 1 |
| విశాఖపట్నం | 2 |
| మాచెర్ల | 1 |
| కర్నూలు | 2 |
| మచిలీపట్నం | 1 |
| మొత్తం | 17 |

ఈ ప్రాంతీయ కేంద్రాలలో ఇప్పటి వరకు 152 బట్లు

శిక్షణ పొందాయి. ఇందులో 87 జట్ల కార్మికులు తెలుగులోను, 65 జట్ల కార్మికులు ఉర్దూలోనూ శిక్షణ పొందారు. వీటన్నిటి లోనూ మొత్తం 2511 మంది శిక్షణను పూర్తి చేశారు.

ప్రస్తుతం తెలుగులో 601 మంది ఉర్దూలో 425 మంది మొత్తం 1026 మంది కార్మికులు ప్రాథమిక కేంద్రాలలో శిక్షణ పొందుతున్నారు

అతి త్వరలోనే మరో పది ప్రాథమిక కేంద్రాలను ప్రారంభించనున్నారు.

కార్మిక విద్యా పాఠ్యక్రమాన్ని గురించి యిదివరకే వివరించబడినది. రాష్ట్రంలో ఉన్న కేంద్రాలలోనూ 1962 జనవరి ఫిబ్రవరి నెలలో జరిగిన కార్యకలాపాలను గణాంకాల సహాయంతో ఇక్కడ పొందుపరుస్తాం.

| పాఠ్యక్రమం | జనవరి (1962) | ఫిబ్రవరి |
|---|---|---|
| కార్మిక-ఉపాధ్యాయులిచ్చిన ఉపన్యాసాలు | 784 | 864 |
| అతిథి ఉపన్యాసాలు | 12 | 8 |
| ప్రయోగాత్మక ప్రసంగాలు | 24 | 30 |
| సామూహిక చర్చలు | 784 | 864 |
| సదస్సులు, గోష్ఠులు వక్తృత్వ పోటీలు | 102 | 128 |
| సాంస్కృతిక ప్రదర్శనలు | 58 | 48 |
| విజ్ఞాన యాత్రలు | 13 | 17 |
| చలనచిత్ర ప్రదర్శనలు | 25 | 26 |

వివరాల సేకరణ:- ప్రాంతీయ కేంద్రం (హైద్రాబాద్) నుంచి

ఈ కార్మిక విద్యా పథకాలను అమలు జరపడంలో మన రాష్ట్రం నూతన పంథాలననుసరించడం నిజంగా గర్వించదగ్గ విషయం. ప్రాథమిక కేంద్రాలను ప్రాంతీయ కేంద్రం ఉన్న పట్టణంలోనే గాక జిల్లాలలోని పారిశ్రామిక కేంద్రాలలోనూ స్థాపించి మన రాష్ట్రం తక్కిన రాష్ట్రాలలోని కేంద్రాలకు ఆదర్శప్రాయమయినది. శిక్షణను ప్రాంతీయ భాషలు రెండుమూడింటిలో శిక్షణ నొసగడం మన రాష్ట్రంలోనేనన్నది మరో గమనించదగ్గ విషయం

## బ్రదర్‌హుడ్ పత్రిక

హైదరాబాద్‌లోని ప్రాంతీయ కార్మిక విద్యా కేంద్రం "బ్రదర్ హుడ్" అనే త్రైమాసిక పత్రికను ప్రకటిస్తున్నది.

ఈ పత్రిక ఉద్దేశం.

1. ఎప్పటికప్పుడు ప్రాంతీయ, ప్రాథమిక కేంద్రాలలో జరిగే కార్యకలాపాలను కార్మికులకు ప్రత్యేకంగా శిక్షితులకు వివరించడం.

2. శిక్షితులలో రచనా వ్యాసంగం పెంపొందించడం, వారి అభిప్రాయాలను వ్యక్తపరచడానికి అవకాశమివ్వడం.

ఉదాహరణకు 1960 మే - సెప్టెంబరు బ్రదర్‌హుడ్ మాగజైన్‌లో ప్రాంతీయ కేంద్రంలో శిక్షణ పొందిన ఒక మహిళ కూడా "పరిశ్రమలలో స్త్రీలు" అనే అంశంపై వ్రాసిన చక్కటి వ్యాసం ప్రకటించబడింది.

ఈ పథకాన్ని అమలుజరపడంలో ప్రస్తుతం పరిశ్రమల యజమానులు, ట్రేడ్ యూనియన్లు, తక్కిన సంస్థలు కొంత వరకు తోడ్పడుతున్న మాట వాస్తవమే అయినా ఇది ఇంకను విస్తృతం కావలసి ఉన్నది ట్రేడ్ యూనియన్ల యజమానుల బాధ్యతను ప్రభుత్వం వహించింది. అందువల్ల కార్మికులు, యజమానులు, ట్రేడ్ యూనియన్‌లు, సాంఘిక, విద్యాసంస్థలు సంఘటితంగా ఈ కార్మిక విద్యా పథకాలను విజయవంతం చేయడంలో పాలుపంచుకోవలసి ఉంటుంది



# పద్మసంభవుడు

డాక్టర్ పోతుకూచి సుబ్రమణ్యశాస్త్రి

మంత్రతంత్ర శాస్త్రాలలో అశేష సాధన జరిపిన శక్తి సంపన్నుడు పద్మసంభవుడని భారతీయ దార్శనికులు కొందరు భోట (టిబెట్) దేశపు రాజుకు తెలియజేశారు. క్రీ. శ. 740 నుంచి 786 దాకా పాలించిన ఈరాజు పేరు త్రిస్రోంగ్ దెత్సాన్. ఈయన విజ్ఞాపనను అనుసరించి క్రీ. శ. 746 చివరన బోధగయను వదలి క్రీ. శ 747ప్రారంభంలో పద్మసంభవుడు భోట దేశము చేరుకున్నాడు. సరస్వతియొక్క అవతారమనబడ్డ యేషేత్సొగ్యాల్ అనే భోట దేశీయురాలు ఈయన ముఖ్య శిష్యురాలు. ఈవిడ తనగురువుగారి జీవిత చరిత్రను వ్రాసింది. ఇందలి ముఖ్య విషయాలను సంక్షిప్తంగా ఇవ్వటమవసరము.

నిర్వాణ మాసన్నమైనపుడు దుఃఖిస్తున్న శిష్యులను పిలచి బుద్ధుడిలా అన్నాడు–"నేగతించిన పన్నెండేళ్ళకు ఉర్గ్యాన ఉద్యాన, లేక ఉడియాన మనబడే దేశంలో వాయవ్యంగా ఉన్న ధనకోశ సరస్సులో వికసించే పద్మమునుంచి నాకన్నా విజ్ఞాని. సాధకుడు. సిద్ధుడు ఐన మహాపురుషుడు జన్మిస్తాడు. ఇతడే పద్మసంభవుడు. ఇతని ద్వారా రహస్యంగా. గుప్తంగా ఉంచబడిన తత్త్వము సుప్రతిష్ఠిత మౌతుంది." ఉద్యాన దేశంలో జటుమతి అనే మహా నగరంలో ఇంద్రబోధి అనే రాజున్నాడు ఆ రాజ్యంలో వచ్చిన క్షామమును చూచి అమితాభుడే పద్మ సంభవుడుగా అవతారమెత్తి ఇంద్ర సంభవుని పుత్రుడుగా పెంచబడినాడు. చంద్రకూమారుడను రాజుయొక్క పుత్రికయగు భాసధరను సింగల (లేక సగాల. లేకసకాల) దేశంలో గమనించి. ఈమెను పద్మసంభవుని కిచ్చి పెండ్లి చేయించాలని అమాత్యుడగు త్రిగుణాధరుడు నిశ్చయించినాడు.

ధనకోశ, ధెంకోశ, ధింకోశ అనే పేర్లతో వ్యవహరించబడినది. ధాన్యకటకము. సగాల లేక సింగల దేశము దీని పరిసరాలలోఉన్న శ్రీకాకుళము. ఈ శ్రీకాకుళానికి శాతవాహనులు స్మృతిని పైకితెచ్చే సింహపురి అనే పేరుకూడా ఉన్నది. లేకపోతే ఈ సింహపూరి నేటి నెల్లూరు కావచ్చును.

ఐదేండ్లు గృహస్థుగా ఉండి. విరాగి ఐనాడు ఉర్గ్యానదేశానికి దక్షిణానఉన్న శొసలింగ్ చైత్యంలో తపస్సు గావించినాడు. ఈ శొసలింగ్ నేటి శ్రీశైలముకావి. శ్రీపర్వతము కానిఐఉంటుంది. గురువులవద్ద బౌద్ధమతము నవలంబించి. అసురగుహలో ఆనందుని చూచినాడు. ఉర్గ్యానములోనే మహాయాన గ్రంథాలు చాలా ఉన్నవని, అవి దాచబడి ఉన్నవని ఆనందుడు చెప్పగా విన్నాడు. తర్వాత ఐదేళ్ళు కాశ్మీరమున, నేపాలులో ఐదేళ్ళు గడిపి. సాహోర్ దేశములోని చైత్యంలో కొంతకాలముండి స్వదేశంలో ఐదేళ్ళుగడిపినాడు. ఆతర్వాత బర్మాలో కొంతకాలముండి ఉర్గ్యానంలో వాయవ్యంగా ఉన్న సాహోర్ చేరినాడు. సాహోర్ రాజకుమారుడే శాంతరక్షితుడనే బౌద్ధాచార్యుడు. ఈ శాంతరక్షితుని ఆదేశానుసారమే భోట దేశపురాజు పద్మసంభవుని ఆహ్వానించడం జరిగింది.

శాంతరక్షితుని బావమరిదియే పద్మసంభవుడు. అనంగ వజ్రుని శిష్యుడు, పద్మసంభవునితండ్రిఐన ఇంద్రబోధ ధాన్యకటక వాసి. ఈయన ప్రారంభించిన వజ్రయాన బౌద్ధము కేవలం తాంత్రికము. తంత్ర శాస్త్రాలతో. మంత్రాలతో ప్రచారంలోకి వచ్చిన వజ్రయానమునే ఉడ్డియానమని కూడా అన్నారు. జగ్గయ్యపేట సమీపంలో నేటికికూడా వజ్రాలదిన్నె అనేది ఉన్నదని మనం గుర్తించటమవసరము. ఈ వజ్రాలదిన్నె ప్రాంతంలో పురా తత్త్వవేత్తలు త్రవ్వకాలు ప్రారంభిస్తే చారిత్ర్యక విషయాలనేకము బయటకు రాగలవు

వజ్రయానము ధాన్యకటకంలో బయలుదేరింది. హీనయానము. మహాయానము. వజ్రయానము అనేవి బౌద్ధధర్మ చక్ర ప్రవర్తనలలో మూడు ప్రధానాంగాలు. చివరిరెండు యానాలు ఆంధ్రదేశములోనే ఉత్పన్నమై దేశదేశాంతరాలకు వ్యాపించినవి గుహ్యసిద్ధికారుడైన పద్మవజ్రుని శిష్యుడు అనంగ వజ్రుడు. ఈయన శిష్యుడు పద్మసంభవుని తండ్రియైన ఇంద్రబోధి అనబడే ఇంద్రభౌతి. ఒడియానసిద్ధ. అవధూత. మహాచార్యాది బిరుదాలతో పేరుగాంచిన ఇంద్రభౌతి 23 గ్రంథాలు వ్రాసినాడు. ఈ వజ్రయానికుల రచనలే తాంత్రిక శివాద్వైతంలో తర్వాత లీనమైపోయినవి

పద్మసంభవుడు భోట దేశంలో మొట్టమొదటి బౌద్ధవిహారాన్ని నిర్మించి. బౌద్ధ ధర్మమును ప్రపంచించినాడు. ఆంధ్ర దేశంనుంచే బౌద్ధ మతము భోట దేశానికి చేరిందంటే విశేషమే. ఆలాంటి ఆంధ్రదేశమే తర్వాతి రోజుల్లో జైనా క్రాంతమై. బౌద్ధానికి స్వస్తిచెప్పి. తన విశిష్ట సంస్కృతిని కోల్పోవసాగింది.

# నిదాఘము

శ్రీ బొడ్డు బాపిరాజు

చెందలిరాకు జొంపముల, చెల్వపు క్రొవ్విరి మల్లె తావులన్,
మంద మరుత్కిశోరముల, మంజుల బాలరసాల కోకిలా
నంద రవమ్ములన్ జనమనః ప్రియుడైన వసంతుడేగ రా
చందుగవచ్చె వాసి యనుజన్ముడు గ్రీష్మ డహంకృతోష్ముడై.

ప్రొద్దుననే సెగల్ పొగ లూర్చుచును పృథ్వి
ఉడికించె కుంపటి నుంచినట్లు
పదపదమ్మున సన్నవడి జల దేవతల్
కనరారు వలస పోయిన విధాన
నడిమింటిత్రోవ తేరడుగు పెట్టకయె భా
స్కరుడూది నిప్పులు చెరిగిపోసె
సుడిగాలి బిట్టార్చి వడగొట్టె వెడగాడ్పు
సత్రకాయగ వీతిహోత్రునకును
పగలు పగలెల్ల తపియించు ప్రాణికోటి
వ్రేల్చె రాత్రి నభమ్ము కాలిన పెనమ్ము;
దుస్సహ నిదాఘ విభుని యంతస్సుదెలిసి
పంచభూతమ్ములున్ దలవంచినడిచె;

సౌమ్యసుందరు డఖిల ప్రసన్నమూర్తి
ఆలవసంతుని యనుజన్ముడైననేమి,
సకలభువన సంతాపకారకుడు గ్రీష్మ
దేకరాళాగ్ని ఘటిక జన్మించినాడొ;

చటులనిదాఘ తాపమిది సర్వబహిర్జగ మన్నమాటె కా
దెటువలె నేర్చెనో పొటమరింపదుపో మధురా ర్ద్రభావమొ

క్కటియు హృదంతరాళమున; కమ్మనివిల్లును పువ్వుటమ్ములె
చ్చటదిగజార్చెనో స్మరుడు సాగవుపైదలిపై సరాగముల్:

ఇంతవేచిన నీకన్న నిష్టు డెవరు
మీసహోదరులందు స్వామీనిదాఘ!
చందన హిమాంబుచర్చలు, కుందకుసుమ
తల్పములు, చూతఫలములు, ద్రాక్షరసము,
తాటితోపుల మలుసంజ గోటిపదను
ముంజెలును, నీళ్లకొబ్బరి బొండములును,
తావుల నుశీరతాళవృంతానిలమ్ము
ఊరియూరని క్రొత్తావ యూరగాయ,
లిక్షుఖండమ్ములున్, రుచులివతళించు
తేటమజ్జిగ చలువపందిళ్లు, నందు
పడుచుపిల్లతో పథికసంభాషణములు!
ఓయి! ఎవరిత్తు రీవుగాకున్న మాకు?
సకుడ! నీరాక శుభలేఖ జగతికెల్ల!

తొలకరిచినుకుల వెంటన్
తెలుగుసరయూతు లేరువాక తెరలింపగ, మేల్
వలనున దిగివచ్చియు మా
పొలములు వేగించి పంట పొలిరాల్చుదొరా!





# మెయిలుకు అందేలాగు

## మీ ఉత్తరాలు పెందరాళే పోస్టు చేయండి

సరిగ్గా టపాలు కట్టేవేళకు అసంఖ్యాకంగా ఉత్తరాలు, పార్సెళ్ళు వచ్చిపడితే పోస్టాఫీసువారికి చాలా యిబ్బందిగా వుంటుంది. అందు వలన కొన్ని ఆ రోజు టపాలో వెళ్ళలేకపోవచ్చునేమో కూడా.

పెందరాళే పోస్టు చేస్తే మీ ఉత్తరాలు ఆ రోజే బయలుదేరడానికీ, ఆలస్యం లేకుండా గమ్యస్థానం చేరడానికీ వీలు కలుగుతుంది.

వ్రాసిన ఉత్తరాలు ఎప్పటికప్పుడే పోస్టుచేసి, చివరి క్షణంలో రద్దీ ఏర్పడకుండా సహకారం చేయండి.



**మీ సౌకర్యం కోసం మాతో సహకరించండి**

తంతి, తపాలా శాఖ

CA 69/605

నా టి క :

# కుటుంబ క్షేమం

శ్రీ తాళ్లూరు నాగేశ్వరరావు

## ఇందులో వచ్చే వాళ్లు

| | | |
|---|---|---|
| ఆదిశేషయ్య: | ... | ఓ మధ్యతరగతి రైతు |
| సీతారావమ్మ: | ... | ఆయన భార్య |
| నారాయణ: | ... | పంచాయతీబోర్డు ప్రెసిడెంటు. ఆదిశేషయ్య ఆప్తమిత్రుడు |
| శేఖరం: | .... | బ్లాక్ డెవలప్‌మెంట్ ఆఫీసరు |
| విశాలాక్షి: | .... | కుటుంబ నియంత్రణ కేంద్రాధికారిణి |
| రామం, లలిత, చంద్రం: | ... | ఆదిశేషయ్య పిల్లలు |

(తెర లేచేసరికి మధ్య తరగతి రైతు ఆదిశేషయ్య మండువా ఇంటి వసారా అగపడుతుంది వసారా మధ్యగా ఇంట్లోకి ద్వారం. ద్వారానికి అటూ ఇటూ చిన్న కిటికీలు. రంగానికి కుడి ప్రక్కగా—వీధిలోకి దారి తీసే ద్వారమూ. ఎడం ప్రక్కగా పెరట్లోకి దారి తీసే ద్వారమూ వుంటాయి.

వసారాలో ఎడం ప్రక్క నూరిపిడి బల్లపై కొన్ని గోతాలు పెట్టబడి వుంటాయి. ఆ బల్ల ప్రక్కగా చిట్టు పీపా, నాగటి దుంప, మరికొన్ని వ్యవసాయ పనిముట్లూ వుంటాయి. కుడి ప్రక్కన రెండు పాత కుర్చీలు (ఒకటి మామూలు కొయ్య కుర్చీ, రెండోది పడక కుర్చీ), నవారు మంచమూ ఉంటాయి. గోడలకు గాంధీ, నెహ్రూ, రాజేంద్ర ప్రసాద్‌ల చిత్ర పటాలు, లక్ష్మీదేవి బొమ్మగల క్యాలెండరు వ్రేలాడుతూ వుంటాయి.

సమయం మధ్యాహ్న వేళ.

తెరలేచే సరికి—ఇద్దరు పిల్లలు,

రామం: వయస్సు 12 యేళ్లు లలిత: వయస్సు 8 యేళ్లు, ఎడం ప్రక్కగా పరుగెత్తుకొంటూ రంగం మధ్యలో కొచ్చి, ఓ బొమ్మకోసం పోట్లాడుకొంటూ వుంటారు ఇంట్లోంచి సన్నగా చంటి పిల్ల యేడ్పు వినవస్తూ వుంటుంది )

రామం: (రోషంతో) ఆ బొమ్మ నాది. ఇటియ్యి మర్యాదగా, లేకపోతే నీ ముక్కు కొడవలితో లేత తాటాకును చెక్కినట్టు చెక్కుతా. ఏమనుకొన్నావో ?

లలిత: (మూరాము చేస్తూ) ఉహుం ! ఈ బొమ్మ నాదే. మామయ్య నాకే కొనిచ్చాడు.

రామం: అదంతా నాకు తెలవదు. ఆ బొమ్మ నాకు కావాలి. ఇస్తావా? లేదా? (కలియ బడతాడు దౌర్జన్యంగా.)

లలిత: (యేడ్పు ముఖంతో) అమ్మా! అమ్మా! అన్నాయ్! కొడుతున్నాడే!......అమ్మా! అమ్మా!

సీతారావమ్మ: (ఇంట్లోంచి ప్రవేశిస్తుంది. సన్నగా, బలహీనంగా, వ్యాధిగ్రస్తురాలివలె వుంటుంది. ఆమె ముఖంలో అశాంతి, చిరాకు, కోపంతో కూడుకున్న విరాళ ద్యోతక మవుతూ

వుంటాయి) ఏమిట్రా మీ గోల అబ్బబ్బా! ఈ కొంపలో ఒక్క క్షణం కునుకు తీసే యోగం లేదుగదా! ఏం పిల్లలో, ఏం లోకమో గానీ, ఇంత మంది పిల్లలతో అడ బ్రతుకు బ్రతికే కంటే—అడవిలో మ్రానై పుట్టటం మేలు. మగ పిల్లవాడివి నీకు బొమ్మ దేనికిరా? ఆయిందీలేదూ. కానిది లేదూ—ప్రతి దానికీ ఇంట్లో గుద్దులాటే! దాన్ని ఆడుకో నివ్వు శుభ్రంగా చదువుకోక—పొద్దస్తమానమూ అడ పిల్లల్ని ఏడ్పిస్తూ వుంటావు నీకేం పోయే కాల మొచ్చిందిరా!

(చంద్రం ప్రవేశం—పది యేళ్ల వయస్సు. ముక్కునిండా నెత్తురుతో, చొక్కాలాగూ వుట్టితో—వీధి వాకిట్లోంచి. ముఖంలో ఏడ్పు పడదోసు కొస్తూ వుంటుంది.) అరే! అదేమిట్రా! ఆ ముక్కు నిండా నెత్తురూ, ఆ గుడ్డల నిండా దుమ్మూ! ఎక్కడ కూల బడ్డావురా! అసలేం జరిగిందిరా? పూర్వ జన్మలో చేసికున్న పాపానికి ఈ జన్మలో శిక్షించడానికి పుట్టుకొచ్చిన మూక గానీ—మీరు నిజంగా తల్లి దండ్రుల్ని సుఖపెట్టే పిల్లలుట్రా!

చంద్రం: (ఏడుస్తూ) వాళ్ల సూరిగాడు అరుగు మీద నిల్చుంటే క్రిందికి తోశాడమ్మా! రోడ్డు మీద పడ్డాను.

సీతా: ఏడ్చావులే వెధవా! నీ కెన్ని సార్లు చెప్పాను వాళ్ల పిల్లల జోలికి పోవద్దని. నా మాట వింటేనా? ఏం సంతానమో, భగవంతుడా—మా పాపంకొద్దీ ప్రాణాల్ని పిండి వేస్తు న్నారు. అల్లుకున్న దోసపాదులాంటి యీ సంసారం యమకూపంలాగా వుంది క్షణంసేపు ప్రశాంతంగా వుండే అదృష్టంలేదు. అటు చూస్తే పాలు చాలక చంటిదాని ఏడ్పు. ఇంట్లో రెండో పిల్లకు పొంగువచ్చి దాని బాధ:—ఇటు చూస్తే యీ పిల్లల గుద్దులాటా. వీధిలో తన్నులాటా. చచ్చే చావుగావుంది. ఆయనకేం పొలాన మహారాజు. కొంపలో పిల్లలతో ప్రత్యక్ష నరకం ఆయనకర్థం కాదు. పంచాంగాలు మారుతున్నకొద్దీ పిల్లలు పెరుగుతున్నారు. ఆయనకేం చీమకుట్టినట్టుగా కూడా లేదు. రోగా లతో, పిల్లలతో, పోట్లాటలతో, చీకాకులతో, నిస్సా రంగా, నిరాశగా నేను మాడిపోయే రోజులు వచ్చాయిగానీ ఆయనకేం దున్నపోతు మీద వర్షం కురిసినట్టుగా వుంది. నడాన నలిగి చచ్చేదినేనే!

(నారాయణ ప్రవేశం అవూరి పంచాయతీ బోర్డు ప్రసి డెంటు. ఆదిశేషయ్య చిరకాల మిత్రుడు. వయస్సు 45 సంవత్స రాలు. ఆడంబరంలేని వ్యక్తి. ఖద్దరులాల్చీ, ఖద్దరుధోవతీ, ఖద్దరు పైపంచా ధరించి—ఎంతో నిండుగా వుంటాడు. పిల్లలు లోపలకు వెళతారు చనువుగా మంచంపైన కూర్చుంటాడు)

నారాయణ: ఏం సీతారావమ్మా! ఆదిశేషయ్య పొలాన్నుంచి ఇంకా రాలేదా? పసుపుదోటకు తడికట్టడం పదిగంటలకే అయి పోతుందన్నాడే.

సీతా: (ఈసడింపుగా) ఆయన కింటిగొడవ పడితేనేగా! పొలమే ఆయనకు వైకుంఠం పొలంలో నోరులేని జీవిగా పని చేయటమే ఆయన బ్రతుకు. ఈ పిల్లలతో నేను మంగ ళంలో ఎండు మిరపకాయలాగా వేగిపోతున్నాను. నా బాకి రీకి సానుభూతి చూపే దిక్కులేదు.

నారా: సంసారం మహాసాగరం. ఆ మహాసాగరంలో దంపతులు నౌకమీద ప్రయాణంచేసేవారు. ఆనౌకకు ఎల్లాంటి అపా యం రాకుండా చూసికోవడం—ఆ దంపతుల విద్యుక్త ధర్మం. సంసార సాగరంలో సౌఖ్య ప్రదంగా ప్రయాణం చేయాలంటే—ఒండొరులు చెరగని విశ్వాసాన్నీ, నిర్మల మైన ప్రేమాభిమానాల్నీ, మనోదారుఢ్యాలనూ, క్షీణింపని ఓర్పునూ కలిగివుండవలె. ప్రతి చిన్న విషయానికీ ఆవే శాన్ని పెంచుకొని—నిరాశతో విప్పురవ్వలాగ విట్టూర్చ రాదు

సీతా: మీకేం ఎన్నైనా చెబుతారు! సంసారం కొండవీటి చాంతా డులా పెరిగి పోతూంటే—ఆవేశాలూ, నిరాశాలూ పెచ్చు పెరుగక ఓర్పులూ, ప్రేమాభిమానాలూ, విశ్వాసాలు నిలబడతాయా? తెల్లవార ఝామున తొలికోడి కూతకు లేచింది మొదలు రాత్రి నడిఝాము వరకూ—ఎంతో చీకాకు, కీచులాటలు, పిల్లల యేడ్పులు, రోగాలు, మందులు, వంట గదీ—వీటితో బ్రతుకు బండబారి పోతూన్నది. మీకేం ఒక అబ్బాయీ, అమ్మాయీ పుట్టగానే డాక్టరు దగ్గరకు వెళ్లి—మళ్లీ పిల్లలు పుట్టే గీతలేకుండ చేసుకున్నారు. సలక్షణంగా, సుఖంగా కాపురం చేసుకుంటున్నారు. ఈ పిల్లల గోలా, రోగాలూ, మందులూ, నీరసాలూ, నిస్స త్తువలూ, విరాశలూ, గందరగోళాలూ—మీకేం తెలుస్తాయి?

నారా: (నవ్వుతూ) అట్లా అన్నావు. బావుంది. కుటుంబాన్ని పరిమితం చేసికొని, కుటుంబ సౌఖ్యాన్ని అందు బాటు

లోకి తెచ్చుకోవడం—మనచేతుల్లో పనే! పంచ వర్ష ప్రణాళికల ద్వారా దేశం సత్వరాభివృద్ధి చెందుతున్న యీ తరుణంలో విజ్ఞానులైన వాళ్లు అనుసరిస్తూ ఉన్న పద్ధతికూడా అదే! సంతాన నిరోధనం వల్ల అనేకమైన ప్రయోజనాలు కుటుంబానికీ, దేశానికీ ఉన్నాయి. మన రాష్ట్రపతి సర్వేపల్లి రాధాకృష్ణ ఏమన్నాడో తెలుసా? "మాతృ ఆరోగ్య రక్షణకు, పసిబిడ్డల భావి దౌన్నత్యానికి కుటుంబ నియంత్రణం ముఖ్యం. ప్రజలు యీ నిజాన్ని గ్రహించాలి." ప్రధాన మంత్రి నెహ్రూ పండితుడు కూడా "మన సుఖజీవనానికి అధిక సంతానం ముఖ్యమైన ఆటంకం. ఇది అందరూ గమనించి ప్రజలు కుటుంబ నియంత్రణ మవలంభించి దేశాభివృద్ధికి తోడ్పడాలి" అని ప్రబోధించాడు. ఆ వాక్యాన్ని మనం ఆదర్శాలు తీసికొని కుటుంబాల్ని పరిమితం చేసికోవటం ఎంతైనా అవసరముంది.

(ఆదిశేషయ్య ప్రవేశం. వయస్సు 40 సంవత్సరాలు. చూడగానే మట్టిమీద బ్రతికే మనిషి అని గ్రహించవచ్చు. తల గుడ్డ, సిర్కావిధోవతి, మోచేతులు దిగిన ముతక ఖద్దరు చొక్కా ధరిస్తాడు. ముఖంలో అమాయకత్వం మూర్తీభవించి వుంటుంది)

**ఆది :** ఏమిటి నారాయణా! ఏవేవో రాజకీయాలు మాట్లాడుతుండావు.

**నారా :** కుటుంబానికి సంబంధించిన రాజకీయాలులే.

**ఆది :** (భార్యనుద్దేశించి) కాఫీని మంచినీళ్లు పట్టుకురావే

(సీతారావమ్మ ఇంట్లోకి వెళుతుంది)

కుటుంబంలో రాజకీయాలేమున్నాయి!

**నారా :** గానుగ ఎద్దుకు గుండ్రంగా తిరగడం తప్ప ఏమీ తెలీదు. అట్లాగే నీకు పొలంలో వొళ్లు వంచి అహర్నిశమూ పని చేయడం తప్ప దేశం ఎట్లా నడుస్తుందో తెలీదు. కుటుంబంలో ప్రశాంతతకూ, సౌఖ్యానికీ, ఆయురారోగ్యాలకూ—ఎట్లాంటి నియమాల ద్వారా, పద్ధతుల ద్వారా కృషి చేయాలో ఇంటికి యజమానియైనవాడు గుర్తించి, ఆయా పద్ధతుల్ని సత్వరం ఆచరణలో పెట్టాలి తన కుటుంబ రక్షణకే కాక, దేశ క్షేమానికి కూడా ఎంతో మేలు చేసినవాడవుతాడు. కుటుంబాలు సౌఖ్యవంతాలైతేనే గాని దేశం సౌఖ్యవంతం కాజాలదు. కుటుంబాలు సౌఖ్యవంతాలు కావటానికి ముఖ్య సూత్రం కుటుంబాన్ని పరిమితి చేసికొనే బాధ్యతను ప్రతి కుటుంబ యజమానీ విధిగా తెల్సికోవాలి. కుటుంబనియంత్రణాన్ని అమల్లో పెట్టాలి. జనాభివృద్ధి గమనించి, దేశంలో ఆహారమూ, విద్య, వైద్యం, గృహవసతి మొదలైన సమస్యల్ని దృష్టిలో పెట్టుకొని—ఎవరి ఆర్థిక స్థితికి వారికి తగినట్టుగా కుటుంబ పరిమితిని నిర్ణయించుకొనడం సమంజసం. కుటుంబంలో పిల్లలెక్కువైన కొద్దీ సౌఖ్యం తక్కువ బాధ్యతలూ ఎక్కువ

**ఆది :** (భార్య మంచినీళ్ళు తీసుకొనిరాగా, త్రాగి) నువ్వు చెప్పేదంతా లోక విరుద్ధంగా వుంది నారాయణా! కుటుంబం పెరగడం, తరగడం, అంతా భగవంతుని లీల. ప్రకృతి సిద్ధం. కృత్రిమమైన మార్గాల ద్వారా పుట్టే పిల్లల్ని అరికట్టడం పాపం కదూ! అధర్మం కదూ!

**నారా :** (నవ్వుతూ) అందరి మనసుల్లో పేరుకొన్న మొండి సందేహాలు నీలోకూడా పేరుకొని ఉన్నాయి ఆదిశేషయ్యా! కుటుంబ నియంత్రణం పాపమా? అధర్మమా? ఎవరు చెప్పారు నీకు? ఒక సామాన్య కుటుంబీకుడు గంపెడు పిల్లలతో—తాను సంపాదించినది వాళ్ళ పోషణకు పరిపోక పోగా, పస్తులు వుంటూ, బాధలు పడుతూ వాళ్లకు చదువు చెప్పించలేక, దుస్తులు కుట్టించలేక, రోగాలొస్తే వైద్యం చేయించలేక ప్రత్యక్ష నరకాన్ని అనుభవించడం పుణ్యమా? ధర్మమా? దేశ కాల పరిస్థితులకు సరిపడని పుణ్యాన్ని, ధర్మాన్ని ఆరాధించడం అవివేకమంటాను. ప్రణాళికాబద్ధమైన కృషితో నవభారత నిర్మాణం మహావేగంగా జరుగుతోంది. దేశంతో పాటు ప్రతిపౌరుడూ తన బాధ్యతలను తెలిసికొని కుటుంబ నియంత్రణం ద్వారా అభ్యుదయాన్ని పొందాలి. కుటుంబ సౌఖ్యాన్ని కాపాడుకొంటూ దేశ క్షేమానికి పాటుబడాలి.

**ఆది :** ఇంతకూ యీ ఉపన్యాసమంతా దేనికి నారాయణా!

**నారా :** నీకోసమే!

**ఆది :** (ఆశ్చర్యంగా) నాకోసమా?

**నారా :** అవును. ఇప్పటికే మన గ్రామం అనేక సమాజాభివృద్ధి కార్యక్రమాల్లో ముందంజవేసి జిల్లాలో "ఆదర్శ గ్రామం" గా పేరు ప్రఖ్యాతులు గడించింది. పంచాయతీ రాజ్య వ్యవస్థ పరువు ప్రతిష్ఠల్ని ద్విగుణీకృతపర్చింది. పంచా

యతీరాజ్య పురోగమనానికి ప్రతిబింబంగా నిల్చింది. పంచాయతీసమితి ఏర్పడ్డాక మన వూరు గ్రామీణ అభ్యుదయానికి చెందిన పలురంగాల్లో అతి శీఘ్రకాలంలోనే ప్రశంసనీయమైన అభివృద్ధిని సాధించింది. పడమటి పొలాన ఒకటో నెంబరు బ్రాంచి కెనాల్‌పైన రైతులందరి దగ్గరా 800 రూపాయలు పోగుచేసి, శ్రమదానంతో సమితివారి సహాయంతో గట్టి వంతెనను నిర్మించాము గదా సమితి యాజమాన్యాన ఒక వయోజన విద్యా కేంద్రం స్థాపించబడింది గదా. గ్రంథాలయ నిర్మాణం కోసం ఒక నాటకం ప్రదర్శించి–వెయ్యి రూపాయలు రాబట్టాము. ఇంకా విరాళాలు సేకరిస్తున్నాము. పంచాయతీసమితివారు తగు సహాయాన్ని వాగ్దానం చేశారు. గ్రామస్థుల విరాళాల సహాయంతోనూ, సమితి అధికారుల ప్రయత్నంతోనూ–మన ఊళ్లోని మాధ్యమిక పాఠశాల ఉన్నత పాఠశాలగా రూపొందించబడిన విషయం నీకు తెలుసుగదా. నిరుడే గ్రామానికి విద్యుచ్ఛక్తి వచ్చింది. ఊళ్లో అన్ని వీధులకూ, అన్ని సందులకూ దిట్టమైన మెటల్ రోడ్లు వేయబడ్డాయి. ఈ తృతీయ పంచవర్షప్రణాళికాంతానికి పెద్ద బజారుకు సిమెంటు రోడ్డు వేయబడ్డా ఆశ్చర్యపడనక్కర్లేదు. మూడేళ్ళక్రితమే ఊళ్లో అయిదువేల రూపాయల భవనంలో ధర్మాసుపత్రి ఏర్పడింది. మహిళా సంక్షేమ పథకాలు కూడా మన గ్రామంలో అమలు జర్పబడుతున్నాయి. స్త్రీలకొరకు ఒక కుట్టుపని కేంద్రమూ, చరఖా కేంద్రమూ, నవారు నేత కేంద్రమూ తెరువబడ్డాయి. వ్యవసాయంలో కూడా మన రైతులు కొత్త పద్ధతుల్ని అవలంభిస్తూ ప్రమాణాల్ని స్థాపించుతున్నారు. అందుకు ఎగ్రికల్చరల్ డిపార్టుమెంటువారు దోహదమిస్తున్నారు. మన పంచాయతీసమితి ఈ మధ్యనే ప్రాథమిక పశు చికిత్సా కేంద్రాన్ని మన ఊళ్లో ఏర్పాటు చేసింది. మన పంచాయతీ బోర్డు ఒక బ్రీడింగ్ బుల్‌ను అంటే ఆంబోతును పోషిస్తున్నది. చిన్న మొత్తాల పొదుపు ఉద్యమంలో కూడా సమితి మొత్తానికి మన గ్రామానిదే అగ్రస్థానం. ఇంకా మనం "స్వయం సహాయక" పథకం క్రింద ఎన్నో అభివృద్ధికి దారితీసే మంచి పనుల్ని తలపెట్టి చేస్తున్నాము. అట్లాంటి అభ్యుదయ పథంలో వున్న మన గ్రామంలో కుటుంబనియంత్రణావశ్యకతను అందరికీ బోధించి, ఆచరణ ద్వారా గ్రామ ఆర్థిక వ్యవస్థకూ, అభ్యుదయానికీ సంపూర్ణంగా సహాయపడాలని మా సంకల్పం కుటుంబనియంత్రణాన్ని గురించి ప్రజల్లో వున్న మూఢవిశ్వాసాల్ని, అనవసరపు భయాల్ని తొలగించి–సుముఖులుగా చేయాలని మా ఉద్దేశ్యం. నీమటుకు నువ్వు ఆలోచించు అయిదుగురు పిల్లలతో కుటుంబంలో శాంతిని సౌఖ్యాన్నీ చూడగలుగుతున్నావా? వాళ్ళందరికీ మంచి చదువులు చెప్పించి, ప్రయోజకులుగా చేయగలవా? కాన్పులెక్కువై నీ భార్య ఆరోగ్యం ఎంతగా క్షీణించిపోతున్నదో గమనిస్తున్నావా? స్త్రీ జీవితంలో పురుడు నుంచి బయటపడడమంటే–పునర్జన్మ ఎత్తినంత పనే. మొన్న ఓ తెలుగు పండితుడు నాతో అన్నాడులే "నేను సంపాదించలేక సతమతమవుతున్నాను మా ఆవిడ పిల్లల్ని కనలేక కాటికి కాళ్లు చాస్తున్నది. ఆయన స్థితి చూసి నాకెంతో జాలి వేసింది. తను పదేళ్ళ క్రితమే కుటుంబనియంత్రణాన్ని ఆచరణలో పెట్టివుండవల్సిందని తన అవివేకతను తానే నిందించుకున్నాడు. ఇట్లా లోకంలో బాధపడుతూన్న కుటుంబాలు లక్షలకొద్దీ ఉన్నాయి. కుటుంబ ఆర్థిక స్థితి అభివృద్ధికీ సుఖజీవనానికీ, తమ బిడ్డల్ని కాపాడుకొనే శక్తిని కలిగి వుండటానికీ–కుటుంబనియంత్రణమే సుఖమైన సాధనం. దాన్ని నువ్వు ఆచరణలో పెట్టి తీరాలి ఆదిశేషయ్యా.

ఆది : (భయంతో కూడుకున్న ఆశ్చర్యంతో) నేనా ?

నారా : అవును. నువ్వే.

ఆది : నావల్లకాదు పిల్లలెంతమంది కలిగినా పోషించగల నమ్మకం నాకున్నది. పిల్లలే కుటుంబానికి నిండు ధనం. దేవుడిచ్చిన సంతానాన్ని లేకుండా చేసుకోవడం భగవంతునికి ద్రోహం చేసినట్టే. ఆ పాపం వూరికే విడిచిపెట్టదు.

సీతా : (మూతి మూడు వంకర్లు తిప్పుతుంది)

నారా : మళ్ళీ మొదటికొచ్చావు? అట్లాంటి పాపభీతి ఆత్మదైన్యతను సూచిస్తుంది గానీ భగవంతునిపై భక్తిని కాదు. ఎంత నచ్చజెప్పినా "పాపం! పాపం!" అంటావేమిటి? దేశంలో లక్షలకొద్దీ సంతాన నిరోధాన్ని అమల్లో పెడుతున్నారంటే వారంతా పాపం చేస్తున్నారనే అర్థమా ?

(బ్లాక్ డెవలప్‌మెంటు ఆఫీసరు శేఖరం, కుటుంబ నియంత్రణ కేంద్రాధికారిణి విశాలాక్షి ప్రవేశం. "రండి రండి" అంటూ ఆదిశేషయ్య వాళ్ళకు కుర్చీలు చూపెడతాడు. వాళ్లు కూర్చుంటారు.)

శేఖరం: ప్రెసిడెంటుగారు మాకంటె ముందే వచ్చారన్నమాట

నారా. ఆదిశేషయ్యా, నేనూ చిన్నప్పట్నుంచీ స్నేహితులం. నేను తరచూ వస్తూవుంటాను. (శేఖరాన్ని చూపిస్తూ) వీరు శేఖరంగారు మన బ్లాక్ డెవలప్‌మెంటు ఆఫీసరు (విశాలాక్షిని చూపిస్తూ) ఆమెగారి పేరు విశాలాక్షి. కుటుంబనియంత్రణ కేంద్రాధికారిణి నా కోర్కెపైనే వీరిరువురూ మన గ్రామం వచ్చారు.

విశాలాక్షి: ఊళ్ళో ఇంటింటికీ తిరిగి కుటుంబ నియంత్రణం వల్ల కలిగే లాభాల్ని వివరించి చెప్పి, దాని అమలకు సుముఖులుగా చేయాలని మా ఉద్దేశ్యం.

నారా: నేను ఇప్పటివరకూ మా ఆదిశేషయ్యకు దాని ప్రయోజనాలనుగురించే చెబుతున్నాను. కాని భయపడుతున్నాడు.

శేఖ: భయం దేనికి?

విశా: మీరేవిధంగానూ భయపడే అవసరంలేదు. కుటుంబ నియంత్రణం కుటుంబ శ్రేయస్సుకేగానీ-ఎల్లాంటి హానీ కలుగజేయదు. దాన్ని గురించి కొంతమంది పూర్వాచార పరాయణుల్లో వున్న మూఢనమ్మకాలను మీరు దృష్టిలోకి తీసికోరాదు. కుటుంబనియంత్రణం ప్రకృతి సిద్ధాంతాలకు విరుద్ధమనీ, దానివల్ల ఆయుః ప్రమాణం క్షీణిస్తుందనీ, స్త్రీ పురుషులు అనారోగ్యానికి గురి కావల్సి వస్తుందనీ, శస్త్రచికిత్స చేయబడ్డా పిల్లలు కలిగే అవకాశాలున్నవనీ,-కొంతమంది అనుకోవచ్చుగాని అవి నిజాలుకావు. కేవలం అజ్ఞానంతో అనుకోవటాలే.

నారా: నామాటలమీద నమ్మకంలేదా ఆదిశేషయ్యా! నేను ఆ మార్గాన్ని అమల్లో పెట్టానుగదా, ముగ్గురు పిల్లల తర్వాత శస్త్రచికిత్స పొందాను. నా ఆరోగ్యంగానీ, మా ఆవిడ ఆరోగ్యంగానీ-ఏమైనా క్షీణించాయా? లేదు. కుటుంబ నియంత్రణాన్ని ఆచరణలో పెట్టడంవల్ల-కుటుంబ ఆర్థిక పరిస్థితిని గురించీ పిల్లల పోషణ గురించీ, కుటుంబ సౌఖ్యాన్ని గురించీ-దృఢమైన విశ్వాసాన్ని ఏర్పర్చుకో గలిగాను. దేశంలో ప్రతి కుటుంబయజమానీ అట్లాంటి దృఢవిశ్వాసాన్ని ఎందుకు పొందరాదు!

శేఖ: బాగా చెప్పారు. మనవాళ్లు అజ్ఞానపు చీకటిలోంచి విజ్ఞానపు వెలుగు బాటలకేసి చూడలేక పోతున్నారు. మార్పుపై నమ్మకాన్ని కుదుర్చుకోలేక పోతున్నారు. చైతన్యాన్ని కల్గించాలని ఎన్ని ప్రయత్నాలుచేసినా-సందేహాలు వెలిబుచ్చుతున్నారు.

విశా: ఆదిశేషయ్యగారూ! మీకుటుంబ క్షేమం కోసమే మేము ఇంతగా చెబుతూన్నది. మీకుమీరే ఆలోచించుకొని, వాస్తవాన్ని గ్రహించుకొని-నిర్ణయానికి రావాలి. ఏమంటారు?

నారా: ఇంకా ఏమంటాడు? ఇంతమంది చెబితే కాదంటాడా?

ఆది: (కొంత మెత్తబడి. అందరికేసీ అమాయకంగా చూస్తాడు)

విశా. (సీతారావమ్మనుద్దేశించి) మీ అభిప్రాయ మేమిటమ్మా?

సీతా: (సిగ్గుపడుతూ) ఇంకా నా అభిప్రాయమేముంది! ఇప్పటికే అయిదుగురు పిల్లలతో నిత్యమూ నరకాన్ని చూస్తున్నాను. ఈ నరకం ఇంకా పెరక్కుండా వుండడమే నాకూ కావాల్సింది.

విశా: బాగా చెప్పారు. ప్రతి స్త్రీ, పురుషుడూ కుటుంబనియంత్రణావశ్యకతను గ్రహింపుచేసికొని-ఆచరణలో పెడితే దేశాభ్యుదయం ఎంతత్వరగా పరిణతిని చెందుతుంది?

శేఖ: మాకెంతో సంతోషంగా వుందండి-కుటుంబ నియంత్రణానికి మీరు అంగీకరించడం ఈ గ్రామంలో మాకృషి సఫలం కావటానికి మీ అంగీకారం నాంది,

విశా: కుటుంబ నియంత్రణానికి చాలా మార్గాలున్నాయి అన్నింట్లోకి శస్త్రచికిత్స మార్గం మంచిది. శస్త్రచికిత్స స్త్రీలకంటె పురుషులకు సులభం మీరు మాకేంద్రాని కోసారి వస్తే-ఆ ఏర్పాట్లను గురించి చెబుతాను వస్తారుగా!

ఆది: (వస్తానన్నట్టు తల ఆడిస్తాడు)

శేఖరం: (కొంత నిశ్శబ్దం తర్వాత) సరే ఇక వెళదామా?

విశా: ఇంకో ఇంటికి వెళదాం.

నారా: అల్లాగే.

(ముగ్గురూ లేస్తారు.)

విశా: శేఖరం: (నమస్కారాలు చేస్తూ) వెళ్లొస్తామండీ.

(ఆదిశేషయ్యా, సీతారావమ్మా ప్రతిగా నమస్కారాలు చేస్తారు వాళ్లు నిష్క్రమిస్తూ వుండగా తెర వాలుతుంది.)

# జుర్రేరు ప్రాజెక్టు

కర్నూలు జిల్లాలో గల జుర్రేరు నదిపై చేపట్టిన మధ్యరకం నీటి పారుదల ప్రాజెక్టు ఒకటి శీఘ్రగతిని పూర్తి అవుతున్నది. దీని క్రింద, క్షామపీడిత ప్రాంతాలలో 1,800 యెకరాల మొదటి పంటకు, 500 యెకరాల రెండవపంటకు నీరు లభిస్తుంది. "కరువు ప్రాంతపు పథకం" గా చేపట్టబడిన దీనివల్ల కరువు నివారణ కావటమే కాక ప్రజల సర్వతోముఖాభివృద్ధికి కూడా దోహదం కలుగుతుంది. ఇక్కడ యెక్కువగా వరి, ప్రత్తి, మెట్ట ధాన్యాలను పండించాలని సంకల్పం.

## పుట్టు పూర్వోత్తరాలు

జుర్రేరునది కుందునదికి వుపనది. ఈ కుందునది మళ్లీ పెన్నారుకి ఉపనది. ఇది ధోన్ తాలూకా జలదుర్గం అడవి కొండలలో పుట్టి, 60 మైళ్ళ దూరం ప్రవహించిన పిమ్మట కోయిల్‌కుంట్ల సమీపంలో కుందునదిలో కలుస్తుంది. ఇది జీవనది కాదు. కేవలం ఒక కొండ వాగు అరగాణి ప్రదేశమంతా కొండమయమైనందున వర్షాకాలంలో దీనిలో పుష్కలంగా నీరు ప్రవహిస్తుంది.

బనగానపల్లి సంస్థానం వున్నప్పుడే, బనగానపల్లి సరిహద్దులలో ప్రవహించే జుర్రేరునది జలాలను ప్రజల శ్రేయస్సుకై వినియోగించడానికై వివిధ పథకాలు తలపెట్టబడినవి ఈ ప్రతిపాదనలన్నీ ఆర్థిక కారణాల వల్ల విరమింపబడినవి. చివరకు, 1952 లో ప్రభుత్వాదేశంపై అనంతపురం ప్రత్యేక పరిశోధనా విభాగం సమగ్రమూ విపులమూ అయిన పరిశోధనకు పూనుకొన్నది. ఈ విభాగమే యీ పథకం ప్రస్తుత ప్రతిపాదనలకు తుదిరూపమిచ్చినది.

వివిధ స్థలాలను పరిశీలించి, విపుల పరిశోధనలను జరిపిన మీదట యీ నదిపై ప్రస్తుత స్థలంలో ఆనకట్టను నిర్మించి వరద నీటిని వుపయోగంలోనికి తేవాలని నిర్ణయించబడింది. ఈ స్థలం జ్వాలాపురం గ్రామానికి వాయవ్యంగా 78°-8' దీర్ఘాంశానికి, 15°-19' అక్షాంశానికి మధ్యనున్నది.

అనంతపురం పరిశోధనా విభాగం ప్రతిపాదనలపై, ప్రభుత్వం యీ పథకాన్ని కరువు ప్రాంతపు పథకంగా 1958 డిసెంబరులో మంజూరు చేసింది దీనివల్ల 1,500 యెకరాల మొదటి పంటకు, 500 యెకరాల రెండవపంటకు నీరు లభిస్తుంది. ఈ పథకం ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో కూడా మధ్యరకం నీటి పారుదల ప్రాజెక్టుగా చేర్చబడి, కేంద్ర జల, విద్యుచ్ఛక్తి కమిషన్‌చే ఆమోదింపబడినది. ఈ పథకం 1959 మార్చిలో ప్రారంభింపబడినది.

ఈ పథకం అమలుకై 1959 జూలైలో ఒక సబ్-డివిజన్ యేర్పాటు చేయబడినది మొట్టమొదట, యీ పథకం అంచనాలో తలపెట్టినట్టుగా ప్రాజెక్టు సిబ్బందికి (ప్రొవిన్షియల్, వర్క్-ఛార్జ్‌డ్ కార్మికులు) గృహవసతి నిమిత్తం ఒక కాలనీ నిర్మాణం చేపట్టబడి 1960 మార్చిలో పూర్తి చేయబడింది. ఇక్కడ కొంత కాలం శాశ్వతంగా వుండేయిళ్ళు, తాత్కాలికమైన యిళ్లు కట్టబడినవి. ఈ లోపున, యెక్కువ సరఫరా, స్పిల్‌వే శక్తిని పెంచే ప్రాతిపదికపై యీ ప్రతిపాదనలను పునర్విమర్శించవలసిన సందర్భం వచ్చింది వీటి దృష్ట్యా, యీ పథకాన్ని తిరిగి సమీక్షించి జలాశయం పూర్తి జలాశయ మట్టాన్ని 3 అడుగులు హెచ్చించాలని నిర్ణయించడం జరిగింది. తత్ఫలితంగా కొత్త పథకాలు నమూనాలను తయారుచేసి పని ప్రారంభింప వలసివచ్చింది. 1960 మేనెల ప్రారంభంలోనే ఆరంభించడానికి వీలు పడింది.

## పథకం స్వరూపం

ఈ పథకంలో మొత్తం దిగువ పనులున్నవి:-

1. 866-00 యొక్క పూర్తి జలాశయ మట్టం వద్ద గరి

ష్టం 266 మి. ష. అడుగుల వరద నీటిని పట్టుటకై 2,530 అడుగుల పిడిపిగల మట్టి ఆనకట్ట నిర్మాణం.

2. 38 క్యూసెక్కుల ప్రవాహశక్తితో 4½ మైళ్ల పొడవున ప్రవహించే ఒక ప్రధాన కాలువ. దీనివల్ల, యెడమ ప్రక్కన గల కృష్ణగిరి, పత్తిపాడు మార్కాపురం, యాగంటిపల్లె గ్రామాలలో 2,300 యెకరాలకు నీరు లభిస్తుంది.

3 కుడివైపున మరొక ప్రధాన కాలువ. ఇది దాదాపు 200 యెకరాల కొత్త ఆయకట్టుకి నీరు సరఫరా చేయడానికి. జ్వాలాపురం చెరువు క్రిందగల దాదాపు 50 యెకరాల ప్రస్తుత సరఫరాను హెచ్చించుటకు వుద్దేశించబడినది.

4 ప్రస్తుతపు ప్యాపలి–బనగానపల్లి రోడ్డు 26/2–26/6 మధ్య మునిగిపోతుంది కాబట్టి యెత్తున కొత్తరోడ్డు నిర్మాణం.

(లోతునదీ. గర్భంలోకాక) యెడమ వైపున ఎల్.ఎస్. 1487, ఎల్. ఎస్. 1605ల మధ్య, 40′ × 15′ పరిమాణం గల రెండు నిర్గమన ద్వారాలతోనూ, నాన్ స్పిల్ వే సెంట్రల్ బ్లాక్–హెడ్ సెక్షన్‌లో ఉండే 5′ × 7′ పరిమాణంగల రెండు స్కోర్ నిర్గమన ద్వారాలతోను ఒక రెగ్యులేటర్‌ను నిర్మించడం యీ పథకంలో గల ప్రత్యేకాంశం. లోతు గర్భం విభాగంలోనూ, రెండు పార్శ్వాలా మట్టికట్టలు నిర్మించబడుతుంది. ఈ మట్టి కట్టలకై సాధారణంగా, అభేద్యమైన నేలలు తగిలిన సందర్భాలలో తప్ప, 3 పూ. జ. మ. లోతుకి గాడులు త్రవ్వబడతవి.

## వ్యయం

ప్రత్యక్ష పరోక్ష ఖర్చులు రెండిటికి రూ. 25.4 లక్షల అంచనా మంజూరు చేయబడినది.

## జరిగినకృషి

**మట్టికట్టలు:**

నదీ గర్భంలోను, పార్శ్వాల మట్టికట్టలు అభేద్యమైన మధ్య భాగంతో నిర్మించబడతవి. ఈ కట్టల అగ్రం వెడల్పు 18′. 0″ వుంటుంది. అభేద్యమైన నేలలు తగిలితే తప్ప గాడిలు 3 పూ. జ. మ. లోతుకి తీయబడతవి ముందుభాగం ముతక రాతితో కప్పబడుతుంది. ఈ రాతిమందం 847.00 కి దిగువ 1′–6″లు, 847.00కి పైన 1′–0″లు వుంటుంది. మురుగునీరు పోవుటకై తగిన లాంగి ట్యూడనల్ ఫిల్టరు. పార్శ్వాల 50′–0″ అంతరంలోనూ, నదిలో 30′–0″ అంతరంలోనూ అడ్డ కాలువలు యేర్పాటు చేయబడతవి. ఈ పనులన్నీ నూటికి 90 వంతులు పూర్తి అయినవి మట్టికట్టలు. మట్టిమోసే యంత్రం సహాయంతో నిర్మించబడుతున్నవి. ఈ కట్టల సగటు మట్టం దాదాపు 862–00

## రెగ్యులేటర్ నిర్మాణం

ప్రధాన కట్టడం గోడ సున్నపుపని అన్ని విధాల పూర్తి చేయబడినది. రెండువైపులాగల అండగోడలు రెక్కలు వగైరా 860.00 మట్టం వరకు కొని తేబడినవి. నాన్–స్పిల్ వే బ్లాకులోగల 5′ × 7′ పరిమాణం గల రెండు స్కోర్ నిర్గమన ద్వారాల పని కూడా పూర్తి కావస్తున్నది.

స్కోర్ తూము తలుపుల విషయంలో సీతానగరం పి.డబ్ల్యు. వర్క్‌షాపు నుంచివచ్చిన భాగాలు అప్పుడే అమర్చబడినవి. ఇక గేటు మాత్రమే రావలసి వున్నది. ప్రధాన నిర్గమన ద్వారాల విషయంలో, యీ గేట్ల తయారీ సీతానగరం పి.డబ్ల్యు. వర్క్‌షాపుకి యివ్వబడింది.

## ప్రధాన కాలువలు

ప్రధాన కాలువ త్రవ్వకం, అడ్డ సున్నపు పనులతో సహా 2/6 వరకు పూర్తి అయినది. 2/6కి అవల కూడ కాలువ త్రవ్వకం పూర్తి అయినది కాని మధ్యరెండు ముఖ్యమైన అడ్డ సున్నపు పనులు మిగిలి పోయినవి. వీటిని యెవరిచేత త్రవ్వించాలనే విషయం యింకా తేలవలసి వున్నది. ప్రాజెక్టు కొత్తకాలువను, యిప్పటి జుర్రేరు ఆనకట్ట సరఫరా కాలువతో కలిపే లింకు కాలువను త్రవ్వవలసివుంది. అలాగే, కొత్త అంచనా నీటిని పట్టేందుకు వీలుగా ఆ కాలువను మరమ్మతు చేయవలసి వున్నదికూడ.

ఏడు బ్లాకులలో మొదటి రెండు బ్లాకులకు, ఆయకట్టు స్థిరీకరణకై, తుదిరూప మివ్వబడినది

ఈ పనిపై యింతవరకు రూ 18.6 లక్షలు ఖర్చు చేయబడినవి.

## ముందు కార్యక్రమము

ఈ జలాశయానికి క్రెస్టుగేట్లు అమర్చకుండానే 7′ లోతు వుపయోగకరమైన నీటిని నిలవచేయవచ్చు. ఈ విధంగా యీ పథకం సగం పూర్తి అయినంతనే కొంత వుపయోగంలోనికి రాగలదు. కావలసినవల్లా రెండుస్కోర్ గేట్లు ఈ పరిస్థితులలో యీ పథకాన్ని 1962 సెప్టెంబరు–అక్టోబర్‌లనుంచి ఆరంభించి దశలవారీగా వుపయోగానికి తేవాలని సంకల్పం

జలాశయం క్రింద పూర్తిగా మునిగిపోయిన పొలాల విషయంలో భూమి సంపాదన ప్రతిపాదనలు, కాలనీ, మళ్లింపు రోడ్డు అలాగే యిప్పుడు త్రవ్వినంతవరకు కాలువ ప్రతిపాదనలు యిదివరకే పంపబడినవి ఈ పథకంలో యే ఒక్క గ్రామము మునగదు కనుక పునరావాస సమస్య తలయెత్తదు. *

# ప్రభుత్వ నిర్ణయాలు

రాష్ట్రంలో అనావృష్టికి గురియైన 10 జిల్లాలలోని 12 తాలూకాలలో శాశ్వత నివారణ చర్యలు తీసుకోడానికి రూ. 8.07లు కోట్లు ఖర్చు కాగల ఒక ముసాయిదా బృహత్ పథకాన్ని ప్రభుత్వం ఆమోదించింది. ఈ పథకం ఆమోదింపబడిన తర్వాత భారత ప్రభుత్వం ఈ ఖర్చును భరిస్తుంది. ఈ పథకాన్ని నల్గొండ, మెదక్, మహబూబ్‌నగర్, కరీంనగర్, హైదరాబాద్, కర్నూలు, కడప, అనంతపురం, చిత్తూరు, నెల్లూరు జిల్లాలలో అమలు జరుపుతారు.

ఈ పథకం క్రింద ఖర్చు ఈ క్రింది విధంగా ఉంటుంది.

| | |
|---|---|
| చిన్నతరహా నీటి పారుదల సౌకర్యాలు | రూ. 80 లక్షలు |
| కమ్యూనిటీ బావులు | ,, 1 కోటి |
| పశుపోషణ | ,, 22 లక్షలు |
| లఘు పరిశ్రమలు | ,, 1.07 కోట్లు |
| భూసారం | ,, 1.06 కోట్లు |
| సహకారం | ,, 21 లక్షలు |
| అడవులు | ,, 34 లక్షలు |
| వ్యవసాయం (భూసారం కాక) | ,, 2.2 కోట్లు |

• మంత్రివర్గం తెలుగు టైపు మిషన్లను ఎన్నిక చేయడానికి, తెలుగు టైప్‌రైటర్ కీ బోర్డుపై ఆరు నెలల పాటు పరిశోధనలు జరపడానికి ప్రభుత్వం నిర్ణయించింది.

• సిర్‌సిల్క్ ఫ్యాక్టరీ విస్తృత కార్యక్రమానికి సహాయం చేయడానికి ప్రభుత్వం ఋణంగా ఇచ్చిన 3.06 కోట్లు రూపాయలలో ఒక కోటి రూపాయలను వాటాగా మార్చడానికి ప్రభుత్వం నిర్ణయించింది. ఈ పథకానికి సిర్‌సిల్క్ లిమిటెడ్ సంస్థ 3 కోట్ల రూపాయలను నిర్ణయించింది. ప్రస్తుతం కంపెనీ వాటా పెట్టుబడి మూడుకోట్ల రూపాయలు. అందులో ప్రభుత్వానికి 19 శాతం వాటాలున్నాయి.

* బేబీ ఫుడ్ తయారు చేసే ఫ్యాక్టరీని ఆంధ్రప్రదేశ్‌లో నెలకొల్పడానికి భారత ప్రభుత్వం నిర్ణయిస్తే ఫ్యాక్టరీ స్థాపనకు 500 ఎకరాల ప్రభుత్వ భూమిని ఇవ్వడానికి ప్రభుత్వం నిర్ణయించింది.



# కృష్ణానదిమీద రెండవ వంతెన

విజయవాడ వద్ద కృష్ణానదిపై నిర్మాణంలో వున్న రెండవ రైలు వంతెన 1964 సంవత్సరం చివరకు 1.7 కోట్ల రూపాయల వ్యయంతో పూర్తి కాగలదని భావించబడుతున్నది. ఈ వంతెన నిర్మాణానికి ఆంధ్రప్రదేశ్ ముఖ్య మంత్రి 1962 మే 30 వ తేదీన శంకుస్థాపన చేశారు.

తృతీయ ప్రణాళికలో దక్షిణ రైల్వే చేపట్టిన ముఖ్య పథకాలలో కృష్ణానదిపై రెండవ రైలు వంతెన నిర్మాణం ఒకటి. దాని పని ఈ సంవత్సరారంభంలోనే ప్రారంభమైంది.

విజయవాడ రెండు ముఖ్యమైన మార్గాల కూడలి. ఇందులో ఒక మార్గం అయిన కలకత్తానుంచి బొగ్గు, ఉక్కు, ఇతర సామగ్రి, రెండవ మార్గమయిన కాజీపేట, హైదరాబాద్ వైపుల నుంచి ఆహార ధాన్యాలు, ఉప్పు దినుసులు, బొగ్గు కూడా వస్తుంటాయి. ఈ రెండు రైలు మార్గాలు విజయవాడ నుంచి కృష్ణానది మీదుగా దక్షిణానికి వెడతాయి. పరిశ్రమలు పెరుగుతున్నందున, పరిసర ప్రాంతాలు అధికంగా అభివృద్ధి చెందుతున్నందున కృష్ణా, గోదావరి డెల్టానుంచి విజయవాడ పరిసరాల నుంచీ స్థానికమైన రాకపోకలు త్వరితంగా పెరిగిపోతున్నాయి. నాగార్జునసాగర్ నిర్మాణం వల్ల ఈ ప్రాంతంలో పరిశ్రమలు వ్యవసాయం ఇంకా అభివృద్ధి చెందుతాయి. కృష్ణా, గోదావరి డెల్టాల వ్యవసాయోత్పత్తి ఇప్పటికే ఎంతో అభివృద్ధి చెందింది.

వీటన్నిటి మూలంగా విజయవాడలో గత 10 సంవత్సరాలలో—రోజుకు మూడు వందల వాగెన్లనుంచి ప్రస్తుతం 600 వాగెన్ల వరకు—చెప్పుకోదగిన అభివృద్ధి జరిగింది. తృతీయ ప్రణాళిక చివరకు ఈ వాగెన్ల సంఖ్య రోజుకు 1.100 వరకు పెరగవచ్చునని భావిస్తున్నారు. ఇది జరిగినప్పుడు కృష్ణానదిపై ప్రతి రోజు 80 కి పైగా రైలు బళ్ళ రాకపోకలు జరుగుతాయి. ఇంత ఎక్కువ రాకపోకలకు ప్రస్తుతం వున్న ఒంటి మార్గం (సింగిల్ లైన్) చాలదు కనుక ఈ నదిపై ఎగువకు దిగువకు రాకపోకల సౌకర్యాలను కల్పించడానికి జంట రైలు మార్గం అవసరం అయింది

ప్రస్తుతం వున్న రైలు వంతెనను 1893 లో రాకపోకలకు తెరిచారు. ఈ వంతెనకు ఒక్కొక్క దాని మధ్య 300 అడుగుల దూరంతో 12 పెద్ద పెద్ద స్తంభాలున్నాయి. ఈ వంతెనను 40.32 లక్షల రూపాయల వ్యయంతో 1893 లో నిర్మించారు. ఇప్పుడు నిర్మించుతున్న కొత్త వంతెన పొడవు కూడా అంతే వుంటుంది. దీని నిర్మాణానికి 1.7 కోట్ల రూపాయలు ఖర్చు అవుతాయి. ఆ రోజుల్లో ఉక్కు ఎంతో చౌకగా కావలసినంత దిగుమతి అయ్యేది. అప్పటిలో ఈ వంతెనకు కావలసిన ఉక్కును టన్ను ఒకటికి 270 రూపాయల చొప్పున చాలా తక్కువ ధరలో కొన్నారు. కాని ఆ రోజులు పోయాయి. అంతటి నిర్మాణానికి కావలసిన ఉక్కు లభించడం ఇప్పుడు అంత తేలిక కాదు. ప్రస్తుతం నిర్మిస్తున్న వంతెనకు 3.600 టన్నుల ఉక్కు ఒక్క ఉక్కు స్తంభాలకే కావాలి. స్తంభాల పావులకు 500 టన్నుల ఉక్కు కావాలి. అంటే మొత్తం 4.100 టన్నులకు పైగా ఉక్కు కావాలి.

ఈ కొత్త వంతెన పనిని 1962 ఫిబ్రవరిలో ప్రారంభించారు. వేసవి కాలంలో నదిలో నీరుండదు గనుక—ఈ కొద్ది పరిమిత కాలంలో—నాలుగు పావుల నిర్మాణం పూర్తవుతుందని భావిస్తున్నారు. 1963 సంవత్సరం చివరకు ఈ వంతెనకు సంబంధించిన ఉప నిర్మాణం అంతా పూర్తి అయి, ఉక్కు స్తంభాలను నెలకొల్పడం పూర్తయినాక, వంతెన నిర్మాణం 1964 చివరకు పూర్తిఅవుతుంది

బ్రాడ్‌గేజ్ లైను ప్రమాణ బరువులను భరించడానికి వీలుగా ఈ కొత్త వంతెనను రూపొందించారు. ప్రధాన స్తంభాలను ఎక్కువ పెనుసు (టెన్షన్)గల ఉక్కుతో తయారు చేస్తారు. 1964 చివరకు ఈ వంతెన నిర్మాణం పూర్తి కావడంతో విజయవాడకు రైళ్ళ రాకపోకల సౌకర్యాలు పెంపొంది విజయవాడలో దక్షిణంలో రైళ్ళ రాకపోకల రద్దీ చాలా తేలికగా వుంటుంది.

## అభివృద్ధిలోవున్న పనులు

విజయవాడ డివిజన్‌లో చేపట్టిన ఇతర బృహత్ పథకాలు పూర్తి అయినవి, పూర్తికానున్న వాటికికూడా కృష్ణానదిపై రెండవ రైలు వంతెన నిర్మాణానికి వున్నంత ప్రాముఖ్యత వున్నది గుడివాడ–భీమవరం మీటర్ గేజ్ మార్గాన్ని బ్రాడ్ గేజ్‌గా మార్చడం. విజయవాడ–మచిలీపట్నం మార్గాన్ని బ్రాడ్‌గేజ్‌గా మార్చడం. కృష్ణా కెనాల్‌వద్ద రెండో మార్గంతో గుంటూరు–తాడేపల్లి మధ్య కార్డ్‌లైన్ నిర్మాణం, చుండూరు నుంచి గుంటూరువరకు జంట మార్గం వేయడం ఈ పథకాలలోనివే. గుడివాడ–భీమవరం బ్రాడ్ గేజ్ మార్గాన్ని 1961 అక్టోబర్‌లో తెరిచారు విజయవాడ–మచిలీపట్నం బ్రాడ్‌గేజ్ మార్గంకూడా త్వరలోనే తెరవబడుతుంది. అంతేగాక తాడేపల్లి నుంచి గుంటూరుకు కూడా కొత్త మార్గాన్ని త్వరలోనే తెరుస్తారు. వీటివల్ల విజయవాడలో బ్రాడ్‌గేజ్ ప్లాట్‌ఫారాల సౌకర్యాలు కలిగి విజయవాడలో ప్రయాణీకులకు రాకపోకల సౌకర్యాలు అధికమవుతాయి. గూడూరు వరకు జంట రైలు మార్గనిర్మాణం 1963 చివరకు పూర్తి అవుతుంది. ఈ నిర్మాణాలన్నిటికీ మొత్తం 22.34 కోట్ల రూపాయల వ్యయం అవుతుంది.

## ప్రత్యేకత

ఈ కొత్త వంతెన పునాది బావులను నదీ గర్భానికి 80 అడుగులకు పైగా లోతువరకు త్రవ్వాలి. ఈ బావుల పునాదులు 40/2 అడుగుల కొలతలో రెండు 'D' ల ఆకారంలో వుంటాయి ఒక్కొక్క బావి బరువు నాలుగువేల టన్నులుంటుంది. నదీ గర్భంలో ఈ బ్రహ్మాండమైన నూతులను ఈ వంతెన స్థలం వద్ద పరిమిత కాలంలో రేయింబవళ్ళు త్రవ్వవలసి వుంటుంది నదీ గర్భంలో ఇసుకతో కూడిన మట్టివుంటుంది. ఈరకం మట్టిలో, ఇసుకను తోడివోయడానికి తోడు బావుల మూలలను పరిశుభ్రం చేయడానికి నీటిలో ఈది వీటిని పరిశుభ్రం చేసేవారు (డైవర్లు) అవసరం ఇందుకై అనుభవ శాలులైన డైవర్లు పనిచేయవలసి వుంటుంది. ఈ బావులు త్రవ్వే ప్రాంతాన్ని బావులు త్రవ్వేటప్పుడు ఎట్టినష్టం కలగకుండా అనవరతం అత్యంత జాగరూకతతో పరిశీలిస్తుండాలి. ఈ వంతెన నిర్మాణానికి ఈ క్రింద వివిధ మొత్తాలు అవసరమవుతాయి.

| | | |
|---|---|---|
| బావులగోడలకు గట్టిపరచబడిన కాంక్రీటు | 32,000 | ఘ అ. |
| బావులకు కావలసిన రాళ్ళు | 5,20 000 | ,, |
| బావుల త్రవ్వకం | 1,079 | ,, |
| సూపర్ స్ట్రక్చర్ | 2 20,000 | ,, |
| ఉక్కు | 3,578 4 | టన్నులు |



సమ విషమాలు లేకుండా జీవితమేకాదు సృష్టే లేదు–సమతుల్యం విషమం–విషమతుల్యం సమం అయినా రెండూ భిన్నాలు–రెండూ అవశ్యాలు.

?????

# ప్రశ్నలు - సమాధానాలు

!!!!!

శ్రీ జి. అప్పారావు, ఆచంట పశ్చిమ గోదావరి జిల్లా.

ప్రశ్న: పశ్చిమ గోదావరి జిల్లా నరసాపూర్ తాలూకా ఆచంట పూర్వ విస్తరణ మండలి (ప్రీ-ఎక్స్‌టెన్షన్ బ్లాకును) ని స్టేట్ 1 బ్లాకుగా ఎప్పుడు మారుస్తారు? ఈ బ్లాకు ముఖ్య అధికారు లెవరు? వారి విధులు, అధికారాలు ఏవి?

సమాధానం: బ్లాక్ డెవలప్‌మెంట్ అధికారే ఆ బ్లాకుకు చీఫ్ ఎగ్జిక్యూటివ్ ఆఫీసరు. ఆయనకు విస్తరణాధికారుల బృందం ఒకటి వుంటుంది. అందులో వ్యవసాయం, పశుపోషణ, సహకారం, పంచాయతీలు, పరిశ్రమలకు ఒక్కొక్క దానికి ఒక్కొక్క విస్తరణాధికారి, సోషల్ ఎడ్యుకేషన్ ఆర్గనైజరు, ముఖ్య సేవికలు వుంటారు. వివిధ విషయాలలో నిపుణులైన వీరు తమ తమ శాఖల పనిని చూస్తుంటారు. బ్లాక్ డెవలప్‌మెంట్ అధికారి చీఫ్ ఎగ్జిక్యూటివ్ అధికారిగా వీరి కార్యక్రమాలను పర్యవేక్షిస్తుంటారు. బ్లాకులో ప్రాథమిక ఆరోగ్య కేంద్రాన్ని స్థాపించిన తరువాత ఒక వైద్య శాఖాధికారిని కూడా నియమిస్తారు. పైన తెలిపిన ఉద్యోగుల విధులతోపాటు బ్లాక్ డెవలప్‌మెంట్ అధికారి విధులు బాధ్యతలు 1959 వ సంవత్సరం ఆంధ్ర ప్రదేశ్ పంచాయతీ సమితులు, జిల్లా పరిషత్తుల చట్టంలో ఇవ్వబడినవి. చట్టబద్ధమైన నిబంధనలు కూడా అందులో జారీ చేయబడినవి.

శ్రీ కంచె[illegible]రంగానాయకులు, నెల్లూరు.

ప్రశ్న: గీత పారిశ్రామికులు కాని కార్మికులకు తాటి బెల్లం సహకార సంఘాల ద్వారా గ్రామీణ సౌకర్యాలను పెంపొందించడానికి తృతీయ ప్రణాళికా కాలంలో మన ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వానికి బడ్జెట్‌లో ఎంత మొత్తం కేటాయించారు?

సమాధానం: ఆంధ్ర ప్రాంతంలోని తాటి బెల్లం పరిశ్రమాభివృద్ధిని ప్రణాళికా పథకాలలో చేర్చలేదు. అయినప్పటికీ ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వం తాటి ఉత్పత్తుల అభివృద్ధి పథకం అమలుకై ప్రతి సంవత్సరం రూ. 48.300 లను గ్రాంటుగా మంజూరు చేస్తున్నది ఈ మొత్తం గాక అదనంగా అయ్యే ఖర్చును ఖాదీ గ్రామ పరిశ్రమల సంఘం ప్రభుత్వం సూచించిన సహాయక విధానాల ననుసరించి భరిస్తుంది. ఈ ఖాదీ గ్రామ పరిశ్రమల సంఘం ఆంధ్ర ప్రాంతంలో ఈ పరిశ్రమాభివృద్ధికై హైదరాబాద్‌లోని ఖాదీ గ్రామ పరిశ్రమల బోర్డుద్వారా పథకాల నామోదిస్తూ గ్రాంట్లను, ఋణాలను మంజూరు చేస్తు

న్నది. నిడదవోలులోని ఆంధ్రప్రదేశ్ తాటిబెల్లం సహకార సమాఖ్యను అనే ఒక ఎపెక్స్ సంస్థగా 1959 లో రిజిస్టరు చేశారు. ఖాదీ గ్రామపరిశ్రమల సంఘం ఈ సంస్థకు మంజూరు నిధులను ఖాదీ గ్రామ పరిశ్రమల సంఘం సలహా ప్రకారం ప్రతియేటా అమలు జరుపవలసిన పథకాలకు వెచ్చిస్తారు.

ప్రశ్న: ఇటువంటి సహకార సంఘాల వ్యాపార సరళి ద్వితీయ ప్రణాళికా కాలంలో ఎంత అభివృద్ధి సాధించింది, పట్టిక రూపంలో తెలప ప్రార్థన.

సమా: తాటిబెల్లం, ఇతర తాటి ఉత్పత్తుల అమ్మకం, ఉత్పత్తి సాధించిన అభివృద్ధి ఈ క్రింది పట్టికలో తెలుపబడింది +

ప్రశ్న : ఈ పరిశ్రమకు ప్రైవేట్‌రంగానికి బయలు దాని కంట్రోలు మొత్తాన్ని ప్రభుత్వం స్వాధీనం చేసుకునే ప్రతిపాదన లేమైనా వున్నవా ?

సమాధానం : ఈ పరిశ్రమ కార్యకలాపాలను ప్రభుత్వ కంట్రోలు క్రింద తీసుకునే ప్రతిపాదనలు లేవు.

శ్రీ వి. జి కె చౌదరి మల్లారం ఖమ్మం జిల్లా.

ప్రశ్న : ఖమ్మం జిల్లాలో బూర్గంపాడు నుంచి ఏటూరునగరం వరకు 70 మైళ్ళ పొడవుగల రోడ్డు నిర్మాణాన్ని ద్వితీయ ప్రణాళికలో చేర్చడం, దానికై 1959 లో 43 లక్షల రూపాయలను మంజూరు చేయడం నిజమేనా ? ద్వితీయప్రణాళికలోని పథకాలు తృతీయ ప్రణాళికలో పూర్తి కాగలవా ?

తృతీయ ప్రణాళిక క్రింద వెనుకబడిన ప్రాంతాల రోడ్లకు కేంద్రం మంజూరు చేసే నిధులలో తెలంగాణాకు ముఖ్యంగా ఈ రోడ్డుకు ఎంత నిర్దేశించారు ?

ఖమ్మం జిల్లాలోని భద్రాచలం వెంకటపురం, బూర్గంపాడు తాలూకాలను ఏజన్సీ ప్రాంతాలుగా ప్రభుత్వం గుర్తించింది అటువంటప్పుడు ఈ ప్రాంతంలో రోడ్ల అభివృద్ధికి ఎంత మొత్తం కేటాయించారు ?

సమాధానం : ఖమ్మం జిల్లాలోని బూర్గంపాడు-ఏటూరునగరం రోడ్డుకు ప్రభుత్వం 37.10 లక్షల రూపాయలను మంజూరు చేసింది. ఇందులో 5 లక్షల రూపాయలు వ్యయమయ్యే రోడ్డు నిర్మాణాన్ని తెలంగాణా ప్రాంతీయ సంఘం చేపట్టింది మిగతా పనిని మంజూరు చేసినప్పటికీ తగిన నిధులు కావలసినందున దానిని మూడవ ప్రణాళికలో చేపట్టటం జరగదు.

ఆర్థికంగా వెనుకబడిన ప్రాంతాల అభివృద్ధికి భారత ప్రభుత్వం తృతీయ ప్రణాళికలో ఎట్టి గ్రాంటులను ఇవ్వడం లేదు.

నాగూరు, భద్రాచలాలను మాత్రమే ఏజన్సీ ప్రాంతాలుగా గుర్తించారు గాని ఖమ్మంను కాదు తెలంగాణాలో ఏజన్సీ ప్రాంతాల పనులకు 16.66 లక్షల రూపాయలను మంజూరు చేశారు.

శ్రీ యం. రంగారావు పట్నాయక్, వసన్నపేట, శ్రీకాకుళం జిల్లా.

ప్రశ్న : శ్రీకాకుళం జిల్లాలోని నారాయణపురం ప్రాజెక్టుకు ఐదేళ్ళ క్రిందట శంఖుస్థాపన చేశారు. దీని నిర్మాణం ఎప్పుడు పూర్తవుతుంది ? ఈ ప్రాజెక్టువల్ల ఎంత భూమి సాగుకు వస్తుంది ? దీనిపై ఎంత మొత్తాన్ని వెచ్చించారు ? ఎన్ని గ్రామాలకు లాభం చేకూరుతుంది?

+ ఉత్పత్తి

| సంవత్సరం | నీరా | తాటిబెల్లం | కలకండ, ఇంకా ఇతర తాటి ఉత్పత్తులు |
|---|---|---|---|
| 1956–57 | 3,32,354 గాలన్లు | మణుగు 13 82 పౌన్ల చొప్పున 80,049.51 మణుగులు | — |
| 1957–58 | 8,14,951 .. | 77,878 .. | 466 పౌ. |
| 1958–59 | 5,61,331 .. | 97,798 .. | 643 .. |
| 1959–60 | 17,62,667 .. | 77 లక్షల . | 1896 .. |
| | | | 1023 |
| 1960–61 | 13,59,812 .. | 2.06 లక్షల .. | 686 .. |
| | | | 582 .. |
| | | | 929 .. |

సమాధానం : నారాయణపురం ప్రాజెక్టు పని 31_7_1962 నాటికి పూర్తికావచ్చని భావించబడుతున్నది.

ఈ క్రింద తెలిపిన ఆయకట్టు భూములకు ఈ ప్రాజెక్టు నీటిని 1959, 1960, 1961 సంవత్సరాలలో మొదటి పంటకు సరఫరా చేయడం జరిగింది.

| | | | | |
|---|---|---|---|---|
| 1959 | ... | ఎడమ వైపు | 15,294 | ఎకరాలు |
| 1960 | ... | ఎడమ వైపు | 15,294 | ఎకరాలు |
| | | కుడివైపు | 2,810 | ఎకరాలు |
| 1961 | ... | ఎడమవైపు | 15,390 | ఎకరాలు |
| | | కుడివైపు | 7,750 | ఎకరాలు |

ఈ ప్రాజెక్టు వల్ల ఈ క్రిందివిధంగా నీటిపారుదల సౌకర్యాలు లభిస్తాయి.

| | | |
|---|---|---|
| కాలువల క్రింద ప్రస్తుతం వున్న మాగాణి భూముల స్థిరీకరణ | 25,193 | ఎకరాలు |
| చెరువుల క్రింద వున్న మాగాణి భూములు | 6,685 | ,, |
| మాగాణిగా మార్చనున్న కొత్త మెట్ట భూములు | 4,952 | ,, |

ఈ పథకానికి 1961 నవంబర్ చివరి వరకు 66.7 లక్షల రూపాయల ఖర్చు అయింది.

ఈ ప్రాజెక్టు వల్ల పాలకొండ, చీపురుపల్లి, శ్రీకాకుళం తాలూకాలలోని 110 గ్రామాలకు లాభం చేకూరుతుంది.

శ్రీ టి. రామారావు, కన్నవీడు, కృష్ణా జిల్లా.

ప్రశ్న : గన్నవరం విమానాశ్రయం (విజయవాడ) సిబ్బంది కయ్యే ఖర్చును కేంద్రమే భరిస్తుందా లేక రాష్ట్రం కూడా కొంత భరిస్తుందా ? ప్రజలకు ఇక్కడ నుంచి రవాణా సౌకర్యాలున్నాయా ? ఉంటే ఎప్పుడు ?

సమాధానం : విజయవాడ విమానాశ్రయంలో గల సిబ్బందికయ్యే ఖర్చు మొత్తాన్ని కేంద్రప్రభుత్వమే భరిస్తుంది. ఈ ఖర్చులో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వానికి ఏవిధమైన వాటా లేదు.

ఇండియన్ ఎయిర్‌లైన్స్ సంస్థ విజయవాడ విమానాశ్రయం ద్వారా (గన్నవరం) 1962 ఏప్రిల్ 16 వ తేదీ నుంచి విమాన సర్వీసును ప్రారంభించింది. ఇందుకై డకోటా విమానాలను వారానికి రెండు సార్లు ఈ క్రింది వేళలలో నడుపుతున్నారు.

| ఐ. సి. 127/1.4. | | | ఐ. సి. 128/1.4. |
|---|---|---|---|
| 10_30 (బయలుదేరు వేళ) | హైదరాబాద్ | (చేరువేళ) | 16_55 |
| 11_45 (చేరువేళ) | విజయవాడ (గన్నవరం) | (బయలుదేరు వేళ) | 15 40 |
| 12 05(బయలుదేరు వేళ) | ,, | (చేరు వేళ) | 15_20 |
| 13.25 (చేరువేళ) | విశాఖపట్నం | (బయలుదేరువేళ) | 14_00 |



తెలియని సత్యం గురించి తెలిసినట్లు మాట్లాడితే అసత్యానికి ఆమోదముద్ర వేసినట్లే :

# వైద్య శాస్త్ర చరిత్ర

ఉస్మానియా వైద్య కళా శాలలోగల వైద్య శాస్త్ర చరిత్ర శాఖ (Department of History of Medicine) ప్రాచ్య ఖండంలో ప్రప్రథమమైంది. సుదీర్ఘమైన విస్తృత చరిత్ర గల భారతదేశంలో వివిధ యుగాలలోవి వైద్య విధానాల మీద ఆధార పడిన వైద్య శాస్త్ర చరిత్రకు సంబంధించిన పూర్వ చరిత్రను పరిశీలించి తెలపడానికి శాసన, పురాతత్వ, చారిత్రక, సాహిత్య విషయాలను సమీకరించే ఎట్టి ప్రయత్నం ఇటీవలి వరకు జరగలేదు.

ప్రముఖ వైద్యశాస్త్ర చరిత్ర కారుడైన కీ. శే. ప్రొఫెసర్ హెన్రీ సిజెరిస్ట్ కృషి ఫలితంగా అప్‌గ్రేడెడ్ వైద్యశాస్త్ర శాఖ (upgraded Department of History of Medicine) ఏర్పడింది ఈయన భోర్ కమిటీలో విదేశీ నిపుణులు, సలహాదారులలో ఒకరుగా వుండి—న్యూఢిల్లీలో స్థాపించ నిశ్చయించిన అఖిల భారత వైద్య శాస్త్ర సంస్థ (All-India Institute of Medical Sciences)లో ఒకభాగంగా—వైద్య శాస్త్రచరిత్ర శాఖ అనే ఒక ప్రత్యేక శాఖను ఏర్పరచడం అవసరమని 1944 లో సమర్పించిన ఒక మెమొరాండంలో విజ్ఞప్తి చేశారు. కాని డాక్టరు సిజ్‌రిస్ట్ సూచించిన విధంగాను, భోర్ కమిటీ సిఫార్సు చేసిన విధంగాను అఖిల భారత వైద్య శాస్త్ర సంస్థలో వైద్య శాస్త్ర చరిత్ర శాఖను స్థాపించక పోయినప్పటికీ ఈ పథకాన్ని విస్మరించడం జరగలేదు. ఈ సంస్థ స్థాపనలో జాప్యంవల్ల వైద్య విద్యావసరాలకై తగిన చర్యలను తీసుకోడానికి తగుసలహాల నివ్వడానికి భారత ప్రభుత్వం డాక్టర్ ఎ. యల్. మొదలియార్ అధ్యక్షతన "అప్-గ్రేడింగ్ కమిటీ"ని నియమించగా, పోస్ట్-గ్రాడ్యుయేట్ వైద్య విద్యాబోధనకు పలు కేంద్రాలలో నిర్ణయించిన కొన్ని శాఖలను 'అప్‌గ్రేడ్' చేయాలని ఈ కమిటి సిఫార్సు చేసింది. 1948లో పూర్వపు మద్రాసు రాష్ట్రంలో 'అప్‌గ్రేడ్' చేయడానికి సిఫార్సు చేసిన ఐదు శాఖలలో అప్పటి వైద్యశాఖ డైరెక్టర్ మేజర్ జనరల్ యస్. యల్. భాటియా సూచించిన విశాఖపట్నం ఆంధ్రా మెడికల్ కాలేజిలోని వైద్యశాస్త్ర చరిత్రశాఖ ఒకటి

## ప్రారంభం

1953లో ఆంధ్రరాష్ట్రం ఏర్పడిన తర్వాత ఈ విషయాన్ని పరిశీలించడాన్ని శైశవ స్థితిలోని ఆంధ్రరాష్ట్రానికే వదిలారు. ఆంధ్రరాష్ట్ర వైద్యశాఖ డైరెక్టర్ ఈ సమస్యను చేపట్టి భారత ప్రభుత్వంతో ఉత్తర ప్రత్యుత్తరాలు కొనసాగించి చివరకు తమ యత్నంలో కృతకృత్యులయ్యారు. విశాఖపట్నం ఆంధ్రా మెడికల్ కాలేజీలో వైద్యశాస్త్ర చరిత్ర శాఖను ప్రారంభించడానికి 1955లో ఆమోదించి ఆంధ్ర రాష్ట్రం చరిత్రను సృష్టించింది. ఆ నూతన పదవిలో—మద్రాసు వైద్య కళాశాలలో ఫిజియాలజి శాఖాధిపతి, ప్రొఫెసర్ అయిన—డాక్టర్ డి. వి. సుబ్బారెడ్డిని నియమించారు. ఈ నూతన శాఖకు భారత ప్రభుత్వ ఆరోగ్యశాఖ ఉపమంత్రి శ్రీమతి మరకతం చంద్రశేఖర్ ప్రారంభోత్సవం జరిపారు. ఆ తరువాత రాష్ట్రాల పునర్నిర్మాణం జరిగి 1956 నవంబర్ ఒకటవ తేదీన హైదరాబాద్‌ను రాజధానిగా చేసుకొని ఆంధ్ర ప్రదేశ్ అవతరించడంతో ఈ శాఖను విశాఖపట్నంనుంచి 1957 ఏప్రిల్‌లో హైదరాబాద్‌లోని ఉస్మానియా వైద్య కళాశాలకు తరలించారు.

ఈ శాఖ హైదరాబాద్‌కు మారడంతో ఈ శాఖను అప్‌గ్రేడ్ చేయాలని—విశాఖ పట్నంలో తలపెట్టిన—ప్రతిపాదనను తిరిగి చేపట్టి దీనిని అప్‌గ్రేడ్ చేయడానికి సంబంధించిన సమగ్ర ప్రతిపాదనలను భారత ప్రభుత్వానికి నివేదించారు. తుదకు భారత ప్రభుత్వం 1958లో ఇందుకు సమ్మతించిన మీదట ఈ శాఖను అప్‌గ్రేడ్ చేస్తున్నట్లుగా 1958 జూన్‌లో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ఉత్తరువు జారీ చేసింది 1959 జనవరి చివరకు డైరెక్టరును నియమించారు. పోస్ట్-గ్రాడ్యుయేట్ వైద్య విద్యలో ఇది మరొక మైలు రాయి

## నూతనరీతి

ఈ శాఖ ముఖ్యంగా పోస్ట్-గ్రాడ్యుయేట్ బోధన, శిక్షణ, పరిశోధనలకు కేంద్రంగా వుంటున్నది. కనుక ఈ శాఖను అప్

గ్రేడ్ చేసే పథకంలో నూతన అధ్యాపక బృందం కావలసి వచ్చింది.

ఈశాఖ డైరెక్టర్, ప్రొఫెసర్ ఈ శాఖకు పరిపాలనాధిపతి. ఈయన విద్యార్థులకు వైద్య శాస్త్ర చరిత్రపై ఉపన్యాసాలు నివ్వడమే గాక, అధ్యాపకులకు మార్గదర్శిగా వుండి వారికి సూచనలిస్తూ ప్రత్యేక రంగాలలో వారి పరిశోధనలకు సలహాలిస్తుంటారు. పరిశోధనాధికారి (Research Officer) తన పరిశోధనలను చూసుకుంటూ డైరెక్టర్‌కు ఆయన విధులలో సహాయపడుతుంటారు. గ్రంథాలయాధికారి (Librarian) గ్రంథాలయ విషయాలను చూసుకుంటూ, అధ్యాపక బృందానికి వారికి కావలసిన విషయ సేకరణలో సహాయం చేస్తూంటాడు. మ్యూజియం క్యూరేటరు మ్యూజియం విషయాలను చూస్తూ దానిని క్రమేణ విస్తృతపరచడానికి అనవరతం కృషి చేస్తుంటాడు. సంస్కృత, అరబిక్, పర్షియా భాషల పండితులు వివిధ కాలాలలో వ్యాప్తిలో వున్న వైద్య శాస్త్ర విషయాలకు సంబంధించిన విషయ సేకరణకై ఆయా భాషలలోని వైద్య శాస్త్ర, వైద్యేతర సాహిత్యాన్ని పరిశీలిస్తుంటారు. అరుదైన వైద్యశాస్త్ర రహస్యాల లిఖిత ప్రతులను పండితులు ఆంగ్లంలోకి, ఇతర ప్రాంతీయ భాషలలోకి అనువాదం చేస్తుంటారు. వారు భారతదేశంలో లభించే వైద్య శాస్త్ర లిఖితప్రతుల జాబితాలను చేర్చి, తమ కవసరమైన నిర్ణీత లిఖిత ప్రతులను పరిశీలిస్తుంటారు. సంచార పరిశోధకుడు (ఫీల్డ్ ఇన్వెస్టిగేటర్) నిర్ణీత సమయాలలో రాష్ట్రంలోని వివిధ ప్రాంతాలలో ఇంకా అవసరమైతే ఇతర రాష్ట్రాలలో కూడా పర్యటిస్తూ వివిధ గ్రంథ వివరణ పట్టికను, సమాచారాన్ని సేకరిస్తాడు. ఆయన సంస్కృతంలోను ఇతర ప్రాంతీయ భాషలలోను వైద్య శాస్త్ర లిఖిత ప్రతులను నిర్ణయించడానికి పరిశోధన కూడా చేస్తుంటాడు. ఈ శాఖకు సంబంధించిన చిత్రకారుడు, చరకుడు, సుశ్రుతుడు, ఇతర పురాణ వైద్య శాస్త్ర సూత్రాలనాధారంగా చిత్రాలను చిత్రిస్తుంటాడు. పరిశీలనకు, పరిశోధనకు ఉపయోగించే వివిధ గ్రంథాలయాలలోను, కార్యాలయాలలోను వున్న అరుదుగా లభించే ప్రాచీన గ్రంథాలను, వైద్యశాస్త్ర లిఖిత ప్రతులను, పత్రికలను "మైక్రో ఫిల్మ్"లుగా తీయడంలో ఫొటోగ్రాఫరు శిక్షణపొంది వుంటాడు. వైద్య చారిత్రక ప్రాముఖ్యం గల ఫిల్మ్‌లను, భారతీయ వైద్య శాస్త్ర చరిత్ర ఉపన్యాసాలకుపయోగించే ప్రత్యేక గాజు పలకాలను (స్లయిడ్‌లు) అతను తయారు చేస్తుంటాడు.

## నిర్వహణ

ఈ శాఖ కొత్తగా ప్రారంభమైంది కావడం వల్ల దీని నిర్వహణకు, సాధన సంపత్తికి అత్యధిక ప్రాముఖ్యతనిచ్చారు. ఈ శాఖలో ఈ క్రింది విభాగాలున్నాయి.

1. గ్రంథాలయం 2. మ్యూజియం 3. ప్రాచ్య పత్రాలశాల రికార్డులు-(Archives) 4 చిత్రకళా విభాగం 5 ఫోటోగ్రాఫీ విభాగం.

## గ్రంథాలయం

ఈ గ్రంథాలయం వైద్య శాస్త్ర చరిత్రకు ప్రయోగశాల. ఈ శాఖను 19 6 లో ఏర్పరచగానే ప్రాథమిక పరిశీలన గ్రంథాలను సంపాదించడానికై విదేశాలలోను, భారత దేశంలోను వున్న వివిధ గ్రంథ ప్రచురణ కర్తలతోను, విక్రేతలతోను ఉత్తర ప్రత్యుత్తరాల నారంభించారు. భారతదేశంలో వైద్య శాస్త్ర చరిత్రలో ప్రాచీన, మధ్య, ఆధునిక కాలాలలోని మత తాత్త్విక సాంఘిక, ఆర్థిక పూర్వపు పరిస్థితులు లేక వైద్యశాస్త్ర ప్రాభవమే గాక భారత దేశంలోను, పరిసరదేశాలలోనూ, అక్కడక్కడ వెదజల్లబడి వున్న ఆయుర్వేద, యునాని, యూరోపియన్ వైద్య శాస్త్రాలకు సంబంధించిన విషయాల, లిఖిత, ముద్రణ పత్రాల పరిశీలన గూడా వుంటుంది.

ఈ గ్రంథాలయానికై కొన్న మూడు వందల ప్రాచీన గ్రంథాలలో నూరు గ్రంథాలు అమూల్యమైనవి. అంతేగాక ఈ వైద్య శాఖ శాస్త్రచరిత్రకు, సైన్సుకు సంబంధించిన అనేక ప్రత్యేక పత్రికలకు చందాలు కడుతున్నది.

పెక్కు గ్రంథాలను, పత్రికలను విదేశాలలోను భారత దేశంలోనూగల ప్రతిఫలాపేక్షలేని సంస్థలనుంచి వ్యక్తులనుంచి ఉచితంగా సేకరించడం జరిగింది.

వైద్య శాస్త్ర చరిత్రకు సంబంధించిన వ్యాసాలు వాటి మైక్రోఫిల్మ రీప్రింటులను పరిశీలనతోపాటు గ్రంథస్తం చేయడానికై సంపాయించడానికి ఈ గ్రంథాలయం ప్రయత్నిస్తున్నది.

వైద్య శాస్త్ర లిఖిత ప్రతులను సంపాదించే యత్నంలో ఈ శాఖ వున్నది. ఇందుకై జిల్లావైద్య శాఖాధికారులకు ప్రభుత్వం ద్వారా సర్క్యులర్లను పంపడం, ప్రజలకు విజ్ఞప్తులు చేయడం జరిగింది. కీ శే. డాక్టర్ ఏ లక్ష్మీపతి ఐదారు తాళపత్ర ప్రతులను బహూకరించారు. విక్రయానికి వచ్చినకొన్ని లిఖిత ప్రతులను కొన

డం కూడా జరిగింది వైద్యశాస్త్ర లిఖితప్రతులు లేనిచోట మైక్రో ఫిల్మ్ కాపీలను సంపాయించడం జరిగింది.

చారిత్రక ప్రాధాన్యం గలకొన్ని ఫిల్ములను, వైద్యశాస్త్ర చరిత్రకు సంబంధించిన మరికొన్ని ఫిల్ములను, వైద్యశాస్త్రంలో నూతన విషయాలను కనుగొనడానికి (Medical Discovries) సంబంధించిన కొన్ని ఫిల్ములు భాగాలను కూడా కొన్నారు.

## మ్యూజియం

చారిత్రక లేక జీవశాస్త్రాల అభివృద్ధికి అన్ని సంస్థలవలె వైద్యశాస్త్ర చరిత్రశాఖకు వైద్యశాస్త్ర ప్రగతిని ప్రదర్శించే వివిధ చిత్రాలు, చిహ్నాలు మొదలైన వాటితో ఒక మ్యూజియం వుండాలి. ఈ విధంగా వైద్యశాస్త్ర ప్రాముఖ్యతను తెలిపే పురాతత్వ చిహ్నాలు, శిల్పాలు, చిత్రాలు భారతదేశంలో ఇటీవలి వరకు చాలా కొద్దిగా వున్నాయి. వీలైన చోటల్లా ప్రాచీన మధ్యయుగాల లోని పురాతత్వ, శాసనాల ఆధారాల మాదిరి ప్రతులను సేకరించడం జరిగింది. ఈజిప్టు, అస్సీరియా, గ్రీస్, రోమ్, పునరుద్ధరణ ఇటలీ (Rerissance Etaly) లలో వలె భారతదేశంలో వైద్య ప్రాముఖ్యంగల శిల్పాలుగాని లేవు. భారతదేశంలో వైద్యశాస్త్రచరిత్రను చిత్రాలలో ప్రతిబింబింపచేయడానికై చిత్రాలను సృష్టించడానికి, పునర్నిర్మించడానికి ప్రయత్నాలు జరిగాయి. వైద్య విజ్ఞానం శతాబ్దాలనుంచి శతాబ్దాలకు, ఒకదేశం నుంచి మరొక దేశానికి, అధ్యాపకులనుంచి అధ్యాపకులకు వ్యాప్తి చెందిన రీతిని ప్రముఖ చికిత్స వేత్తల జీవిత క్రమణికను, వారి పరిశోధనలను, ప్రయోగాలను సూచించే పటాలు, పట్టికలు ఈ మ్యూజియం విశిష్టతను అధికం చేశాయి. ఔషధాల సంస్థలు విదేశీ రాయబార కార్యాలయాలు, ఇతర వైద్య చారిత్రక వస్తు ప్రదర్శనశాలలు అనేక చిత్రాల బహుమతులను పంపుతున్నాయి. ఈమ్యూజియంను మూడు హాలులలో ఏర్పరిచారు. మొదటిదానిలో ప్రపంచ వైద్యశాస్త్ర చరిత్ర, రెండవదానిలో భారతదేశంలో వైద్యశాస్త్ర చరిత్ర, మూడవ దానిలో ఆంధ్రప్రదేశ్‌లో వైద్య శాస్త్రచరిత్ర ప్రతి బింబింప బడివున్నాయి.

## ప్రాచీన పత్రాలు

గత రెండు మూడు శతాబ్దాలలోని వైద్య శాస్త్ర చరిత్ర— ముఖ్యంగా ప్రజారోగ్యం, పారిశుద్ధ్యం, వైద్య సంస్థలు, అంటు వ్యాధులు మొదలైన వాటి విషయాలు—తూర్పు ఇండియా కంపెనీ రికార్డులు, సంస్థానాధీశుల ప్రాచీన రికార్డులు, పూర్వపు జమీందారీ ఆస్థానాధీశ్వరులు, వైద్యులు మొదలైనవారి కుటుంబాలలోగల ప్రాచీన పత్రాల సేకరణద్వారా మాత్రమే పరిశీలించడానికి అవకాశం వున్నందున, ఈ శాఖ అటువంటి ఆధారభూతమైన వాటిని సేకరిస్తున్నది. ఇందుకు జాతీయ రికార్డులు, మద్రాసు రికార్డు ఆఫీసు, హైదరాబాదులోని కేంద్ర రికార్డుల కార్యాలయాల సహకారాన్ని అభ్యర్థించడం జరిగింది.

## చిత్రకళా విభాగం

హైదరాబాదులోని లలిత కళల కళాశాలలో (College of Fine Arts) డిప్లమా పుచ్చుకున్న ఒక చిత్రకారుడిని ఇందులో నియమించారు. అతనికి ఒక అభిప్రాయం ఏర్పడడానికి మాదిరులకై సహాయపడటానికై ముందు యూరోపియన్ వైద్య శాస్త్రానికి సంబంధించిన శిల్పాలు, చిత్రాలు, ఫోటోలు ప్రాచీన భారత దేశపు శిల్పాలు, చిత్రాలు చూపబడినవి. అతను ప్రథమంగా కొన్ని మాదిరులను ప్లాస్టర్‌లో తయారు చేసి చరక, శుశ్రుతుల సూత్రాల నాధారంగా అసలు చిత్రాలను తయారు చేయ నారంభించాడు. అతను అధ్యాపకుల సూచనల క్రింద వైద్య శాస్త్ర చరిత్ర బోధన కుపయోగించే కొన్ని పటాలను, పట్టికలను తయారు చేశాడు. ఇందులో కొన్ని వర్ణ చిత్రాలు, మ్యాపులు, బొమ్మలు హైదరాబాద్ ఢిల్లీలలో ప్రదర్శింపబడినవి. అంతేగా రెండు వర్ణ చిత్రాలు వైద్య శాస్త్ర పత్రికల ముఖ చిత్రాలుగాక ప్రచురితమైనాయి.

## ఫొటోగ్రఫీ శాఖ

విషయపరిశీలనకు, పరిశోధనలకై గ్రంథాలయానికి వివిధ కేంద్రాలలో గల లిఖిత ప్రతుల మైక్రో ఫిల్ములు అవసరం. లిఖిత ప్రతుల ముఖపత్రం ఫొటోగ్రాఫ్‌లు, ప్రాచీన చికిత్సాలయాలు, వైద్యులు, ఇతర పత్రాల ఫోటోలు మ్యూజియంకు అవసరం. ఉపన్యాసాలను గాజు పలకాల (స్లైడ్‌లు) పట్టికలతో సచిత్రంగా ఇవ్వాల్సి వుంటుంది. ఇదంతా ఫొటోగ్రఫీ విభాగం లేనిదే జరుగదు. ఈ ఫొటోగ్రఫీ శాఖకు తగిన సామగ్రి, నిపుణులైన ఉద్యోగులు, ముఖ్యంగా ప్రాచీన లిఖిత ప్రతులను, తాళపత్ర ప్రతులకు మైక్రో ఫిల్మ్ తీసే వారు కావాలి. ఈ శాఖ వైద్య చారిత్రక కట్టడాలను కూడా ఫిల్ములుగా తీయ నారంభించింది.

## బోధనా కార్యక్రమం

ఉస్మానియా విశ్వ విద్యాలయానికి అనుబంధంగా వున్న వైద్య కళాశాలల విద్యార్థులకు వైద్య శాస్త్ర చరిత్రలో 12 ఉపన్యా

పాల నిప్పించడానికి విశ్వ విద్యాలయం ఆమోదించింది. ఈ ఉపన్యాసాలను ఉస్మానియా వైద్య కళాశాలలో గత నాలుగేళ్ళ లోను, గాంధి మెడికల్ కాలేజీలో 1960-61 లోను ఇవ్వడం జరిగింది. ఈ శాఖ ప్రొఫెసర్ రాష్ట్రంలోని వివిధ వైద్య కళాశాలలను సందర్శించి ఆ విద్యార్థులకు వైద్య శాస్త్ర చరిత్ర ఉపన్యాసాల నివ్వాలని వైద్య శాఖ డైరెక్టరు సూచించారు దీని ఫలితంగా ఈ శాఖ ప్రొఫెసర్ విశాఖపట్నంలోని ఆంధ్ర మెడికల్ కాలేజీని సందర్శించి వివిధ తరగతుల విద్యార్థులకు సంగ్రహ ఉపన్యాసాలను, హౌస్ ఫిజిషియన్లకు, విద్యార్థులకు వైద్య నీతి శాస్త్రం పై (Medical Ethics) ప్రత్యేక ఉపన్యాసాలను ఇచ్చారు.

అంతేగాక, పోస్ట్-గ్రాడ్యుయేట్ విద్యార్థులకు అంతర్ వైద్యం, శస్త్ర చికిత్స, ప్రసవ విషయ శాస్త్రం (Obstetrics), నేత్ర చికిత్స (Ophthalmology) మొదలైన విషయాల చారిత్రాకాభివృద్ధికి సంబంధించిన ప్రత్యేక ఉపన్యాసాల కార్యక్రమం కూడా వుంది. దీనికి తోడు యం.డి., యం.యస్., యం.యస్‌సి. మొదలైన డిగ్రీలను పొందే విద్యార్థులకు వారి వ్యాసాలకు, గ్రంథాలకు అవసరమైన చారిత్రక సమీక్షను తయారు చేయడం, తగిన సౌకర్యాలు కలిగించడం కూడా ఇందులో వుంది.

వైద్య శాస్త్ర చరిత్రను ప్రత్యేక విషయంగా పోస్ట్-గ్రాడ్యుయేట్ డిప్లమో పరీక్షకు సంబంధించిన పాఠ్య భాగాలను, నియమ నిబంధనలను ఇటీవల ఉస్మానియా విశ్వ విద్యాలయం ఆమోదించింది. ఈ డిప్లమో కోర్సు కాలం ఒక సంవత్సరం పాటు వుంటుంది.

## పరిశోధన

భారత దేశ చరిత్రలో వివిధ యుగాలలో విస్తరించి వున్న వైద్య శాస్త్ర విషయాలకు సంబంధించిన సమగ్ర స్వరూపానికి సంబంధించిన వివిధాధారాల సేకరణ, ఆయుర్వేద, యూనాని, ఆధునిక భారతీయ వైద్య చరిత్రలలో జరిగిన పనిని గురించి సర్వే చేసే పరిశోధనకై వివిధ దశల పథకాన్ని ఈ శాఖ సిద్ధం చేసింది. ఆంధ్ర ప్రదేశ్‌లో వైద్యాభివృద్ధి, ఇతర ఆసియా దేశాల వైద్య శాస్త్రంపై భారతీయ వైద్య శాస్త్ర ప్రభావం అన్న విషయాలను గురించి తీవ్ర పరిశీలనలు జరుగుతున్నాయి. ఈ శాఖ ప్రచురించిన వివిధ పత్రాలు, అనువాదం చేసిన విషయాల జాబితాలు ఈ శాఖ యొక్క అధికార నివేదికలో చేర్చబడినాయి. భారత విజ్ఞాన శాస్త్ర జాతీయ సంస్థ (నేషనల్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ సైన్సెస్ ఆఫ్ ఇండియా) కలకత్తాలో ఏర్పాటు చేసిన విజ్ఞాన శాస్త్ర చరిత్ర గోష్ఠి (Seminor on History of Seiences) లో ఈ శాఖకు చెందిన నలుగురు అధ్యాపకులు పాల్గొని ఈ శాఖలో పరిశోధనకు సంబంధించిన విషయాలపై నాలుగు వ్యాసాలను సమర్పించారు.

## వివరణ గ్రంథాల పట్టిక జాబితా

పూనాలో గల హిందుస్థాన్ యాంటిబయోటిక్స్ సంస్థకు చెందిన గ్రంథాలయాధికారి శ్రీ ఎ పీలమేఘన్ సహకారంతో ఈ శాఖ భారతీయ వైద్య శాస్త్ర చరిత్రలో ప్రస్తుత కార్యక్రమానికి సంబంధించిన వివరణ గ్రంథాల జాబితాకు వార్షికంగా కూరుస్తున్నది. ఈవిధమైన గ్రంథాలు 1954 నుంచి 1958 వరకు ఇంత వరకు ప్రచురింపబడినవి ఈ శాఖ గ్రంథాలయాధికారి, శ్రీ ఎ. సీలమేఘన్ సహాయ సహకారాలతో 1959, 1960 సంవత్సరాలకు ఇట్టి గ్రంథాల జాబితాను కూర్చు చేశారు. అవి ది ఇండియన్ జర్నల్ ఆఫ్ ది హిస్టరీ ఆఫ్ మెడిసన్" లో ప్రచురింపబడినవి. ఈ విధమైన కార్యక్రమాన్ని ఇంకా విస్తృతం చేసి ముమ్ముందు ఇంకా సమగ్రమైన ఇట్టి గ్రంథాలను వెలువరించనున్నారు.

వైద్య శాస్త్ర చరిత్రకు సంబంధించిన వ్యాస పరంపరలను, ప్రకటన పత్రిక (Buletin) ను ఈ శాఖ ప్రచురించ నిర్ణయించింది.

## యాత్రికులు

గత మూడేళ్ళలో విదేశాల నుంచి భారతదేశంలోని పలు ప్రాంతాల నుంచి అనేక మంత్రి యాత్రికులు ఈశాఖను సందర్శించి, దీని ఆశయాభివృద్ధుల పట్ల ఉత్సుకత చూపారు. ఈశాఖను సందర్శించిన ప్రముఖ బృందాలలో భారత ప్రభుత్వ హెల్త్ సర్వే అభివృద్ధి సంఘం ఒకటి.

విదేశీ పండితులు, శాస్త్రవేత్తలలో ప్రొఫెసర్ వుల్ఫ్‌ను ఈ శాఖ ఆహ్వానించింది. జియోగ్ శార్టన్‌చే స్థాపించబడిన "ఐసిస్" (ISIS) అనే ప్రముఖ అంతర్జాతీయ పత్రికకు ఈయన సంపాదకుడు.

## సాంఘిక, సాంస్కృతిక విద్య

వైద్య కళాశాలలోని ఈ శాఖ ముఖ్యంగా వైద్య కళాశాలల విద్యార్థులకు, అధ్యాపకులకు భారతీయ వైద్య శాస్త్ర చరిత్ర విజ్ఞాన వేదిక అయినప్పటికీ శాస్త్ర విజ్ఞానం, వైద్యాలలోని సాంఘిక బాధ్యతలను ముఖ్యంగా నాగరికత, వైద్య శాస్త్రాల అంతర్ సంబంధాలను ఈ శాఖ ఎప్పుడూ గుర్తిస్తుంది. వైద్యరంగం నాగరికత స్థితిగతులను ప్రభావితం చేస్తుందని, దానిమీదే వైద్య శాస్త్ర పురోగతి ఆధారపడివున్నదని చాటి చెప్పిన ప్రొఫెసర్ సిజెరిస్ట్ మాటలను వైద్య ప్రపంచం, వైజ్ఞానిక ప్రపంచం కూడా ఆమోదించింది. ఈ శాఖ విశ్వవిద్యాలయాలు, వృత్తి విషయక సంఘాలు (Professional Associations) పండిత పరిషత్‌లు, ఇతర సంస్థలు పంపే ఆహ్వానాలను సద్వినియోగం చేసుకొని పరిపాలకులకు, ఆర్థిక విషయక పరిశోధకులకు సంఘ సేవకులకు, భావిభాగ్యోదయానికై ప్రజాభిప్రాయాన్ని తీర్చిదిద్ది, ప్రణాళికలను రూపొందించే విద్యావంతులందరికీ వైద్య శాస్త్ర చరిత్ర విశిష్టతను ఉపన్యాసాలు, పత్రికలలో వ్యాసాల ద్వారా తెలపడం జరుగుతున్నది.

---

## వింతలు - విచిత్రాలు

# అపూర్వమైన మర్రి చెట్టు

### శ్రీ పి. వి. ఎల్. నరసింహారావు

అనంతపురం జిల్లాలో కదిరికి 20 కిలో మీటర్ల దూరంలో ధర్మవరం—పాకాల రైల్వేలైన్‌లో గూటి—బేలు అనేకు గ్రామం ఉంది.

యిక్కడ "తిమ్మమ్మ మర్రిమాను" అని పిలువబడే ఒక పెద్ద మర్రివృక్షం ఉంది. దీనిని గురించి ఒకకథ చెప్తారు.

గూటి—బేలు గ్రామంలో 1394వ సం॥లో మంగమ్మ, వెంకటప్ప దంపతులకు తిమ్మమ్మ జన్మించింది. దురదృష్టవశాత్తు తిమ్మమ్మభర్త, వివాహమైన కొద్దికాలానికే కుష్ఠువ్యాధితో మరణించాడు తల్లిదండ్రులు, గ్రామస్థులు యెంత నివారించినా వినకుండా, సనాతన ధర్మాలను పాటించే తిమ్మమ్మ తన 'సహగమనాని'కి 4 యెండు మర్రిమొద్దులతో తయారుచేసిన చితిమంటలలో ప్రవేశించి అగ్నికి ఆహుతి అవుతుంది. కాని విచిత్రమేమంటే చితికై పేర్చిన నాలుగు మొద్దులలో మూడు కాలి బూడిద అయినవే గాని, మిగిలిన ఒకటిమాత్రం కాలకుండానే మిగిలిపోయింది. అదేకొద్ది రోజులలో చిగురించి నేటికది పెద్దపెద్ద వూడలు గల మర్రిగా యెదిగింది. అయితే దీని మొదటి శాఖమాత్రం తర్వాత అగ్నిప్రమాదంలో కాలిపోయింది. విస్తరించి ఉన్న యీమర్రి చాయలలో తిమ్మమ్మ జ్ఞాపకార్థం చిన్న గుడిని కట్టించారు. సమీప గ్రామాల ప్రజలు అప్పుడప్పుడు యీ గుడిని దర్శిస్తారు. యాత్రికులను ఆకర్షించే మర్రిచెట్లు మనదేశంలో చాలా కొద్దిగా ఉన్నాయి. అందులో మద్రాసు (అడయారు), కలకత్తాలలో వరుసగా 40,80 వేల చదరపు అడుగుల విస్తీర్ణాన్ని ఆక్రమించి ఉన్న మర్రిచెట్లు ముఖ్యమైనవి. 'తిమ్మమ్మ మర్రిమాను' దాదాపు లక్ష చదరపు అడుగుల ప్రాంతం విస్తరించి ఉందని చెపుతారు.

రాష్ట్రంలోని కొన మూల ప్రాంతంలో ఉన్న కారణాన బయటి ప్రపంచానికి దీనిని గూర్చి చాలా తక్కువగా తెలియటంలో ఆశ్చర్యమేమీ లేదు. మంత్రముగ్ధులను గావించి కలను పండువచేసే చక్కని యీ "తిమ్మమ్మ మర్రిమాను" ప్రాంతాన్ని అభివృద్ధి పరుస్తే ఆంధ్రప్రదేశ్‌లో యిది చక్కని విశ్రాంతి కేంద్రంగా రూపొందుతుంది. రాకపోకలు యితర సౌకర్యాలు లేని కారణాన యీ ప్రాంతాన్ని దర్శించకోరే కొద్దిమందికూడా వెనుకడుగువేస్తారు రాకపోకలు, భోజన వసతి, యితర సౌకర్యాలను కలిగించి తగిన ప్రచారం చేస్తే కొద్ది కాలంలోనే యాత్రా కేంద్రాల పటంలో గూటి—బేలు కూడా స్థానం సంపాదిస్తుంది.

# కమ్యూనిటీ రేడియో సెట్లు

1962 మే నెలలో కమ్యూనిటీ రేడియో సెట్లు స్థాపించబడిన గ్రామాలు, సంస్థల వివరాలు

దిగువ పొందుపరుపబడినవి

| వరుస సంఖ్య | జిల్లా పేరు | తాలూకా పేరు | గ్రామం లేక సంస్థ పేరు | రేడియో సెట్టు నెలకొల్పబడిన తేదీ |
|---|---|---|---|---|
| 1. | మెదక్ | సంగారెడ్డి | ఎద్దుపరం | 4-4-62 |
| 2. | ,, | ,, | వెల్టూరు | 3-4-62 |
| 3. | ,, | ,, | మేలసంగం | 4-4-62 |
| 4. | ,, | ,, | లోనికలన్ | 4-4-62 |
| 5. | ,, | నర్సాపూర్ | కొత్తపల్లి | 26-4-62 |
| 6. | ,, | ,, | కొడకంచి | 25-4-62 |
| 7. | ,, | ,, | సిర్పూర | 24-4-62 |
| 8. | ,, | మెదక్ | వరిగంటన్ | 9-4-62 |
| 9. | ,, | ,, | తొగిట | ,, |
| 10. | ,, | ,, | పైత్ర | ,, |
| 11. | ,, | ,, | కుకునూరు | 10-4-62 |
| 12. | ,, | సిద్దిపాద్ | తోర్నాల్ | 1-4-62 |
| 13. | ,, | గజ్వేల్ | ములిగడప | 1-4-62 |
| 14. | ,, | ,, | బేగంపేట | ,, |
| 15. | ,, | నారాయణఖేడ్ | మసానిపల్లి | 18-4-62 |
| 16. | ,, | ,, | సిర్గాపూర్ | 20 4-62 |
| 17. | ,, | ,, | బదల్గామ్ | 18-4-62 |
| 18. | ,, | జహీరాబాదు | ఖానాపూర్ | 5-4-62 |
| 19. | ,, | రామాయంపేట | ఉల్లితిమ్మయపల్లి | 30-4-62 |
| 20. | ,, | ,, | తన్సిగ్లింగపూర్ | 29-4-62 |
| 21 | నిజామాబాదు | నిజామాబాదు | ఆంధ్రనగర్ | 3-4-62 |
| 22. | ,, | ,, | ఖావల్పూరు | 4-4-62 |
| 23. | ,, | మద్నూరు | మిషన్ కల్లాయ్ (రాజోలుపిటి) | 18-4-62 |
| 24. | ,, | ,, | కొడబ్‌గల్ | 19-4-62 |
| 25. | ,, | బన్సవాద | కకుషేట్‌పల్లి (నందిపేట) | 21-4-62 |
| 26. | ,, | ,, | నందిపల్లి | 22-4-62 |
| 27. | ,, | ,, | బిర్కూరు | 23-4-62 |
| 28. | ,, | ,, | రాంపూరు | 24-4-62 |
| 29 | ,, | ఆర్మూరు | ఇబ్రహీంపేట శివారు దత్తాపురం షాపూరుపట్నం శివారు | 25-4-62 |
| 30. | కరీంనగరం | కరీంనగరం | నాగ్నూరు | 4-4-62 |
| 31. | ,, | ,, | జెడ్ పి హెచ్. పాఠశాల నాగ్నూరు | ,, |
| 32. | ,, | ,, | బోర్నపల్లి | 9-4-62 |
| 33. | ఆదిలాబాదు | ఆదిలాబాదు | సవర్‌గాం | ,, |
| 34. | ,, | ,, | అంధేర్భంద్ | ,, |
| 35. | ,, | ,, | ఘోత్కూరి | ,, |
| 36. | ,, | ,, | జైనాదపురం | 10-4-62 |

| వరుస సంఖ్య | జిల్లా పేరు | తాలూకా పేరు | గ్రామం లేక సంస్థ పేరు | రేడియో సెట్టు నెలకొల్పబడిన తేదీ |
|---|---|---|---|---|
| 37. | ఆదిలాబాదు | ఆదిలాబాదు | అర్లి "కె" | 10_4_62 |
| 38. | .. | .. | రొయ్యాదీ | 10_4_62 |
| 39. | .. | .. | ముత్తనూర్ | 16_4_62 |
| 40. | .. | .. | చందా | 27_4_62 |
| 41. | కడప | సిద్దొట్ | గంగపేరూరు | 10_4_62 |
| 42. | .. | ప్రొద్దుటూరు | ఊచుపాష | 11_4_62 |
| 43. | నెల్లూరు | నెల్లూరు | తోటపల్లి, మాచెర్లవారి పాలెంవద్ద నెలకొల్పబడినది | 19_4_62 |
| 44. | ... | .. | కంపూరుబిట్ 1 | 22_4_62 |
| 45. | .. | కోవూరు | పెదపుత్తేడు | 19_4_62 |
| 46. | .. | ఆత్మకూరు | తాడిపత్రి | 22_4_62 |
| 47. | .. | నెల్లూరు | కంపూరుబిట్ 2 | .. |
| 48. | .. | కావలి | అన్నవరం | 29_4_62 |
| 49. | .. | .. | జమ్మలపాలెం | 30_4_62 |
| 50. | .. | .. | కొత్తపల్లి | 30_4_62 |
| 51. | అనంతపురం | అనంతపురం | రాచపల్లి | 13_4_62 |
| 52. | .. | కల్యాణదుర్గం | షెత్తూరు | 18_4_62 |
| 53. | .. | .. | బస్తరపల్లి | .. |
| 54. | .. | .. | నక్కపల్లి | 19_4_62 |
| 55. | .. | .. | బెలుగుప్ప | .. |
| 56. | .. | .. | గంగవరం | 20_4_62 |
| 57. | .. | కదిరి | పెద్దవడుగూరు | .. |
| 58. | మహబూబు నగరం | అచ్చంపేట | ఇప్పలపల్లి | 26_4_62 |
| 59. | .. | షాద్‌నగర్ | షాద్‌నగర్ మునిసిపాలిటీ | .. |
| 60 | నల్గొండ | | దిరిసెంచెర్ల | 11_4_62 |
| 61. | ,, | | రామాపురం | 18_4_62 |
| 62. | ,, | | నడిగూడెం | 19.4_62 |
| 63. | ,, | | బేబిగూడెం | 21_4_62 |
| 64. | ,, | | పంగపల్లి | 26_4_62 |
| 65. | విశాఖపట్నం | అనకాపల్లి | వెదురుపర్తి | 18_4_62 |
| 66. | తూర్పుగోదావరి | కొత్తపేట | పాములవాక | 14_4_62 |
| 67. | .. | .. | ర్యాలి | ,, |
| 68. | ,, | రాజోలు | మట్టపర్రు | ,, |
| 69. | ,, | ,, | మండపులంక | 16_4_62 |
| 70. | ,, | ,, | ఎల్, గన్నవరం | ,, |
| 71. | ,, | ,, | విశ్వేరశ్వపురం | 20_4_62 |
| 72. | ,, | ,, | ఈదసుమండ | 18_4_62 |
| 73. | ,, | అమలాపురం | తొట్టరమూడి | 21_4_62 |
| 74. | ,, | ,, | విలాసవిల్లి | ,, |
| 75. | ,, | ,, | గంటుమిల్లి | 22_4_62 |
| 76. | ,, | ,, | వీరవిల్లిపాలెం | ,, |
| 77. | ,, | ,, | కందికుప్ప | 20_4_62 |
| 78. | ,, | కాకినాడ | చేదువాడ | 27_4_62 |
| 79. | ,, | కొత్తపేట | ఏనుగుపల్లి | 24_4_62 |
| 80. | ,, | ఎర్రవరం | నెల్లిపూడి | 28_4_62 |
| 81. | పశ్చిమగోదావరి | ఏలూరు | చాటపర్రు 4 | 4_4_62 |
| 82. | ,, | చింతలపూడి | కె, గోపవరం2 | 1_4_62 |



# విశేషాలు

## సింథటిక్ ఔషధాల ఫ్యాక్టరీ

హైద్రాబాదు సమీపంలోని సనత్‌నగర్‌లో సింథటిక్ ఔషధాల ఫ్యాక్టరీ నిర్మాణానికి సంబంధించిన ఒప్పందం పత్రంపై న్యూఢిల్లీలో జూన్ 13 వ తేదీన భారత ఔషధ, ఫార్మా సూటికల్ సంస్థ (భారత ప్రభుత్వ అధ్వర్యాన) రష్యా సాంకేతిక నిపుణులు సంతకాలు చేశారు.

మూడవ ప్రణాళిక ఆఖరులో యీ ఫ్యాక్టరీలో ఉత్పత్తి ప్రారంభమవుతుంది. సల్ఫా గ్రూపులు, విటమినులకు సంబంధించిన ఔషధాలు యిందులో తయారు చేస్తారు. ఇది సంవత్సరానికి 850 టన్నుల ఉత్పాదక శక్తిని కలిగి ఉంటుంది. ఫ్యాక్టరీ పరికరాలు, సాంకేతిక సహాయాన్ని రష్యా అందజేస్తుంది. దీనిలో 2200 మందికి ఉపాధి లభిస్తుంది. ఫ్యాక్టరీ నిర్మాణానికి, పట్టడానికి రూ. 18.00 కోట్లు ఖర్చు అవుతుందని అంచనా.

## అణు విద్యుత్కేంద్రం

దక్షిణాదిలో ఒక అణు విద్యుత్కేంద్రాన్ని స్థాపించడానికి అనువైన స్థలాన్ని పరిశీలించే నిమిత్తం వచ్చిన ముగ్గురు సభ్యులు గల కమిటీ, మహబూబునగరం జిల్లా కొల్లాపురం తాలూకాలోని సోమశిలను దర్శించి, అక్కడి అధికారులతో చర్చలు జరిపి జూన్ 10 వ తేదీన తిరిగి హైద్రాబాద్ నుంచి వెళ్లింది. అక్కడి స్థలం కమిటీ సభ్యులకు నచ్చినట్లు భావించబడుతున్నది

శ్రీశైలం పర్వతాలకు యెదురుగా ఈ స్థలం ఉంది. ఈ స్థలం పరిసర ప్రాంతాల్లో 3 మైళ్ళ వరకు యెక్కడా గ్రామాలు లేవు. 10 మైళ్ళ లోపు ప్రాంతంలో చెదురుగా జననివాసం ఉంది.

## మరాఠీ శ్రోతలకు తెలుగు సాహిత్యం

ప్రస్తుత మూడు మాసాల కాలంలో మరాఠీ శ్రోతలకు తెలుగు సాహిత్యాన్ని పరిచయం చేయడానికి వీలుగా ఆల్ ఇండియా రేడియో పూనా స్టేషన్‌నుండి ప్రస్తుత మూడు మాసాల కాలంలో సోదాహరణ ప్రసంగాలను వరుసగా ప్రసారం చేస్తున్నారు. కథానికలు, నవలలు, కవిత్వం నాటకాలకు సంబంధించి 20 వ శతాబ్దంలోని ప్రముఖ రచయితల గూర్చి కూడా ప్రసంగాల యేర్పాటు చేస్తారని, 1962 జూన్ 12 వ తేదీన పూనాలో జరిగిన సలహా సంఘం సమావేశంలో వెల్లడించారు.

## సహకార పారిశ్రామిక వాటిక

ఆసియాలో మొదటిదయిన సహకార పారిశ్రామిక వాటికను రూ 40 నుండి 50 లక్షల పెట్టుబడి ధనంతో హైద్రాబాదులోని సనత్‌నగర్‌లో నెలకొల్పనున్నారు. సహకార సంఘాలు కార్పొరేటు సంస్థలు, వ్యక్తులు కూడా యిందులో పాల్గొనడానికి అవకాశం ఉంటుంది.

ప్రస్తుతం ఉన్న పరిశ్రమలకు పోటీగా కాకుండ సహాయం ఉండే విధంగా యిక్కడ వివిధ రకాలైన 20 యూనిట్లను నెల కొల్పుతారు.

30 యెకరాల విస్తీర్ణంలో యీ వాటికను నిర్మిస్తారు. వేర్వేరు యూనిట్లకు కావలసిన యంత్ర సామగ్రిని సహకార సంఘం కొనుగోలు చేస్తుంది.

## ఉత్తరప్రదేశ్‌లో తెలుగు భాష బోధన

దక్షిణ భాషలను బోధించాలనే ఉత్తరప్రదేశ్ ప్రభుత్వ నిర్ణయం ప్రకారం, 1962 జూలై నుండి ఆ రాష్ట్రంలోని 10 కేంద్రాలలో తెలుగు భాషను బోధిస్తారు. తెలుగుతోపాటు తమిళం, కన్నడ భాషలను కూడా యీ కేంద్రాలలో నేర్పుతారు. అగ్రా, మీరట్, అలీఘర్, కాన్పూరు, వారణాసి, లక్నో, అలహాబాదు గోరక్‌పూర్, బారేలి, ఝాన్సీలలో యీ కేంద్రాలు ఉన్నాయి.

యీ తరగతులలో ప్రవేశం లభించిన విద్యార్థులకు, ప్రభుత్వ ఖర్చుపై, పాఠ్య పుస్తకాలను యితర పరికరాలను యిస్తారు

యీ విద్యాబోధన కాల పరిమితి రెండు సంవత్సరాలు

విద్యార్థులకు నెలకు రూ 10 ల చొప్పున స్టయిఫండును కూడా ప్రభుత్వం యిస్తుంది. అంతేగాక మొదటి సంవత్సరం పరీక్ష ఆఖరులో రూ 100/- లు, రెండవ సంవత్సరం పరీక్ష ఆఖరులో రూ 150/- లను బహుమతిగా యిస్తారు. పరీక్షలో ఉత్తీర్ణులైన వారి సర్టిఫికేటు ప్రతిని ప్రభుత్వోద్యోగుల నడవడిక రిజిస్టరులో చేరుస్తారు.

# పారిశ్రామిక విశేషాలు

[రాష్ట్ర పారిశ్రామిక రంగంలో అనుదినం అభివృద్ధి పథకాలు ప్రవేశపెట్టబడుతున్నాయి. పారిశ్రామిక వేత్తలు ప్రజలు వాటిని గురించి తెలుసుకొనటం అవసరం అనే దృష్టితో ముఖ్య పారిశ్రామిక విశేషాలు యీ శీర్షక క్రింద యివ్వబడుతున్నవి.]

### కేంద్ర పథకాలు

## అణువిద్యుత్కేంద్రం స్థలం

రాష్ట్రంలో అణు విద్యుత్కేంద్రం స్థాపనకు కొన్ని స్థలాలను నిర్ణయించడానికి భారత ప్రభుత్వం నియమించబడిన స్థల నిర్ణయ సంఘం ఈ రాష్ట్రంలో పర్యటించి ప్రభుత్వం సూచించిన కొన్ని స్థలాలను పరిశీలించింది. ఈ స్థలాలను ఇంకా పరిశీలించడానికై ఈ సంఘం సభ్యులు త్వరలోనే మరొకసారి ఈ రాష్ట్రానికి రావచ్చు.

## ప్రైవేటు రంగం

పాలపొడి ఆహారాన్ని (బిర్లోన్) సంవత్సరానికి 144 టన్నుల చొప్పున తయారు చేయడానికి విజయవాడలోని ఒక ప్రైవేట్ సంస్థకు భారత ప్రభుత్వం లైసెన్సు ఇచ్చింది.

ఈ క్రింది వస్తువులను తయారుచేయడానికి కూడా భారత ప్రభుత్వం లైసెన్సులను ఇచ్చింది.

(1) హైదరాబాద్ వద్ద, కోత గ్రిండింగ్ మెషిన్లను, పనిముట్లను, మిల్లింగ్ మెషిన్లను వరుసగా నెలకు 200, 240 టన్నుల చొప్పున తయారుచేసే పరిశ్రమ.

(2) కోల్డ్‌రోల్డ్ పెట్టెల విభాగాలను నెలకు .240 టన్నుల చొప్పున తయారుచేయడానికి విశాఖపట్నంవద్ద స్థాపించనున్న పరిశ్రమ

(3) ప్రేలుడు ప్యూజులను సంవత్సరానికి 20 మిలియన్ టన్నుల చొప్పున తయారు చేసే సంస్థకు.

## జెకోస్లొవేకియా సాంకేతిక నిపుణులబృందం పర్యటన

జెకోస్లొవేకియా సాంకేతిక నిపుణుల బృందం ఒకటి హైదరాబాద్ సందర్శించి రాష్ట్ర ప్రభుత్వ అధికారులతోను, ప్రైవేటు పారిశ్రామిక వేత్తలతోను సంప్రదింపులు జరిపింది. జెకోస్లొవేకియా సాంకేతిక సహాయ సహకారులతో అభివృద్ధి కాగల కొన్ని పరిశ్రమలను వారు సూచించారు.

## బొగ్గు పరిశ్రమ

సింగరేణి గనులలో (ప్రభుత్వ సంస్థ) బొగ్గు ఉత్పత్తి పురోభివృద్ధిలో వున్నది 1962 ఏప్రిల్ నాటికి ఉత్పత్తి 9,44,627 టన్నులు, అంతకు ముందు సంవత్సరం ఇదే సమయానికి 8,57,187 టన్నులు మాత్రమే ఉత్పత్తి అయింది.

ఆదిలాబాద్ జిల్లా రామకృష్ణపూర్‌లో రెండు కొత్త గనులను ప్రారంభించారు. ఇవికూడా సింగరేణి బొగ్గుగనులకు చెందినవే. ఈ రెండు గనులుకూడా పూర్తి ఉత్పత్తిని ప్రారంభించగానే వార్షికంగా రెండు లక్షల టన్నుల బొగ్గుఉత్పత్తి అవుతుందని భావిస్తున్నారు. ఈ ప్రాంతంలో 12 గనులు వుండాలని ప్రణాళికా రూపొందించగా ఇంతవరకు నాలిగింటిని ప్రారంభించారు. ఈ ప్రాంతంలో ఎనిమిది బొగ్గుగనులకై కృషి జరుగుతోంది. ఈ ప్రాంతం అంతా పూర్తిగా అభివృద్ధి చెందినపుడు సంవత్సరానికి ఒక మిలియను టన్నుల బొగ్గు ఉత్పత్తి అవుతుంది.

రామగుండం బొగ్గుగనుల వద్దగల ఆరుమైళ్ళ రోడ్డుకు సంబంధించిన పని అప్పుడే ప్రారంభమైంది. నూజి వీడు ప్రాంతంలో బొగ్గు గనులను కనుగొనే కృషి త్వరితంగా సాగుతోంది.

ఆంధ్రప్రదేశ్ బొగ్గుగనుల ఉపసంఘం కొత్తగూడెంలో 28-4-1926 న సమావేశమై, గని కార్మికులు తిరుపతి ఎగువ కొండలమీద శలవులు గడపడానికి వీలుగా ఒక గృహాన్ని నిర్మించాలని తీర్మానించింది. దీనిని బొగ్గుగనుల సంక్షేమ సంస్థ నిర్వహిస్తుంది. ఈ పథకం వల్ల ప్రతియేటా 500 మంది కార్మికులకు సౌకర్యం లభిస్తుందని భావిస్తున్నారు. ఈ విషయంలో భారత ప్రభుత్వం కేటాయింపుకు ఎదురు చూస్తున్నారు.

### చక్కెర పరిశ్రమ

ఆముదాల వలస చక్కెరఫ్యాక్టరీ 1962 మార్చిలో ఉత్పత్తిని ప్రారంభించింది. రోజుకు పదివేల టన్నుల ఉత్పాదన శక్తిగల ఈ ఫ్యాక్టరీని దాదాపు 150 లక్షల రూపాయల పెట్టుబడితో నెలకొల్పారు.

ప్రభుత్వంచే ఏర్పాటు చేయబడిన సహకార చక్కెర ఫ్యాక్టరీల కమిటీ నాల్గవ సమావేశం 19-4-62 తేదీన జరిగింది. ఈ రాష్ట్రంలో సహకార చక్కెర ఫ్యాక్టరీల సమాఖ్య అనే ఒక సంస్థను ఏర్పాటు చేయాలని ఈ సమావేశంలో ప్రతిపాదించారు. ఈ విషయంలో సహకార సంఘాల రిజిస్ట్రారు తగిన చర్యలను తీసుకుంటున్నారు.

బోధన్‌లో గల నిజాంచక్కెర ఫ్యాక్టరీ గత ఏప్రిల్ నెలలో 86 638 మిలియను టన్నుల చక్కెరగడలను ఆడింది. అధికారులు మామూలు రోజువారీ జీతం కార్మికులకు బోనస్‌ను ఇచ్చారు. ఈ ఫ్యాక్టరీ కాలనీలో రెండుగదుల గృహాల నిర్మాణం త్వరిత గతిని సాగుతోంది.

ప్రణాళికలు, పంచాయతీరాజ్య శాఖల మంత్రి డాక్టర్ యం. చెన్నారెడ్డి 1962 ఏప్రిల్ 4వ తేదీన ఈ ఫ్యాక్టరీని సందర్శించారు.

### హైదరాబాద్ ఆల్విన్ మెటల్‌వర్క్సులో ప్రభుత్వంచే వాటాల కొనుగోలు

హైదరాబాద్ ఆల్విన్ మెటల్ వర్క్సులో షేరు ఒకటికి పది రూపాయల విలువగల 4,24,585 వాటాలను రూ. 42,45,850 ల ఖరీదుతో ప్రభుత్వం 21-5-1962 తేదీన కొన్నది. షేరు 1కి పది రూపాయల విలువగలిగి వుండి విడుదల చేయబడని 8.60.656 షేర్లలో పై షేర్లను ప్రభుత్వం కొన్నది. ఈ కంపెనీ కార్యకలాపాల విస్తృత పథకాన్ని అమలు జరపడానికి ఈ కొనుగోలు సహాయభూతమవుతుంది.



నరులకంటె ఎక్కువ బలమేదో దర్పాలు చూపి తరుగిరుల్తో వారధి కట్టింది ఒకనాటి వానర బృందం
నరుల దృష్టిలో పురుగులుగా తరుగిరుల్లో తక్కుతూ తారుతూ బ్రతుకు యీడుస్తున్నది యీనాటి వానర బృందం...



19-5-62 న ఉస్మానియా విశ్వ విద్యాలయ ఆవరణలో ఎన్. సి. సి కేడెట్ల-బాలికల-సంఘసేవ.



చిత్తూరుజిల్లా హార్స్లే కొండలమీద పోలీసుల నిమిత్తం కొత్తగా నిర్మించిన గృహాలు

అరకు లోయలో ఉన్న కేంద్రాలలో ఒక దానిలో పెంచబడుతున్న పట్టుపురుగులు



గుత్తి బయలులోని మహా వటవృక్షం.



7–6–62 న హైదరాబాదులో జరిగిన ఆంధ్రప్రదేశ్ తొలి కుటుంబ నియంత్రణ సమావేశానికి హాజరైన ప్రేక్షక సమూహం



ఉ. రా. బీ. ఆస్పత్రి: హైదరాబాదులోని ఎర్రగడ్డలో 150 పడకలు గల ఉద్యోగుల రాష్ట్రబీమా ఆస్పత్రికి 16–6–62 న ముఖ్యమంత్రి శంకుస్థాపన చేశారు.



పూర్వం సాలార్ జంగ్ కుటుంబానికి అతిథిగృహంగా వుండే ఒక భవనంలో, వైద్యచరిత్ర శాఖ నెలకొల్పబడినది.



ఈ శాఖ గ్రంథాలయం—ఇందులో వైద్య చరిత్ర గ్రంథాలు, సంస్కృతం, అరాబిక్ మున్నగు భాషలలోను, ఐరోపా భాషలలోను గల వైద్యశుద్గ్రంథాలు, వైద్య చరిత్రకు సంబంధించిన పత్రికలు వున్నవి.



భారతీయ వైద్యాభివృద్ధిని చూపే పూరావస్తుశాల మరొక భాగం. మధ్యలో హైదరాబాదులో
16వ శతాబ్దంలోగల ఆస్పత్రి ప్లాస్టర్ నమూనా



మధ్యయుగంలోను, రినైసెన్సు కాలంలోను 18 వ శతాబ్దంలోను ఐరోపాలో వైద్యాభివృద్ధిని చూపే పురావస్తుశాల ఒకభాగం.

# "ఆంధ్ర ప్రదేశ్" ప్రకటన రేట్లు

'ఆంధ్రప్రదేశ్' పత్రికలో ఈ దిగువ రేట్లప్రకారం ప్రకటనలు స్వీకరించబడగలవు,

| వివరాలు | మూడుభాషల పత్రికలకు | | | ఒక భాష పత్రికకు | | |
|---|---|---|---|---|---|---|
| | పూర్తి పేజీ | సగం పేజీ | పావు పేజీ | పూర్తి పేజీ | సగం పేజీ | పావు పేజీ |
| | రూ | రూ | రూ | రూ | రూ | రూ |
| లోపలి పేజీ | 200 | 125 | 75 | 100 | 55 | 30 |
| వెనుకవైపు కవరుపేజీ | 350 | — | — | 150 | — | — |
| 2, 3 కవరు పేజీలు | 250 | — | — | 125 | — | — |

ఒక సంవత్సరం కొంతకు స్థలమును కంట్రాక్టు తీసుకొన్నవారికి 20 శతి రిబేటు ఇవ్వబడుతుంది

## షరతులు

1. సాంకేతిక వివరాలు: $10\frac{3}{4} \times 8\frac{1}{2}''$ డెమ్మీ.
2. ముందరి టైటిల్ పేజీపై ప్రకటనలు వేయబడవు.
3. పావుపేజీకంటే తక్కువ ప్రకటనలు స్వీకరించబడవు.
4. ప్రకటించవలసిన విషయము, అది వేయబడవలసిన స్థలము మొదలగు వివరాలు, దానికయే మొత్తమూ ప్రతినెల 8 వ తేదీలోపుగా ఈ కార్యాలయానికి చేరినట్లయితే, ఆ ప్రకటన మరుసటి నెల పత్రికలో ప్రచురింపబడుతుంది. ప్రకటనకయ్యే మొత్తమును మనియార్డరు ద్వారాగాని, లేక క్రాస్ చేసిన డిమాండు డ్రాఫ్ట్‌ద్వారాగాని పంపవలెను. డిమాండు డ్రాఫ్ట్ ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ సమాచార, పౌరసంబంధముల శాఖ డైరెక్టర్, హైదరాబాదు-దక్కన్ పేరిట వ్రాయబడవలెను.
5. ప్రకటన నిమిత్తమై పంపబడు బ్లాకుల విషయంలో తగుజాగ్రత్త వహింపబడుతుంది. అయితే మిషను మీద బ్లాకులు గనుక పగిలిపోయినట్లయితే అందుకు ఈ శాఖ బాధ్యత వహించదు.
6. ప్రకటన ఎంతస్థలంలో ఏవైనం ప్రకారం వేయవలసిందీ, ఒక భాష పత్రికలో వేయవలెనా, లేక మూడుభాషల పత్రికలలో వేయవలెనా అనే వివరాలను స్పష్టంగా తెలియపరచాలి. ఉత్తర ప్రత్యుత్తరాలను, పైకమును ఈదిగువ చిరునామాకు పంపవలెను.

డైరెక్టర్,
సమాచార ప్రజాసంబంధముల శాఖ,
ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వం
హైదరాబాద్-1

# సంగ్రహ ప్రకటనలు

## వినోదపు పన్ను అధికారి

అసౌకర్యాల తొలగింపు దృష్ట్యా, హైదరాబాదు, సికింద్రాబాదు మునిసిపల్ ప్రాంతాలలో 1-7-62 నుంచి ఒక కొత్త యేర్పాటు అమలులోనికి తేబడినది. దీని క్రింద, వినోదపు పన్ను చట్టం నిర్వహణాధికారం డిప్యూటీ వాణిజ్య పన్ను అధికారి—వినోదాలు—కి యివ్వబడినది. హైదరాబాదు, సికిందరాబాదు మునిసిపల్ ప్రాంతాలలో యీయనే వినోదపు పన్ను అధికారిగా వుంటూ యీ ప్రాంతాలలో వినోదపు పన్ను అధికారి పనులను నిర్వహిస్తారు. ఈయన, హైద్రాబాదు (దక్షిణ) డివిజన్ వాణిజ్య పన్నుల డిప్యూటీ కమిషనరు కార్యాలయానికి అనుబంధించ బడతారు. హైదరాబాదు మునిసిపల్ ప్రాంతంలోని సినీమాల యజమానులు యివ్వవలసిన సొమ్మును యిక మీదట, వినోదపు పన్ను అధికారికి, హైదరాబాదు ముకరంజాహి రోడ్డులో గల ఆయన కార్యాలయానికి, పంపాలి. ముద్రనిమిత్తం టిక్కెట్లను కూడ ఆయన కార్యాలయానికే తేవచ్చును.

సికిందరాబాదు మునిసిపల్ ప్రాంతంలోని సినీమాల యజమానుల సౌకర్యార్థమై, సికిందరాబాదులో వాణిజ్యపు పన్ను కార్యాలయాలు గల భవనంలో ఒక సబ్-ఆఫీసు నిర్వహించబడుతుంది ఈ ప్రాంతంలోని సినిమా యజమానులు, తమ టిక్కెట్లపై ముద్రలను సికిందరాబాదులో గల యీ సబ్-ఆఫీసులో వేయించు కొనవచ్చును. వినోదపు పన్నునుంచి మినహాయింపును కోరే దరఖాస్తులన్నీ కూడ, డిప్యూటీ వాణిజ్య పన్నుల అధికారి—వినోదాలు—, హైదరాబాదుకి సమర్పించబడాలి.

## సాహితీ పరులకు సహాయం

పేదవారైన సాహితీ పరులు, కళాకారులకు, వారి అనంతరం వారి భార్యా పిల్లలకు ధన సహాయం చేయుటకు వుద్దేశింప బడిన కేంద్ర ప్రభుత్వ పథకం, తృతీయ పంచ వర్ష ప్రణాళిక ఆరంభం నుంచి అనగా 1961-62 ఖాయం చేయ బడుతున్నది. కేంద్ర ప్రభుత్వం మాటపై, యీ పథకం ఖర్చులో మూడవ వంతును 1-4-61 నుంచి భరించుటకు, రాష్ట్ర ప్రభుత్వం తన సమ్మతిని తెలిపినది.

దరఖాస్తుల పరిశీలనకై ప్రభుత్వం ముగ్గురు వ్యక్తులతో—విద్యా మంత్రి, (అధ్యక్షుడు) విద్యా శాఖ కార్యదర్శి, విద్యా శాఖ డైరెక్టరు—ఒక సంఘాన్ని యేర్పాటు చేసినది విద్యా శాఖ డైరెక్టరు యీ సంఘం సమావేశ కర్తగా వుంటారు. కళా, సారస్వతం మున్నగు, వాటిలో విశిష్టమైన సేవ చేసిన వారే యీ పథకం క్రింద సహాయం పొందుట కర్హులు. నెలకు రూ. 150/- అంతకుపైన రాబడిగల వారు యీ సహాయం పొందుట కర్హులు కాదు. ఈ పథకం క్రింద, నెలకు రూ. 150 మించకుండగ, నెలనెలా కాని, మొత్తంగా కాని లేక రెండు విధాలా కాని ప్రభుత్వం నుంచి సహాయం లభిస్తుంది. దరఖాస్తుదారులు, తమ దరఖాస్తులను రాష్ట్ర ప్రభుత్వానికి కాని కేంద్రప్రభుత్వానికి (శాస్త్రీయ పరిశోధన, సాంస్కృతిక వ్యవహారాల మంత్రిత్వ శాఖ) కాని, రెండిటికీ కాని పంపవచ్చును.

## జమీందారీలలో సర్వే పని

తమ భూముల సర్వే, సెటిల్మెంటుల విషయంలో ఏమైనా తప్పులు జరిగి, అందువల్ల బాధ పడే రైతులందరు, వాటి దిద్దుబాటుకై, తమ ప్రాంతంపై అధికారం గల సహాయ సెటిల్మెంటు అధికారికి దరఖాస్తు పెట్టుకోవచ్చు. ఎవరికి వారు విడి విడిగా వ్రాసుకొన్న దరఖాస్తులలో, జరిగిన తప్పులను, చేయవలసిన దిద్దుబాట్లను స్పష్టంగా పేర్కొనాలి. అట్టి దరఖాస్తులను, వాటి విషయంలో కాలాతిక్రమణ జరిగినప్పటికీ కూడా, తీసుకొని, తగిన దర్యాప్తు జరిపిన మీదట, సాధ్యమైన చోటెల్లా, లోపాలను సరిదిద్దవలెనని సహాయ సెటిల్మెంటు అధికార్లు ఆదేశించబడినారు. లోపాలను తాము సరిదిద్దలేని సందర్భాలలో,

సహాయ సెటిల్మెంటు అధికారులు, ముందు యేమి చేయవలసినది దరఖాస్తుదారులకు తెలియజేస్తారు.

## విమాన రవాణా సర్వీసు

ఆంధ్ర ప్రదేశ్‌లో విమాన రవాణా సర్వీసు, 1947 పారిశ్రామిక వివాదాల చట్టం ప్రయోజనాలకై, 2-6-62 నుంచి మరొక అరు నెలలపాటు ప్రజోపయోగమైన సర్వీసుగా వుండగలదని ప్రభుత్వం ప్రకటించినది.

## కమతాల యేకీకరణ

1961 డిసెంబరులో ప్రభుత్వం జారీచేసిన వుత్తరువు క్రింద కమతాల యేకీకరణకై ప్రకటింపబడిన గ్రామాల విషయంలో, ఆదిలాబాదు జిల్లా కలెక్టరికి, రెవిన్యూ బోర్డు, 1956 హైదరాబాదు చీలికల నిరోధం, కమతాల యేకీకరణ చట్టం క్రింద, "సెటిల్మెంటు కమిషనరు" కి గల అధికారాలన్నిటిని యిచ్చినది.

## హమాలుల పరిస్థితుల దర్యాప్తు

ఆంధ్ర ప్రదేశ్‌లో హమాలుల పని పరిస్థితుల పరిశీలన సంఘం అధ్యక్షులుగా, (ఇదివరలో వుత్తరువు చేసినట్లు ప్రాంతీయ ప్రావిడెంటు ఫండు కమిషనరుకి బదులు) హైదరాబాదు లేబర్ కమిషనరు కార్యాలయంలో విలువల అంచనా, అమలుల ప్రత్యేకాధికారి శ్రీ జె. విశ్వనాధరెడ్డి వ్యవహరిస్తారని ప్రభుత్వం ఆదేశించినది.

## పట్టభద్రుల నియోజక వర్గం

ఆంధ్ర విశ్వ విద్యాలయం యిచ్చిన దిగువ ప్రాచ్యభాషా పట్టాలను, శాసన మండలి పట్ట భద్రుల నియోజక వర్గం ఎన్నికల ప్రయోజనాలకై, భారత దేశంలోని ఒక విశ్వ విద్యాలయపు పట్టభద్రునితో సమానంగా పరిగణింపబడే అర్హతలుగా, ప్రభుత్వం, యిదివరలో ప్రకటింపబడిన వాటికి తోడుగా, ప్రకటిస్తున్నది:- (1) భాషా ప్రవీణ, (2) విద్యా ప్రవీణ. పై అర్హతలు కలవారందరు, యిప్పుడు, శాసనమండలి పట్టభద్రుల నియోజక వర్గపు ఓటర్ల జాబితాలో పేర్లు చేర్పించుకొందుకై నిర్ణీత పద్ధతిలో దరఖాస్తు చేయవచ్చును.

## బకాయిల కొట్టివేత

అనంతపురం జిల్లాలో అనావృష్టివలన దెబ్బతిన్న 165 గ్రామాలలో వరుసగా మూడు సంవత్సరాల నుంచి వసూలు కాని 1367 ఫసలీకి సంబంధించిన రూ. 83,852-02 ల భూమి శిస్తు బకాయిలను వసూలుకాని పద్దుక్రింద కొట్టివేయమని ప్రభుత్వం ఆదేశించినది.

శీతోష్ణ పరిస్థితులు సరిగా లేని కారణాన, ప్రభుత్వం, యితర రక్షణలు కల్పించడంతో పాటు యీ గ్రామాలలో భూమి శిస్తు వసూలును వాయిదా వేసినది. ఆ కారణంగా, శిస్తువసూలు వరుసగా మూడు సంవత్సరాలు వాయిదా పడినది.

## కళా సమితులకు సహాయం

రాష్ట్రంలోని ప్రైవేటు కళాసంస్థలు, సమితులు తమ కార్యకలాపాలను విస్తరించుకొనుటకు లేదా నిర్దిష్టమైన కార్యక్రమాలు వేటినైన చేపట్టుటకు వీలుగా, వాటికి సహాయక గ్రాంటులు మంజూరు చేయడానికి ఆంధ్రప్రదేశ్ లలితకళా అకాడమీ సాధారణ సంఘం నిర్ణయించినది. సంఘాల రిజిస్ట్రేషన్ చట్టం క్రింద రిజిస్టరై కనీసం ఒక్క సంవత్సరమైనా పనిచేసిన సంస్థలు యీ గ్రాంటుకై దరఖాస్తు చేయవచ్చు. దరఖాస్తులను, గౌరవ కార్యదర్శి, ఆం. ప్ర. లలితా కళా అకాడమీ, తిలక్‌రోడ్, హైద్రాబాదు-1. చిరునామాకు పంపవచ్చును. దరఖాస్తులతో పాటు, గడచిన సంవత్సరపు వార్షికనివేదిక, జమా ఖర్చుల వివరణ పత్రము, సంస్థయే నిబంధనలపై యేర్పడినదో అనిబంధనల ప్రతి, కార్యకర్తల జాబితామున్నగునవి జత చేసి పంపవలెను.

## విద్యార్థి వేతనాలు

మెట్రిక్యులేషన్ పై చదువు చదివే షెడ్యూల్డు కులాలు, షెడ్యూల్డు జాతులు, యితర వెనుకబడిన తరగతుల విద్యార్థులకు కేంద్ర ప్రభుత్వం యిచ్చే విద్యార్థి వేతనాల (దేశంలోపల) కై దరఖాస్తు ఫారాలు, సాంఘిక సంక్షేమడైరెక్టరుకార్యాలయం 3-6-115 నారాయణగూడా, హైద్రాబాదు.లో లభిస్తాయి. సాంఘిక సంక్షేమ డైరెక్టరు కార్యాలయంలో రిన్యూవల్ దరఖాస్తులు తీసుకొనే ఆఖరు తేది 15-7-62, కొత్త దరఖాస్తులుతీసుకొందుకు 1-8-62

## కొత్తసౌకర్యం

6-3-1099 సోమాజీగూడా, హైద్రాబాదు-4, లో గల ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర విద్యుచ్ఛక్తి బోర్డు అక్కౌంట్ల ప్రధాన కంట్రోలరు కార్యాలయంలో 15-6-62 నుంచి ఒక "ఫిర్యాదుల విభాగం" యేర్పాటు చేయబడినది. రాష్ట్ర విద్యుచ్ఛక్తి బోర్డు అధ్వర్యం క్రిందగల విద్యుచ్ఛక్తి వినియోగదార్లు, తాము చేయవలసిన ఫిర్యాదులు యేమైనా వుంటే, వాటిని వ్రాతపూర్వకంగా, పై చిరునామా వద్దగల అక్కౌంట్ల ప్రధాన కంట్రోలరు కార్యాలయంలో డిప్యూటీ చీఫ్ అక్కౌంటెంటు (ఫిర్యాదుల విభాగం) కి యివ్వాలని కోరబడుతున్నది.

## రిపబ్లిక్ దినోత్సవ దీపాలంకరణ బహుమతులు

1962 రిపబ్లిక్ దినం రాత్రి వుత్తమంగా దీపాలంకరణ చేసినందుకు హైదరాబాదు నిజాం క్లబ్బుకు రూ. 150 ప్రథమ బహుమతి, సికింద్రాబాదు ప్రగాటూల్సు కార్పొరేషన్‌కు రూ. 100ద్వితీయ బహుమతి యివ్వాలని ప్రభుత్వం నిర్ణయించింది.



# ప్రగతి పథంలో

(జిల్లాలనుంచి అందిన వివిధ అభివృద్ధి కార్యక్రమాలను గురించిన సంక్షిప్త వార్తలు)

## ఆదిలాబాదు

### దాళవాపంట

ఆహార ధాన్యాలైన వరి, జొన్న, గోధుమ, రాగుల ఉత్పత్తిని అధికం చేసే దృక్పథంతో ఆదిలాబాదులో 1962-63 తొలకరి సమయంలో దాళవా పంట వేసే ఉద్యమం ప్రారంభమౌతుంది. ఈ ఉద్యమాన్ని జిల్లాలోని బ్లాకు, నాన్-బ్లాకు ప్రాంతాలలో ఎన్నిక చేసిన కొన్ని గ్రామాలలో అమలు జరుపుతారు. నిర్ణయించిన ఈ గ్రామాలలో ఈ ఉద్యమం ప్యాకేజి పథకంపై జరుగుతుంది. ఈ పథకం క్రింద విత్తనాలు, ఎరువులు, ఋణాలు ఇంకా ఇతరమైన వాటిని వ్యవసాయదారులకు ఇస్తారు. ఈ ఉద్యమం సందర్భంలో విమానం నుంచి మందులు చల్లే కార్యక్రమాన్ని కూడా చేపడతారు.

## అనంతపురం

### పారిశుధ్య ఉత్సవం

పారిశుధ్య ఉత్సవం సందర్భంగా గోరంట్ల బ్లాకులోని పూలేరు గ్రామంలో మే నెలలో ఒక సాధారణ శిబిరాన్ని ఏర్పాటు చేశారు. ఈ పారిశుధ్య ఉత్సవంలో గ్రామంలోని శిక్షణ పొందిన గ్రామ సహాయకులు, పంచాయతీ సభ్యులతో సహా పెద్ద రైతులు కూడా పాల్గొని-హరిజనులు వాడుకునే మంచినీటి బావి వైపు గల రోడ్డుపై అక్రమంగా స్థలాల నాక్రమించుకుని కట్టుకున్న ఇళ్ళను తొలగించారు. శ్రమదానం ద్వారా కొంత రోడ్డును కూడా వేశారు. ఇటువంటి శిబిరమే మరొకటి బుదిలి గ్రామంలో జరిగింది. హరిజన చేరిలో ఈ పారిశుధ్య ఉత్సవాన్ని నిర్వహించారు. పరిశుభ్రంగా వుంచిన గృహానికి ఒక బహుమతిని కూడా ఇచ్చారు.

### మేళా

తనకల సమితిలోని తవలంలో మే 12, 13 తేదీలలో జరిగిన పశువుల సంతలో ఒక మేళా ఉత్సవాన్ని ఏర్పాటు చేశారు. ఈ మేళాలో ప్రదర్శనలు, సాంస్కృతిక కార్యక్రమాలు బహిరంగ సమావేశాలు మొదలైన వాటిని నిర్వహించారు. ఈ సందర్భంగా బ్లాకు సిబ్బంది ప్రణాళికల ప్రాముఖ్యతను గురించి ప్రజలకు తెలియజేశారు.

## గుంటూరు

### నూతన గ్రంథాలయం

[illegible] గిలో రూ. 8,200ల ఖర్చుతో కొత్తగా నిర్మించిన శ్రీ కోటారెడ్డి గ్రంథాలయానికి ఈమని బ్లాకు పంచాయతీసమితి

అధ్యక్షులు మే 31 వ తేదీన ప్రారంభోత్సవం చేశారు. మొత్తం ఖర్చులో రూ. 4,300 లను బ్లాకు విరాళంగా ఇచ్చింది.

### శిక్షణ శిబిరం

రాజుపాలెం పంచాయతీసమితికి చెందిన దేవరంపాడు గ్రామంలో మే 28 వ తేదీ నుంచి 30 వ తేదీ వరకు గ్రామ సహాయకుల శిక్షణ శిబిరాన్నొకదానిని నిర్వహించారు. ఈ శిక్షణ శిబిరంలో 50 మంది గ్రామ సహాయకులు శిక్షణ పొందారు.

## కరీంనగరం

### బ్లాకు భవనానికి ప్రారంభోత్సవం

హుజూరాబాద్ తాలూకా భీమిడివరంలో కొత్తగా నిర్మించిన బ్లాకు భవనానికి జూన్ 10 వ తేదీన ముఖ్యమంత్రి ప్రారంభోత్సవం చేశారు. ఈ సందర్భంలో న్యాయ సమాచార శాఖల మంత్రి ప్రసంగిస్తూ జిల్లాలోని అన్ని అభివృద్ధి కార్యక్రమాలలో ముఖ్యంగా వ్యవసాయ రంగంలో ఈ బ్లాకు ప్రథమశ్రేణిలో వున్నదని అభిభాషించారు.

## ఖమ్మం

### యువజనోత్సవం

పాలేరు పంచాయతీ సమితిలోని మేడేపల్లి గ్రామంలో మే 19 వ తేదీ నుంచి ఒక యువజనోత్సవాన్ని మూడు రోజుల పాటు నిర్వహించారు. వివిధ గ్రామాలకు చెందిన అనేక బృందాల వారు ఆటలు, క్రీడలు, సాంస్కృతిక కార్యకలాపాలలో పాల్గొన్నారు. ఈ బృందాలకు బహుమతులను కూడా ఇచ్చారు.

## కృష్ణా

### హరిజన దినోత్సవం

నందిగామ పంచాయతీసమితికి చెందిన వెలదికోటపాలెంలో మే 30 వ తేదీన హరిజన దినోత్సవం జరిగింది. ఈ ఉత్సవంలో బ్లాకు అధికారులు ప్రజలకు పంచవర్షప్రణాళికల ప్రాముఖ్యతను గురించి, వాటిలో ప్రజలు పాల్గొనాల్సిన అవశ్యకతను గురించి తెలియచెప్పారు. ప్రణాళికలసమలు జరిపిన తరువాత గ్రామంలోని అభివృద్ధిని సూచించే మ్యాపులను, ఛార్టులను ప్రదర్శించారు.

నూజివీడు పంచాయతీ సమితికి చెందిన అడివి నక్కలంలో హరిజన దినోత్సవం జరిగింది. ఈ సందర్భంలో పారిశుద్ధ్య ఉద్యమాన్ని నిర్వహించి వీధులను శుభ్రం చేశారు.

### నూతన పాఠశాల భవనం

విజయవాడలోని బాలల మాంటిసొరే పాఠశాల నూతన భవనాలకు ముఖ్యమంత్రి జూన్ 14 వ తేదీన ప్రారంభోత్సవం చేశారు.

## కర్నూలు

### కంబళి నేత కేంద్రము

ఆలూరు పంచాయతీసమితి ఆలూరులో రూ. 11,468ల అంచనా ఖర్చుతో కంబళి నేత కేంద్రాన్ని ప్రారంభించడానికి తీర్మానించారు. ఈ సందర్భంగా 12 మంది కళాకారులకు 11 నెలల పాటు శిక్షణ ఇస్తారు.

కరువు పరిస్థితు లేర్పడినందున ఈ సమితిలో మేనెలలో 18 వేల రూపాయల వరకు కరువు పనులను మంజూరు చేశారు.

## మహబూబునగరం

### గ్రామ సహాయకుల శిబిరం

వ్యవసాయం, పంచాయతీల విషయాలపై ఒక గ్రామ సహాయకుల శిక్షణ శిబిరాన్ని షాద్‌నగర్ బ్లాకులోని చౌటుపల్లి గ్రామంలో మే 28 వ తేదీ నుంచి 30 వ తేదీ వరకు నిర్వహించారు. ఈ సమయంలో విస్తరణ విభాగం, గ్రామ సహాయకులు శ్రమదానంతో గ్రామంలోని వీధులను శుభ్రంచేసి ఇళ్ళకు సమీపాన వున్న ఎరువుల గోతులకు గ్రామం పొలిమేరలకు మార్చారు. దీనికి తోడు, 6 కంపోస్టు గోతులను కూడా త్రవ్వారు. సాయంత్రాలలో సాంస్కృతిక కార్యక్రమాలను నిర్వహించారు.

## మెదకు

### విద్యుచ్ఛక్తి సరఫరా

దుబ్బాక పంచాయతీ సమితి దుబ్బాకలో విద్యుచ్ఛక్తి సరఫరాకు నీటి పారుదల, విద్యుచ్ఛక్తి శాఖలమంత్రి జూన్‌లో ప్రారంభోత్సవం చేశారు. ఈ సందర్భంలో ఆయన ప్రసంగిస్తూ మెదక్ జిల్లాలోని పెక్కు గ్రామాలకు విద్యుచ్ఛక్తిని సరఫరా చేయడానికి జిల్లాపరిషత్ అధ్యక్షులు, సమితి అధ్యక్షులు చేస్తున్న కృషిని ప్రశంసించారు.

## నల్గొండ

### గ్రామీణ సమాజ వర్కుషాపు

సర్వేలు గ్రామంలో వడ్రంగం, కమ్మరంలకు ఒక గ్రామీణ సమాజ వర్కుషాపును 20 వేల రూపాయల వ్యయం గాగల ఒక పథకాన్ని మునుగోడు పంచాయతీ సమితి మే నెలలో ఆమోదించింది. శిక్షణ–ఉత్పత్తి కేంద్రంగా వుండే ఈ

కేంద్రంలో వ్యవసాయ సామగ్రిని తయారు చేస్తారు. నారాయణపూరులో స్త్రీలకు ఒక దుస్తుల తయారీ కేంద్రాన్ని ప్రారంభించడానికి కూడా నిర్ణయించారు.

గ్రామ పంచాయతీ పన్నులను వసూలు చేయడానికి ఈ సమితి ఒక ప్రత్యేక ఉద్యమాన్ని ప్రారంభించి ఇంతవరకు 14 వేల రూపాయలను వసూలు చేసింది సర్వేలు గ్రామస్తులు నూటికి నూరు శాతం పన్నులను చెల్లించారు.

### లోక్ సహాయక సేవ

ఐదువందల మందికి శిక్షణ ఇవ్వడానికి దేవరకొండలో మే 15 వ తేదీనుంచి ఒక లోక్ సహాయక సేవా శిక్షణ శిబిరాన్ని ఏర్పాటు చేశారు.

## నిజామాబాదు

### మహిళామండలి ప్రారంభోత్సవం

బన్స్వాడా బ్లాకులోని రైతునగర్‌లో కొత్తగా ఏర్పడ్డ మహిళా మండలిని మేనెలలో ప్రారంభించారు. ఈ మండలికి సగం విరాళం పద్ధతిపై ఒక కుట్టు యంత్రాన్ని సరఫరా చేశారు.

## విశాఖపట్నం

### చెరువు త్రవ్వకం

విశాఖపట్నం-కలెక్టరు వెంటరాగా ఆంధ్రప్రదేశ్ గవర్నర్-విశాఖ పట్నానికి 16 మైళ్ళ దూరంలోగల-యన్. సి. సి. శిబిరాన్ని మే 16వ తేదీన సందర్శించారు. ఈ శిబిరంలో సాంఘిక సేవా కార్యక్రమంలో శిక్షణ పొందుతున్న 400 మందికి పైగా కేడెట్లు దువ్వాడ పెద్ద చెరువును త్రవ్వే పనిని చేపట్టారు. దీనివల్ల 50 ఎకరాల ఆయకట్టు వృద్ధి చెందుతుంది.

## వరంగల్లు

### గ్రామ సహాయకులకు శిక్షణ

నెక్కొండ పంచాయతీ సమితివారు మఖుదూంపూర్ గ్రామంలో మే చివరి వారంలో ఒక గ్రామ సహాయకుల శిక్షణ శిబిరాన్ని ఏర్పాటు చేశారు. చుట్టు ప్రక్కల గ్రామాల నుంచి వచ్చిన 50 మందికి సహకారం, పంచాయతీల విషయాలతో సహా వ్యవసాయక విషయాలలో శిక్షణ ఇచ్చారు. వీరిచే సంస్కృతిక కార్యక్రమాలు, ప్రదర్శనలు నిర్వహించబడినవి. వీరు శ్రమదానం కూడా చేశారు

### గ్రామలక్ష్మి శిక్షణ

ములుగు పంచాయతీ సమితికి చెందిన పాలంపేట గ్రామంలో మే 19 20 తేదీలలో గ్రామలక్ష్మి శిక్షణ శిబిరాన్ని నిర్వహించారు వివిధ గ్రామాలనుంచి వచ్చిన 50 మంది ఈ శిబిరంలో పాల్గొన్నారు. ఆరోగ్యం పారిశుద్ధ్యం మొదలైనవాటి ప్రదర్శన శాలలను ఏర్పాటు చేశారు. కమలాపూర్ బ్లాకులోని దాదాపు 30 మంది మహిళలు మే 30వ తేదీన ములుగు పంచాయతీ సమితిని సందర్శించారు. వారు పాలంపేట గ్రామానికి వెళ్ళి అక్కడి మహిళామండలి, కుట్టు కేంద్రం, రామప్ప దేవాలయాలను సందర్శించారు.

### మధ్యాహ్న భోజనపధకం

వరంగల్ జిల్లాలో ప్రైమరీ పాఠశాలల పిల్లలకు మధ్యాహ్న భోజన పధకాన్ని కేర్ (Care) సంస్థ సహకారంతో జూన్ నుంచి ప్రారంభిస్తారు. మొదటి సంవత్సరంలో ఈ పధకం రాష్ట్రంలోని 20 జిల్లాలలో గల రెండు లక్షల మంది పిల్లలకు వర్తిస్తుంది.



# 1962-63

# రాష్ట్ర బడ్జెటు

★



ఆర్థిక మంత్రి

శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డి

సమర్పణ

★

ఆంధ్ర ప్రదేశ్ ఆర్థిక శాఖామంత్రి శ్రీ కాసు బ్రహ్మానంద రెడ్డి 1962 జూన్ 22 వ తేదీ ఉదయం శాసనసభలో 1962_63వ ఆర్థిక సంవత్సరానికి రాష్ట్ర బడ్జెటును సమర్పించారు. రెవిన్యూ ఖాతాలో రూ. 1కోటి 75 లక్షల మిగులు బడ్జెటును ఆయన ప్రవేశ పెట్టారు. 1962_63వ సంవత్సరానికి రెవిన్యూ పద్దుక్రింద ఆదాయం రూ. 115 కోట్ల 47 లక్షలు, వ్యయం రూ. 113 కోట్ల 72 లక్షలు చూపించారు.

ఈ ఏదాది మనం పన్నులు, అప్పులు వగైరాల ద్వారా రూ. 17 కోట్లను సంపాదించుకోవాలని ఆర్థిక మంత్రి సూచించారు. ఈ సంవత్సరం రూ. 10 కోట్ల మేరకు ప్రజా ఋణాన్ని సేకరించాలని వుందని కూడా ఆయన తెలియజేశారు.

మూడవ ఆర్థిక సంఘపు తీర్పు ఫలితంగా, 1962_63 వ సంవత్సరపు రెవిన్యూ అంచనాల్లో రూ. 6.5 కోట్ల పెరుగుదల సిద్ధించవచ్చునన్నారు ఆర్థిక మంత్రి.

ధరల పెరుగుదలను అరికట్టడానికి, ఆహార ధాన్యాలు వగైరాల్లాంటి ముఖ్య పదార్థాలను బజారులోకన్న చౌక ధరలకు సమకూర్చడానికి, ముఖ్యనగరాల్లో ఉద్యోగుల వినియోగ సహకార స్టోర్సులను ఏర్పాటు చేయడం మంచిదని ప్రభుత్వం భావిస్తోంది. ఈ పథకాన్ని గురించిన వివరాలు తయారు చేయబడుతున్నాయని శ్రీ బ్రహ్మానందరెడ్డి అన్నారు.

1961 నవంబరులో ప్రవేశపెట్టిన వార్ధక్య పించను పథకం క్రింద, 70 ఏళ్లు ఆ పైబడిన అసహాయులకు, జీవికను సంపాదించుకొనడానికి వీలు లేకుండా పూర్తిగా అంగవైకల్యం పొందిన వారికి జీవితాంతం పించనులను ఆయా ప్రాంతాలను బట్టి నెలకు రూ. 15 నుంచి రూ. 25 ల దాకా ఇవ్వాలని ఉద్దేశ్యం. వయస్సు పరిమితిని 65 ఏళ్లకు తగ్గించాలనే ప్రతిపాదన ఒకటి వుందని కూడా ఆర్థిక మంత్రి వెల్లడించారు.

తల్లిదండ్రుల ఆదాయం నెలకు రూ. 300 లకు మించకుండావుండి, పి. యు. సి. అందుకు సమానమైన పరీక్షల్లో ప్రథమ శ్రేణిలో ఉత్తీర్ణులైన బాలబాలికల విషయంలో ఉన్నత విద్యకు కావల్సిన డబ్బును గురించిన బాధ్యతను ప్రభుత్వం పూర్తిగా స్వీకరించాలనే ప్రతిపాదన ఒకటి వుందని ఆయన తెలిపారు.

ఆర్థిక శాఖామాత్యులు శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డి 1962–63 సంవత్సరపు బడ్జెటును సమర్పిస్తూ ఇలా ప్రసంగించారు:–

" 1962 మార్చి నెలలో ఈ సభకు తాత్కాలిక బడ్జెట్ ఒకదాన్ని నివేదించటం జరిగింది. పూర్తి బడ్జెటును శాసనసభ ఆమోదించే దాకా, పరిపాలనా వ్యవహారాలను నిర్వహించేందుకై ప్రభుత్వానికి 68.45 కోట్ల రూపాయల మొత్తాన్ని అనుమతించ వలసిందిగా అప్పట్లో ఈ సభను కోరటమైంది. ఇప్పుడు నేను సమర్పిస్తున్న బడ్జెటు, 1962–63 పూర్తి సంవత్సరానికి చెందిన వసూళ్ళకు, ఖర్చుకు సంబంధించి ఉంటుంది. కాగా, క్రితంసారి అనుమతింతబడిన మొత్తానికి సంబంధించిన వ్యవహారాలకు కూడా ఈ బడ్జెట్టు వర్తిస్తుంది.

దేశంలోని, ముఖ్యంగా రాష్ట్రంలోని ఆర్థిక పరిస్థితిని దృష్టిలో పెట్టుకొనే, ఈసారి బడ్జెటునూ తయారుచేశాం. అలాగే మూడవ పంచవర్ష ప్రణాళికలో రూపొందించుకున్న మన ఆశయాలను, బాధ్యతలను కూడా దృష్టిలోనికి తీసుకున్నాం.

ఆర్థిక పరిస్థితికి సంబంధించినంత వరకు, నేను విడిగా ఒక నివేదికను అందిస్తున్నాను. అందులో ఆర్థిక విషయాలకు సంబంధించిన భోగట్టా, 1961 లో రాష్ట్రంలోని ఆర్థిక రీతులను సూచించే విషయాలకు, అనగా వ్యవసాయ ఉత్పత్తి, ధరలు, పరిశ్రమల ఉత్పత్తి, ఉద్యోగ వసతులు వగైరా విషయాలకు సంబంధించిన సమీక్షలు ఉంటై. వ్యవసాయ రంగంలో కొంత వెనుకపడిందిగాని, మొత్తం మీద ఆర్థిక పరిస్థితి సంతృప్తికరంగానే ఉన్నట్టు ఆ నివేదికవల్ల తెలుసుకోవచ్చు. మరి వ్యవసాయ రంగంలో వెనుకంజకు కారణం–రాష్ట్రంలోని కొన్ని ప్రాంతాల్లో వాతావరణ పరిస్థితులు ప్రతికూలంగా ఉండటమే. ఇంచుమించు ముఖ్యమైన పైరులన్నిటి విషయంలోనూ ఉత్పత్తి కొంత తగ్గింది. సాగు విస్తీర్ణమూ తగ్గింది. కాని చాలా పరిశ్రమల ఉత్పత్తి అధికమూ అయింది. ముఖ్యమైన పంటల సాలుసరి టోకు ధరలు నిలకడగాలేవు. పెరుగుతూనూ వున్నయ్. తగ్గుతూనూ వున్నయ్. 1961 లో కార్మిక పరిస్థితి 1960లో కన్న ఏమంత మెరుగ్గాలేదు. జరిగిన సమ్మెలు సంఖ్య దృష్ట్యా తక్కువే అయినా, పాల్గొన్న కార్మికుల సంఖ్య ఎక్కువే. అలాగే సమ్మెజరిగిన కాలమూ ఎక్కువే. కాని ఒక్కవిషయం–ఉద్యోగాల అవకాశాల విషయంలో మాత్రం చెప్పుకోదగ్గ అభివృద్ధి జరిగింది. నికరంగా కూడా అదనపు ఉద్యోగాలు లభించినవి."

ప్రణాళిక, అభివృద్ధిని గురించి చెబుతూ ఆయన ఇలా అన్నారు.

"మన రాష్ట్రపు రెండవ పంచవర్ష ప్రణాళిక ఖర్చు రూ. 175 కోట్లు ఉండాలని సంకల్పించుకున్నాం. కాని నికరంగా జరిగిన ఖర్చు రూ. 189 కోట్లు. రెండవ ప్రణాళిక కాలంలో మన పన్నుల విధింపు సంతృప్తికరంగా వుంది. మరి మనం ప్రకటించిన ఋణాల విషయంలో ప్రజలు చూపుతున్న శ్రద్ధాసక్తులు ప్రోత్సాహకరంగా ఉంటున్నాయ్. ప్రభుత్వానికి ఋణాలివ్వటంలో ఉత్సాహం చూపుతూనే ఉన్నారు. రెండవ ప్రణాళిక యొక్క ప్రధాన లక్ష్యాలను అన్నిటిని సాధించు కొనగలిగాం. వ్యవసాయోత్పత్తి, పరిశ్రమల ఉత్పత్తి పెరిగినయ్. బస్తీల ప్రాంతాల్లోనూ, గ్రామీణ ప్రాంతాల్లోనూ ఉద్యోగావకాశాలు, పనిపాటలూ పెరిగినై. చదువుకొన్న వారికీ ఉద్యోగాలు లభించినై. పరిశ్రమల్లోనూ కార్మికుల సంఖ్య పెరిగింది. మొదటి రెండు ప్రణాళికల అనుభవం బట్టి, మూడవ ప్రణాళికను మరింత పెద్దదిగా రూపొందించుకున్నాం. మన మూడవ ప్రణాళికా మొత్తం వినియోగం రూ. 305 కోట్లు.

ఈ మొంత్తంలో దాదాపు రూ. 120 కోట్లు రెండవ ప్రణాళికకాలంలో ప్రారంభించిన పథకాలను పూర్తి చేయటానికి కావలసివస్తుంది. మిగతా మొత్తం కొత్త ప్రాజెక్టులకు, కొత్త పథకాలకు ఉపకరిస్తుంది. రాష్ట్రాల విభాగంలో జాతీయ ప్రణాళికకు అనుసరించిన సూత్రాలనే మనమూ వివిధశాఖలకు కేటాయింపులు చేయటంలో పాటించాం. అగ్రతాంబూలం వ్యవసాయానికి, నీటిపారుదలకు వెళ్ళటం సహజం. తర్వాత విద్యుచ్ఛక్తి.

ఆర్థిక వసతులు:-

మూడవ ప్రణాళికకు కావలసిన ఆర్థిక వసతులగురించి– కేంద్ర ప్రభుత్వ సహాయం ఋణాలు గ్రాంట్ల రూపంలో సుమారు రూ. 200 కోట్లు ఉండవచ్చు. ఇకపోతే, కొరదాల మొత్తాన్ని, అనగా రూ. 105 కోట్లను రాష్ట్రప్రభుత్వం కొత్త పన్నుల ద్వారానూ, అప్పుల ద్వారానూ, ఋణాలవసూళ్ళు, వగైరాల ద్వారానూ సమకూర్చుకోవాలి.

1961–62 సంవత్సరానికి, అనగా మూడవ ప్రణాళిక మొదటి సంవత్సరానికి ప్రణాళికా వినియోగం రూ. 48 కోట్లు

ఉండాలని నిర్ణయించాం. కాని దీనిని రూ. 48.54 కోట్లకు పెంచడం జరిగింది. ఇంకా అదనంగా, ఆంధ్రప్రదేశ్ ప్రాంతీయ సంఘపు సిఫార్సును అనుసరించి, తెలంగాణా ప్రాంతానికిగాను కొన్ని ప్రత్యేక అభివృద్ధి పథకాలకై రూ. 3 00 కోట్ల మొత్తాన్ని కేటాయించాం. కాని ప్రణాళికా సమితి ఇచ్చిన సలహాబట్టి, మనకు లభించగల వనరుల బట్టి ఈ పథకాలను కూడా రూ. 48.54 కోట్ల పరిమితికి లోబడి మొత్తం ప్రణాళికలోనే జతచేర్చాలని నిశ్చయించటం జరిగింది. ఆ ప్రకారం ప్రణాళిక సవరించబడింది. రూ. 26.77 కోట్లు ఆంధ్రప్రాంతానికి, మిగతా రూ. 21.77 కోట్లు తెలంగాణా ప్రాంతానికి కేటాయించబడినై.

1962-63 వార్షిక ప్రణాళిక మొత్తం వినియోగం రూ. 49.97 కోట్లు. ఇందులో రెవిన్యూ పద్దుక్రింద రూ. 16.00 కోట్లు, మిగతా రూ. 33.97 కోట్లు ఋణాలు, అడ్వాన్సులతో సహా పెట్టుబడి ఖాతాకు వర్తించునవై. అయా ముఖ్యపద్దులకింద కేటాయింపు వివరాలు:-

| పద్దు | | 1961-62 | 1962-63 |
|---|---|---|---|
| | | (రూ. కోట్లు) | |
| 1. వ్యవసాయ కార్యక్రమాలు | ... | 10.25 | 12.37 |
| 2. నీటిపారుదల విద్యుచ్ఛక్తి | ... | 24.04 | 21 45 |
| 3. పరిశ్రమలు | ... | 3 00 | 4.79 |
| 4. రోడ్లు, రోడ్డురవాణా | ... | 3 12 | 2.76 |
| 5. సాంఘిక సౌకర్యాలు | ... | 7.79 | 8.09 |
| 6. అవీ, ఇవీ, | ... | 0.34 | 0.61 |
| | మొత్తం | 48.54 | 49.97 |

ఇదికాక, అదనంగా రూ. 3.33 కోట్లను కేంద్రప్రభుత్వం ప్రతిపాదించే పథకాలపై ఖర్చుచేయటం జరుగుతుంది వివరాలు:

| | | (రూ కోట్లు) |
|---|---|---|
| వ్యవసాయ కార్యక్రమాలు | ... | 2.07 |
| నీటిపారుదల | ... | 0.02 |
| పరిశ్రమలు | ... | 0 22 |
| రోడ్డు, రోడ్లురవాణా | ... | 0 07 |
| సాంఘిక సౌకర్యాలు | ... | 0 91 |
| అవీ, ఇవీ | ... | 0 04 |
| | మొత్తం | 3.33 |

కేంద్ర ప్రభుత్వం రాష్ట్ర ప్రణాళికకుగాను ఋణాలు, గ్రాంట్ల రూపంలో రూ. 33 కోట్లను ఇవ్వటానికి మాట ఇచ్చింది. మరి ఈ మొత్తం కేంద్రప్రభుత్వం ప్రతిపాదించే పథకాల రూ. 3. 27 కోట్ల మొత్తానికి అదనంగా ఉంటుంది. (మిగతా రూ. 6 లక్షలను రాష్ట్ర ప్రభుత్వం సమకూర్చుకోవాలి) ఇక మనం పన్నులు, అప్పులు వగైరాలద్వారా రూ. 17 కోట్లను సంపాదించుకోవాలి."

## మూడవ ఆర్థిక సంఘం

మూడవ ఆర్థిక సంఘపు తీర్పు ఫలితంగా, 1962-63 సంవత్సరపు రెవిన్యూ అంచనాల్లో రూ. 6.6 కోట్ల పెరుగుదల సిద్ధించవచ్చు-1961-62 బడ్జెట్ అంచనాలతో పోలిస్తే, ఇందులో రూ. 50 లక్షలు రోడ్ల నిర్వాహణ ప్రమాణాల అభివృద్ధికి కేటాయించబడినై. జీతాల సవరింపు మూలంగా సంక్రమించిన అదనపు బాధ్యత నిమిత్తమై మిగతా మొత్తంలో ఇంచుమించు సగంభాగం ఇదివరకే వినియోగం అయింది. అదనపు ఆదాయంలో ఇక మిగిలే మొత్తం పెరుగుతున్న ఖర్చు, అప్పు వ్యవహారాల సర్దుబాటుకు కావాలి. కాబట్టి మూడవ ఆర్థికసంఘపు తీర్పు ఫలితంగా రాష్ట్రానికి చేకూరే అదనపు ఆదాయం అభివృద్ధి కార్యకలాపాల విస్తరణకు లభించజాలదని చెప్పవచ్చు.

## 1962-63 బడ్జెట్ అంచనాలు

రెవిన్యూ వసూళ్లు:

1962-63 బడ్జెట్ ప్రతిపాదనలవైపు తిరుగుదాం.

1962-63 బడ్జెట్ అంచనాల ప్రకారం మొత్తం రెవిన్యూ రూ. 115.47 కోట్లు, సవరించిన అంచనా ప్రకారం రూ 87.54 కోట్లు. వివరాలు:-

| పద్దు | | 1961-62 సవరించిన అంచనాలు | 1962-63 బడ్జెట్ అంచనాలు |
|---|---|---|---|
| | | (రూ. కోట్లు) | |
| 1. కేంద్ర ప్రభుత్వపు పన్నుల్లో రాష్ట్రపువాటా | ... | 17 00 | 17.36 |
| 2. కేంద్ర ప్రభుత్వపు గ్రాంట్లు (చట్ట ప్రకారం అమాంబాపతు) | | 4.02 | 9.84 |

| పద్దు | 1961_62 సవరించిన అంచనాలు | 1962_63 బడ్జెట్ అంచనాలు |
|---|---|---|
| | (రూ. కోట్లు) | |
| 3. ప్రణాళికా పథకాలకు కేంద్ర ప్రభుత్వపు గ్రాంట్లు (కేంద్ర ప్రభుత్వం ప్రతిపాదించిన పథకాలతో సహా) ... | 8.39 | 9.94 |
| 4. రాష్ట్ర రంగంలో పన్ను ఆదాయం | 39.71 | 41.89 |
| 5. రాష్ట్ర రంగంలో ఇతర ఆదాయం | 18.42 | 19.41 |
| 6. వర్గీకరణలో మార్పులు ... | ... | 12.03 |
| 7. కొత్త పన్నులు ... | — | 5.00 |
| మొత్తం | 87.54 | 115.47 |

మొదటి రెండు అంశాలకింద పెరుగుదలకు ప్రధానకారణం-మూడవ ఆర్థికసంఘపు తీర్పు. ఇక మూడవ అంశపు అంచనాను ప్రణాళికా పథకాలకు లభించే కేంద్రసహాయ విధానాన్ని అనుసరించిచేయటం జరిగింది. రాష్ట్రరంగంలోని పన్ను ఆదాయం (రూ. 5 కోట్లదాకా లభించగల కొత్తపన్నులతో స ) మూలంగా 1962_63 లో రూ. 46.89 కోట్లు రావచ్చు. 1961_62 అంచనాల ప్రకారం రూ. 39.71 కోట్లు. ఈ పెరుగుదలకు దోహదంగా వుండే ఇతర ప్రధాన అంశాలు_భూమి రివిన్యూ; రాష్ట్ర ఎక్సైజు సుంకాలు వగైరా.

వచ్చే ఏడాది జరిగే రూ. 12.03 కోట్లు పెరుగుదలకు కారణం వర్గీకరణంలోని మార్పులు. ఈ మార్పుల్లో చెప్పుకోదగినవిషయం- విద్యుచ్ఛక్తి, నీటిపారుదల పథకాలులాంటి ప్రభుత్వ వ్యాపార సంస్థలయొక్క, ఏదో కొంత వ్యాపారంచేసే సంస్థల యొక్క నిర్వహణ ఖర్చులను ఖర్చువైపుకు మార్చటం. పూర్వంలో నిర్వహణఖర్చు స్థూల ఆదాయంలో తగ్గింపుగా చూపబడేది.

రివిన్యూ ఖర్చు:_ రివిన్యూఖాతాన ఖర్చు బడ్జెటు ప్రకారం రూ. 113.72 కోట్లు వుంటుంది. 1961_62లో జరిగిన ఖర్చు రూ. 93.31 కోట్లు. పద్దుల వివరాలు:_

| పద్దు | 1961_62 సవరించిన అంచనాలు | 1962_63 బడ్జెట్ అంచనాలు |
|---|---|---|
| | (రూ. కోట్లు) | |
| 1. వర్గీకరణంలో మార్పులు ... | ... | 12.03 |
| 2. మామూలు ఖర్చు ... | 76.83 | 82.74 |
| 3. ప్రణాళిక ఖర్చు: | | |
| (i) రాష్ట్ర ప్రణాళిక ... | 15.03 | 16.00 |
| (ii) కేంద్ర ప్రభుత్వం ప్రతిపాదించిన పథకాలు ... | 1.45 | 2.95 |
| మొత్తం | 93.31 | 113.72 |

మామూలు రివిన్యూ ఖర్చుకింద పెరుగుదల ప్రధానంగా ఇలా సమకూరింది_అప్పుల వ్యవహారం (రూ. 97 లక్షలు) సవరించిన జీతాలవలన (రూ. 249 లక్షలు); గ్రామోద్యోగులకు తాత్కాలిక సహాయం (రూ. 71 లక్షలు); వైద్యం (రూ. 23 లక్షలు); పబ్లిక్ వర్క్సు (రూ. 21 లక్షలు); భూమి రివిన్యూ (రూ. 36 లక్షలు); అత్యవసర (కంటిన్‌జెన్సీ) నిధినుంచి క్రిందటి సంవత్సరం ఇచ్చిన అడ్వాన్సుల తిరిగి వసూలు (రూ. 31లక్షలు) మరియు ఇతర పద్దులలో పెరుగుదల (రూ. 103 లక్షలు).

ప్రణాళిక ఖర్చులోని మార్పులగురించి విశేషించి చెప్పవలసింది లేదు.

ఈ కింది విషయాలకై 1961_62 బడ్జెట్ అంచనాల్లోకన్న ఎక్కువ గ్రాంట్లు బడ్జెట్టులో కేటాయించబడినై:_

(రూ. లక్షలు)

| | | |
|---|---|---|
| 1 | రోడ్ల నిర్వాహణ ... | 50 |
| 2 | పంచదార చెరకు ప్రాంతాల్లో రోడ్ల నిర్మాణం ... | 10 |
| 3 | సెకండరీ, ప్రాథమిక విద్యకింద జిల్లాపరిషత్తులకు పంచాయతీ సమితులకు గ్రాంట్లు... | 300 |

ఈ కింది ప్రత్యేకపు గ్రాంట్లు 1962_63 బడ్జెట్టులో కూడా మళ్లీ చేర్చబడినై:

(రూ. లక్షలు)

| | | |
|---|---|---|
| 1 | పంచాయతీ సమితులకు అప్పులు ... | 9.00 |
| 2 | హైదరాబాద్ మునిసిపల్ కార్పొరేషన్‌కు సహాయక గ్రాంటు ... | 10.00 |

3 హైదరాబాద్ సికింద్రాబాద్ జంటనగరాల్లో నిరుద్యోగ నివారణకు ... 10.00

4 టోల్‌టాక్స్ రద్దుఫలితంగా పురపాలక సంఘాలకు నష్టపరిహారం ... 16.00

5. జిల్లాపరిషత్తులకు ఆఫీసు కట్టడాలు ... 16.00

6. షెడ్యూల్డుకులాలు, షెడ్యూల్డు జాతులు వగైరాల విద్యార్థులకు మినహాయింపులు: ఆటల వగైరాల ప్రత్యేకరుసుముల చెల్లింపు విషయంలో వీరికి పూర్తి మినహాయింపు ఏర్పాటు చేయబడింది ... 5.00

7. సాహిత్య, సంగీత నాటక, లలితకళా అకాడమీలకు గ్రాంట్లు ... 2.25

8. క్రీడా సంఘానికి గ్రాంటు ... 2.00

షెడ్యూల్డు కులాల, ఇతర వెనుకబడిన వర్గాల సంక్షేమ కార్యకలాపాలకై ప్రణాళిక బడ్జెట్ కింద, ప్రణాళికేతర బడ్జెట్ కింద తగిన గ్రాంట్లు కేటాయించబడినై. వివరాలు:—

| | బడ్జెట్ అంచనాలు 1961—62 | సవరించిన అంచనాలు 1961—62 | బడ్జెట్ అంచనాలు 1962—63 |
|---|---|---|---|
| | (రూ. లక్షలు) | | |
| షెడ్యూల్డు కులాలు:— | | | |
| ప్రణాళికకు చెందనట్టివి ... | 118,88 | 138.59 | 140.00 |
| ప్రణాళికకు చెందినట్టివి ... | 25,99 | 38.96 | 39,05 |
| మొత్తం | 144.87 | 177.55 | 179.05 |
| వెనుకబడినవర్గాలు:— | | | |
| ప్రణాళికకు చెందనట్టివి ... | 32.32 | 39.15 | 40.23 |
| ప్రణాళికకు చెందినట్టివి ... | 2.40 | 4.80 | 4.18 |
| మొత్తం | 34.72 | 43.95 | 44.41 |

ప్రణాళిక పద్దులకింద, బడ్జెట్ అంచనాలతో సవరించిన అంచనాలను పోలిస్తే కనబడే పెరుగుదలకు కారణం—మిగతా ప్రణాళిక పద్దులకింద ఒకేసారి లభించే పొదపును ఇటు మళ్లించటం, ఈ ఏడాదికూడా ఏడాది చివరి భాగంలో మిగతా పద్దులకింద జరిగే పొదుపును మళ్లించటంవలన ఈ ఏడాది ప్రణాళిక కేటాయింపుల్లోకూడా పెరుగుదలను సమకూర్చుకోవచ్చు.

జిల్లా పరిషత్తులకు, పంచాయతీ సమితులకు బాధ్యతలు, అవసరాలు అధికమౌతున్నయ్. ఆ నిమిత్తమై వాటికి ఆర్థిక సహాయం చేసేందుకై బడ్జెట్టులో తగిన కేటాయింపులు చేయబడినై, పద్దుల ప్రకారం వివరాలు:—

| | | (రూ. లక్షలు) |
|---|---|---|
| 1. | "భూమి రివిన్యూ" పద్దుకింద గ్రాంట్లు ... | 213.23 |
| 2 | "బండ్లపై పన్ను" పద్దుకింద గ్రాంట్లు ... | 87.88 |
| 3. | నీటి పారుదల ... | 51 40 |
| 4 | నిర్వహణ సిబ్బంది వగైరా ... | 17 74 |
| 5. | విద్య ... ... | 969 82 |
| 6. | వైద్యం, ప్రజారోగ్య వసతులు ... | 36.83 |
| 7 | వ్యవసాయం ... | 26.80 |
| 8. | పశుపోషణ ... ... | 13 97 |
| 9 | పరిశ్రమలు ... ... | 9 25 |
| 10. | సాంఘిక సంక్షేమం వగైరా ... | 79 51 |
| 11. | కమ్యూనిటి ప్రాజెక్టులు ... | 78 59 |
| 12. | పబ్లిక్ వర్క్సు ... ... | 152,63 |
| 13. | అవీ ఇవీ ... ... | 45.76 |
| | మొత్తం | 1783 41 |

ప్రణాళికకు చెందని బడ్జెట్‌లో ఈ గ్రాంట్లు కేటాయించబడినై, మరి విద్యకు, వ్యవసాయానికి, సాంఘిక సౌకర్యాలకు, పబ్లిక్‌వర్క్సు, కమ్యూనిటీ ప్రాజెక్టులు, వగైరాలకు ప్రణాళికకింద ప్రత్యేకమైన కేటాయింపులు కూడా ఉన్నయ్. కాగా, వివిధ అభివృద్ధి కార్యకలాపాలకుగాను జిల్లాపరిషత్తులకు, పంచాయతీ సమితులకు ఋణాలు, అడ్వాన్సులకింద రూ. 13.34 కోట్ల మొత్తం అదనంగా కేటాయించబడింది.

షెడ్యూల్డు కులాలకు, వెనుకబడిన వర్గాలకు చెందిన విద్యార్థులకు, ఆర్థికంగా వెనుకబడిన కుటుంబాల విద్యార్థులకు ఆర్థిక

సహాయాన్ని విస్తరించేందుకై ఇటీవల సంవత్సరాల్లో ఎన్నో కార్యక్రమాలు అవలంభించబడినై.

తల్లితండ్రుల ఆదాయం నెలకు రూ 300 లకు మించకుండా వుండి. పి యు సి. అందుకు సమానమైన పరీక్షల్లో మొదటిశ్రేణిలో ఉత్తీర్ణులైన బాలబాలికల విషయంలో ఉన్నత విద్యకు కావలసిన డబ్బునుగురించిన బాధ్యతను ప్రభుత్వం పూర్తిగా స్వీకరించాలనే ప్రతిపాదన ఒకటి ఉంది. మంచి ప్రతిభవున్న బాలబాలికల అభివృద్ధికి ఇది ఎంతగానో ఉపకరించి తీరుతుంది.

## గ్రామీణ మంచినీటి సప్లై పథకం

రెండవ ప్రణాళికలో అమలు జరుపబడిన జాతీయ నీటి సప్లై పథకాన్ని ఆ తర్వాత కేంద్ర ప్రభుత్వం మానేసింది. గ్రామాల్లో మంచినీటి సప్లైకు డబ్బు ఇప్పుడు స్థానిక అభివృద్ధి కార్యక్రమాల పథకంకింద కేటాయించ బడుతోంది. ఇందు నిమిత్తమై యీ సంవత్సరము రాష్ట్రానికి రూ. 41 లక్షల గ్రాంటు వుంది. ఈ మొత్తం మంచినీటిసప్లై పథకాలకే పూర్తిగా వినియోగింపబడుతుంది. ఇంకా అదనంగా, ఈక్వలైజేషన్ గ్రాంట్‌లోంచి మరొక రూ. 40 లక్షలను సమకూర్చటం జరుగుతుంది. అలాగే సమాజ వికాసపు బడ్జెట్‌నుంచి మరొక రూ. 10 లక్షలు. మంచి నీటి వసతులను ఏర్పాటు చేసేందుకై ప్రభుత్వం గ్రామ పంచాయతీలకు గ్రాంట్లకై రూ. 10 లక్షలను మంజూరు చేసిందికూడా. అంటే 1962–63లో రూ. 1.01 కోటి ఖర్చు అయ్యే పథకాలు అమలు జరుగు తున్నాయన్నమాట.

## చిన్ననీటి వనరు

1962–63 వార్షిక ప్రణాళికలో నీటి సాగు బడ్జెట్‌కు రూ. 296.26 లక్షలు కేటాయించబడినై.

వివరాలు :–

1. పి. డబ్ల్యు. డి. పనులు ... రూ. 190.26 లక్షలు
2. జిల్లాపరిషత్తులకింద పనులు ... 76.00 ..
3. వ్యవసాయశాఖకింద పంపుసెట్లు, వగైరా ... 30.00 ..

ఈ కేటాయింపు చాలదనే భావం వుంది. అందుకని అదనంగా ఈ ఏడాది మరొక 50 లక్షలను సమకూర్చాలని ఉంది.

చిన్ననీటి వనరులని ప్రణాళికలో మొత్తం కేటాయించిన రూ. 18.26 కోట్లను ఏవో కొన్ని సర్దుబాట్లు చేసి ఇంకా ఎనిమిది నుంచి పది కోట్ల రూపాయలతో పెంచటానికై తగు చర్యలు తీసుకొనబడుతున్నవి. ఎందుకంటే చిన్ననీటి వనర్ల కార్యక్రమాలు రాష్ట్రమంతటా బాగా వ్యాపించి వున్నాయి. సురక్షితమైన నీటివనర్ల సౌకర్యాలు లేని ప్రాంతాలకు ఇవి ఎంతైనా ఉపకరించగలవు.

గొట్టపు బావులు :–భూగర్భ జల ప్రవాహాన్ని వినియోగించటానికై 150 నుంచి 200 ఎకరాలదాకా సాగు చేయగల గొట్టపు బావులను ఏర్పాటు చేయవచ్చునేమోనని పరిశీలించాలని ఉంది–ముఖ్యంగా వర్షాభావంచే దెబ్బతినే ప్రాంతాల్లో.

పంట బావులు :–బావికి రూ.750లు చొప్పున పంటబావులకు విరాళాన్ని ఇచ్చేందుకై బడ్జెట్‌లో రూ. 48 లక్షల మొత్తం కేటాయించబడింది మెట్ట ప్రాంతాల్లో, వర్షాభావపు ప్రాంతాల్లో కుటుంబానికి కొక పంటబావిని ఏర్పాటు చేసేందుకై ఒక పథకాన్ని రూపొందించాలని ఉద్దేశ్యం. అయితే చిన్న రైతులకు ప్రాముఖ్యం చూపబడుతుంది, ఏకుటుంబానికి కూడా ఒకటికంటె ఎక్కువ బావులు ఉండకుండా, తగు శ్రద్ధ చూపబడుతుంది. ప్రస్తుతంగాని, లేకసమీప భవిష్యత్తులో గాని ఎలాంటి నీటి సాగు పథకాలు అమలు జరుగని ప్రాంతాల్లోనే ఈపథకాన్ని ముందు ప్రవేశపెట్టేటు కూడా చూడటం జరుగుతుంది.

రెవిన్యూ మిగులు :–కొత్త పన్నులవల్ల రాగల రూ 5కోట్ల అదనపు ఆదాయాన్ని లెక్కలోకి తీసుకుంటే మొత్తం మిగులు రూ 1.75 కోట్లు ఉంటుంది ఇది పెట్టుబడి కాతా తరుగును సరిపుచ్చుకోటానికై వినియోగింపబడుతుంది.

పెట్టుబడి వినియోగం :–వచ్చే ఏడాది ప్రణాళిక, ప్రణాళికేతర పథకాలపై పెట్టుబడి వ్యయం రూ. 29.81 కోట్ల దాకా ఉంటుంది. పెట్టుబడి కార్యక్రమంలోని ముఖ్యాంశాలు తెలుసుకోవాలనే ఆసక్తి గౌరవ సభ్యులకు ఉంటుంది. ఇవి :

## నీటి పారుదల

| | | (రూ. లక్షలు) |
|---|---|---|
| 1. నాగార్జునసాగర్ ప్రాజెక్టు | ... | 900 00 |
| 2. కర్నూలు–కడప కాల్వ | ... | 38.00 |
| 3. తుంగభద్ర ఎగువ కాల్వ | ... | 110.00 |
| 4. రాజోలిబండ మళ్ళింపు పథకం | ... | 20.00 |

| | | |
|---|---|---|
| 5. కడం ప్రాజెక్టు | ... | 40.00 |
| 6. పోచంపాడు ప్రాజెక్టు | ... | 11 00 |
| 7. వంశధార ప్రాజెక్టు | ... | 10 00 |
| 8. కిన్నెరసాని ప్రాజెక్టు | ... | 55 00 |
| 9. తొర్రిగడ్డ పంపింగ్ పథకం | ... | 12 00 |

### విద్యుచ్ఛక్తి

| | | |
|---|---|---|
| 10. ఎగువ సీలేరు జల విద్యుచ్ఛక్తి పథకం | ... | 79.83 |
| 11. శ్రీశైలం జల విద్యుచ్ఛక్తి పథకం | ... | 10 00 |
| 12. తెలంగాణా హైడ్రో థర్మల్ పథకం | ... | 70.00 |
| 13. కొత్తగూడెం థర్మల్ పథకం | ... | 25 00 |

### పరిశ్రమలు

| | | |
|---|---|---|
| 14. ఆంధ్ర పేపర్ మిల్స్ | ... | 119.62 |
| 15. ఆంధ్రప్రదేశ్ పారిశ్రామిక అభివృద్ధి కార్పొరేషన్ | ... | 80.50 |
| 16. ఆంధ్రప్రదేశ్ మైనింగ్ కార్పొరేషన్ | ... | 10.00 |

### అమాంబాపతు

| | | |
|---|---|---|
| 17. రోడ్డు రవాణా కార్పొరేషన్ | ... | 46.88 |
| 18. పోలీసు గృహనిర్మాణ పథకం | ... | 30 39 |
| 19. సెక్రటేరియట్, తదితర ఆఫీసు కట్టడాలు | ... | 55.00 |

పని వేగాన్ని హెచ్చించేందుకై ఈ క్రింది మూడు ప్రాజెక్టుల కేటాయింపులను అధికం చేయాలని ఉత్తర్వులు జారీ చేయబడినవి:—

| | (అదనపు మొత్తం) |
|---|---|
| 1. శ్రీశైలం | రూ. 65 లక్షలు |
| 2. పోచంపాడు | 40 .. |
| 3. తుంగభద్ర ఎగువకాలువ | 40 .. |

వివిధ రంగాల్లోపల చేసుకొనే సర్దుబాట్ల ఫలితంగా లభించనట్టి పైకం కోసం, ఈ పనులకు గాను నేను మళ్ళీ ఎప్పుడో శాసనసభలో సప్లిమెంటరీ గ్రాంట్లను నివేదిస్తాను.

### ఋణాలు అడ్వాన్సులు

వివిధ పద్దులకింద అప్పులు, అడ్వాన్సుల ఖాతాన పంపిణీలు రూ. 15.92 కోట్లు వుంటాయి. ముఖ్యాంశాలు ఇవి :—

| | | (రూ. లక్షలు) |
|---|---|---|
| 1. పురపాలక సంఘాలు వగైరాలకు ఋణాలు | .... | 153.10 |
| 2. భూమి అభివృద్ధి, వ్యవసాయదార్ల ఋణాల చట్టం కింద సాగుదార్లకు ఋణాలు | .... | 55.00 |
| 3. రసాయనిక ఎరువుల కొనుగోలుకు ఋణాలు | | 390.05 |
| 4. సహకార సంఘాలకు, భూమి తనఖా బ్యాంకులకు ఋణాలు | .... | 48.20 |
| 5. చేనేత పనివారల సహకార సంఘాలకు గృహనిర్మాణ పథకాలకై ఋణాలు | .... | 7.50 |
| 6. కొత్తబావుల విరాళపథకంకింద అప్పులు | .... | 48.00 |
| 7. జాతీయ విస్తరణ సేవా, సమాజిక అభివృద్ధి కార్యక్రమాలకింద ఋణాలు | ... | 110.70 |
| 8. తక్కువ ఆదాయవర్గపు, తదితర గృహనిర్మాణ పథకాలు | .... | 149.20 |
| 9. పారిశ్రామిక ఎస్టేట్ల ఏర్పాటుకై చిన్న పరిశ్రమల అభివృద్ధి కార్పొరేషన్‌కు ఋణాలు | .... | 30 00 |
| 10. రాష్ట్ర విద్యుచ్ఛక్తి బోర్డుకు ఋణాలు | .... | 338 85 |
| 11. తక్కావీ ఋణాలకు గాను పంచాయతీ సమితులకు అడ్వాన్సులు | .... | 60.66 |

### ప్రజా ఋణం

ఈ ఏడాది రూ. 10 కోట్ల ప్రజా ఋణాన్ని సేకరించాలని వుంది. చిన్న పొదుపు ఉద్యమంలో మన వాటాకింద సుమారు రూ. 3 కోట్లు రాగలవు. ప్రణాళికా పథకాలు వగైరాలకు కేంద్ర ప్రభుత్వం చేసే ఋణసహాయం రూ. 32.11 కోట్లదాకా వుంటుంది. వివిధ ఋణాల చెల్లింపుకు చేసే రూ. 14.90 కోట్ల కేటాయింపు పోను, ప్రజాఋణంలో కలిగే నికరమైన పెరుగుదల రూ. 30.01 కోట్లు వుంటుంది. 1963 మార్చి నెలాఖరుకు ప్రజాఋణం రూ. 274.30 కోట్లు వుంటుంది.

### అప్పు, డిపాజిట్లు వగైరా

డిపాజిట్లు మిగతా అప్పు పద్దుల వ్యవహారాలకింద వసూళ్ళు, పంపకాల మూలంగా రూ. 1.31 కోట్ల నికరవ్యయం ఉండవచ్చు.

### రొక్కపు నిల్వ

ఈ ఏడాది రూ. 7.16 కోట్ల తరుగు నిల్వతో ప్రారంభమై రూ. 6.31 కోట్ల తరుగు రొక్కపు నిల్వతో ముగియవచ్చు.

## నాన్ గెజిటెడ్ ఉద్యోగుల డిమాండ్లను గురించి ఆర్థికశాఖామంత్రి ఈ విధంగా చెప్పారు.

" నాన్ గెజిటెడ్ ఉద్యోగుల జీతాలను 1958 లో సవరించటం జరిగింది. మళ్లీ గత సంవత్సరం కరువు భత్యాన్ని మూలవేతనంతో కలిపేసి, ఆ విధంగా మళ్లీ జీతాలను సవరించటం జరిగింది. ఈ రెండు సార్లు జరిగిన జీతాల సవరణ మూలంగానూ, ఇందు నిమిత్తమై స్థానిక సంస్థలకు, ప్రభుత్వ సహాయం పొందుతున్న సంస్థలకు ఆర్థిక సహాయం చేయటం మూలంగానూ, గ్రామోద్యోగులకు తాత్కాలిక సహాయం చేయటం మూలంగా ఏర్పడిన అదనపు భారం మూలంగానూ ఏటాదికి సుమారు రూ. 8 కోట్లదాకా ఖర్చు చేయవలసి వచ్చింది. కాగా, ప్రధాన ఆహార ధాన్యాల ధరలు, ఇతర వస్తువుల ధరలు పెరిగి పోతున్నాయని, కనీసం రూ. 150 లకు తక్కువ సంపాదిస్తున్న ఉద్యోగులకైనా కరువుభత్యపు రేట్లను ఎంతో కొంత పెంచాలని నాన్ గెజిటెడ్ ఉద్యోగులు విజ్ఞప్తులు చేస్తున్నారు. కాని ఇలాంటి సౌకర్యం సమకూర్చటం ప్రస్తుతానికి సాధ్యమయ్యేట్టు లేదు— మన ఆర్థిక పరిస్థితి, అభివృద్ధి రంగంలోని మన బాధ్యతలు, మన కృషి ఇందుకు వెసులుబాటును కలిగించేవిగా లేవు. అయినా ప్రభుత్వం వచ్చే సంవత్సరాల్లో ఈ విషయాన్ని పరిశీలించవచ్చు.

జీతాల ప్రమాణాలను రెండు సార్లు సవరించినా, అందులో ఏవో లోపాలున్నాయని శాసన సభలోనూ, బైటాకూడా పేర్కొనటం జరిగింది. అలాంటి సందర్భాలు అక్కడక్కడ ఉండవచ్చు నని ప్రభుత్వం భావించి నప్పటికీ, ఎలాంటి అపోహలకు తావీయ కుండా వుండటానికై ప్రభుత్వం, ఆ లోపాలను గురించి విచారించేందుకుగాను ప్రణాళికాశాఖ కార్యదర్శిని, ఆర్థికశాఖ కార్యదర్శిని నియమించాలని నిశ్చయించింది. వారు సిఫార్సుల ననుసరించి, వచ్చే కొలది నెలల్లో ఈ లోపాలను సాధ్యమైనంతవరకు తొలగించటానికి ప్రయత్నిస్తాం.

ధరల పెరుగుదలను అరికట్టటానికి, ఆహార ధాన్యాలు వగైరా ల్లాంటి ముఖ్య పదార్థాలను బజారులోకన్న చౌక ధరలకు సమకూర్చటానికి, ముఖ్య నగరాల్లో ఉద్యోగుల వినియోగ సహకార స్టోర్సులను ఏర్పాటు చేయటం మంచిదని ప్రభుత్వం భావిస్తోంది. ఈ పథకాన్ని గురించిన వివరాలు తయారు చేయ బడుచున్నాయ్ ".

## సాధనా సదుపాయాల విషయమై చెప్తూ మంత్రి ఇలా అన్నారు:—

" రెండవ ప్రణాళిక తొలి అంచనాల ప్రకారం రూ. 175 కోట్లు. కాని మొత్త వినియోగం రూ. 189 కోట్లు. అంటే ఆదనంగా రూ. 14 కోట్లు ఖర్చు అయినయన్నమాట. ఇందు మూలంగా రాష్ట్ర ఆర్థిక స్థితిగతులకు తాకిడి కలిగింది. ఫలితం ఏమిటంటే, 1961 ఏప్రిల్ 1 వ తేదీన మనం రిజర్వు బ్యాంకు ఆఫ్ ఇండియా మీద ఓవర్ డ్రాఫ్ట్‌తో సంవత్సరాన్ని ప్రారంభించుకున్నాం. 1961—62 ప్రణాళికా పథకాలకు వేసిన వసతుల అంచనాల్లో రూ. 12 కోట్ల ఋణానికి అవకాశం చూపబడింది, ఆ తర్వాత ఆ మొత్తం రూ. 10 కోట్లకు తగ్గించబడింది, నికరపు వసూళ్ళు రూ. 11 కోట్లు. ఆ విధంగా ఆ పద్దుకింద రూ. 1 కోటి తరుగుదల సంభవించింది. అలాగే చిన్న పొదుపు ఉద్యమం కూడా మొదట్లో అనుకున్నంతగా కలసిరాలేదు. ఇక ప్రతికూల వాతావరణ పరిస్థితులవల్ల దెబ్బతిన్న ప్రాంతాల్లో సహాయక కార్యక్రమాలకై చాలా డబ్బు వెచ్చించటం జరిగె. మరి భూమిస్తు సూఫీలు నిలుపుదలలు సరే. గత సంవత్సరం కొత్త పన్నులను వేయలేకపోయాం. ప్రణాళికకు సమకూర్చుకోగలిగిన మొత్తం సుమారు రూ. 10 కోట్లు. అంతే. పోతే, కేంద్ర ప్రభుత్వ సహాయం రూ. 31 కోట్లతో కలుపుకుంటే మొత్తం 41 కోట్లన్న మాట. కాని అనుకొన్న ప్రణాళికా వినియోగం 48 కోట్లు. అంటే మొత్తం మీద ప్రణాళిక ఆర్థిక వసతుల్లో తరుగుదల మొత్తం రూ. 7 కోట్లు. ఈ విషయం తరుగుతో మొదలైన ప్రారంభపు లోక్కువు నిల్వతో ప్రతిబింబిస్తూనే వుంది.

ఇక 1962—63 సంవత్సరానికి, ప్రణాళిక ఆర్థిక వసతుల్లో మన వాటాకింద కనీసం రూ. 17 కోట్లను సమకూర్చుకోవాలి. రూ. 10 కోట్ల ప్రజాఋణాన్ని ప్రకటించాలని సూచించబడింది. ఎక్సైజ్, అమ్మకపు పన్ను తక్కావీ ఋణాలు, భూమి రివిన్యూ బకాయీల వసూళ్ళవలన మరొక రూ. 2 కోట్లు రావచ్చు. మిగతా రూ. 5 కోట్లను కొత్తపన్నుల ద్వారా సమీకరించుకోవాలి, రూ 50 కోట్ల ప్రణాళికను అమలు జరపటానికి ఇది బొటాబొటిగా సరిపోతుంది. ఇలా అయితే రూ. 300 కోట్ల మొత్తం వున్న ప్రణాళికా లక్ష్యాన్ని సాధించటం కష్టసాధ్యం అవుతుంది కాబట్టి 1962—63 లో మనం కనీసం రూ. 56 కోట్లనైనా ఖర్చు పెట్టాలి. విద్యుచ్ఛక్తి పథకాలకు, నాగార్జునసాగర్ ప్రాజెక్టుకు, బస్తీలకు గ్రామ ప్రాంతాలకు వర్తించే మంచినీటి సప్లై పథకాలకు, తదితర ప్రధాన ప్రాజెక్టులకు

ఇంకెక్కువ మొత్తాలను వినియోగించటానికి అప్పుడు అవకాశం వుంటుంది. కాని మనవైపున మనం రెండు, రెండున్నర కోట్ల రూపాయలను అదనంగా చేకూర్చుకో గలిగితేనే. ప్రణాళికా వినియోగాన్ని పైన చెప్పినట్లు పెంచుకొనటానికి సమ్మతించవలసిందిగా ప్రణాళికా సమితికి నచ్చజెప్ప గలుగుతాం. అలా చేయగలమని ఆశిద్దాం"

పన్ను విధానాన్ని సక్రమం చేయటం గురించి చెబుతూ శ్రీ బ్రహ్మానందరెడ్డి ఈ యీ విధంగా అన్నారు.

"ఇప్పటి అమ్మకపు పన్ను చట్టాన్ని అభివృద్ధి చేయటానికి తగిన అవకాశం వుంది. రేటు పద్ధతిని ఇంకా క్రమబద్ధం చేయవచ్చు. అలాగే వ్యవహార విధానాలను యింకా సులభతరం చేయవచ్చు. అందుకని ప్రభుత్వం ఢిల్లీలోని కౌన్సిల్ ఆఫ్ అప్లైడ్ ఎకనామిక్ రిసెర్చ్ సంస్థను రాష్ట్రంలో అమ్మకపు పన్ను విధానం ఏలా పని చేస్తోందీ పరిశీలించి అమ్మకపు పన్ను ఆదాయాన్ని వ్యాపారానికి దెబ్బతగలకుండా పెంచేవిధంగా సిఫార్సులను చేయవలసిందిగా కోరటమైంది. ఈ సంస్థయొక్క డైరెక్టర్ జనరల్ అయిన డా॥ పి. యస్. లోకనాథన్ ఇందుకు అంగీకరించారు. డా॥ లోక్‌నాథన్ నివేదిక అందగానే ప్రభుత్వం ఈ విషయంలో ఒక నిర్ణయానికి రాగలుగుతుంది. కాని ఇందుకు కొంత వ్యవధి పట్టుతుంది. సంవత్సరం ముగిశాకగాని ఫలితాలు కనపడక పోవచ్చు.

## భూమిశిస్తు

ఇప్పటి భూమిశిస్తు మదింపురేట్లు ఎప్పుడో ముప్పయి, నలభయి సంవత్సరాల క్రితం నిర్ణీతమైనట్టివి. ఇప్పటి భూమి సారానికిగాని, భూమి విలువకుగాని, పంటలకు రైతులిప్పుడు పొందుతున్న ధరలకుగాని ఈ పాతశిస్తు మదింపురేట్లతో ఏమీ సంబంధంలేదు. ఆంధ్ర తెలంగాణా ప్రాంతాల్లోని మెట్టభూములశిస్తు మదింపులో ఏమంత చెప్పుకోదగ్గ తేడాలేదని. పంచవర్ష ప్రణాళికలకు అనుకూలంగా ఈ మదింపులను కూడా అయిదేళ్లకొకసారి పునః పరిశీలన చేయటం మంచిదని, అలాంటి పరిశీలన వ్యవసాయిక-ఆర్థిక విషయాలపైన, ధరల ధోరణిపైన ఆధారపడి వుండాలని అనంతరామన్ సంఘం సూచించింది. త్వరితంగా రవాణా అభివృద్ధి చెందటం, వ్యవసాయం ఒక వ్యాపారంగా వృద్ధి చెందటం, అఖిలభారత కమ్మోడిటీస్ మార్కెట్‌లోని మార్పు ప్రతిదానినీ ద్రవ్యంగా మార్చుకొనటం, ఎంచటం ఇవన్నీ భూమిశిస్తు తగ్గించటానికి దోహదపడినై. కేంద్ర ప్రభుత్వం నియమించిన పన్నుల పరిశీలన సంఘమూ, 1951లో మద్రాసు ప్రభుత్వం ఏర్పాటుచేసిన భూమిశిస్తు సంస్కరణల సంఘమూ ఈ మాదిరి అభిప్రాయాలనే వెలిబుచ్చినయి. ఆంధ్ర తెలంగాణా ప్రాంతాల్లో మాగాణి మదింపులో బాగా తేడావుందని. ధరల పెరుగుదలకు ప్రభుత్వం ఎప్పటి కప్పుడు అధికంగా సమకూరుస్తున్న నీటివసర్ల సౌకర్యాలకు, ఇతర సౌకర్యాలకు అనుకూలంగా రాష్ట్రమంతటా ఒకే మదింపు విధానాన్ని అనుసరించటం అవసరమనికూడా అనంతరామన్ సంఘం భావించింది.

"భూమిశిస్తుతోపాటు ఇప్పుడింకా కొన్ని ప్రత్యేక లెవీలు ఉన్నయి-వ్యాపారపు పంటలపై ప్రత్యేక మదింపు. మెట్టభూముల మదింపులపై సర్‌చార్జీలాగా. వివిధ చట్టాలకింద భూమిపై అనేక రకాల విధింపులు జరిగి, రైతు మొత్తం చెల్లించే భూమిశిస్తు విషయం గజిబిజిగా వుందనే ఫిర్యాదు ఒకటివుంది. ఏదో ఒకే చట్టం కింద ఒకేసారి ఇంత అని విధిస్తే రైతుకు అది అంతకన్న సులభంగానూ, తేలిగ్గా తెలుసుకోటానికి వీలుగానూ వుంటుందనీ భావిస్తున్నారు.

"కాబట్టి ఇందాకచెప్పిన ప్రత్యేక లెవీలను రద్దుచేసి, మదింపు మూల ప్రమాణాలను, రేట్లను పెంచాలని నిశ్చయించటం జరిగింది. అందుకు సంబంధించిన బిల్లు ఇదివరకే ప్రకటించబడి, ఈ శాసన సభా సమావేశంలో ప్రవేశపెట్టబడనున్నది. భూముల్లోని రకాలబట్టి ప్రత్యేక లెవీల రద్దువలన కల్గిన లాభాల బట్టి మదింపు రేట్లు పెంచబడటానికి బిల్లులో అవకాశం చూపబడింది.

## మోటారుబండ్ల పన్ను

ప్రస్తుతం ఆంధ్ర, తెలంగాణా ప్రాంతాల్లోనూ ఇటీవల మద్రాసు నుంచి సంక్రమించిన ప్రాంతాల్లోనూ విడివిడిగా పనిచేస్తున్న మూడు మోటారుబండ్ల పన్నుల చట్టాలు ఉన్నాయి. ఈ మూడు చట్టాల కింద పన్ను విధింపు కూడా తేడాగానే వుంది. కాబట్టి రాష్ట్రపు జిల్లాలన్నిటిలోనూ ఒకే పద్ధతిని పన్నులను, విధానాలు వగైరాలను సమకూర్చే సమగ్ర శాసనాన్ని ప్రవేశపెట్టాలని ప్రభుత్వం భావిస్తుంది."

తమ ప్రసంగాన్ని ముగిస్తూ ఆర్థికమంత్రి ఇలా అన్నారు:

"అన్ని రంగాల్లోనూ మనం కేవలం జయాన్నే సాధించామని నేను అనడం లేదు. కాని పూర్తి అయిన మొదటి రెండు

ప్రణాళికల ద్వారానూ, ఇప్పుడు ఆరంభమైన మూడవ ప్రణాళిక ద్వారానూ సాధ్యమైనంత ఉత్తమ ప్రయోజనాలను సాధించటంలో ప్రభుత్వం నిర్విరామంగా కృషిజేసిందని మాత్రం నేను చెప్ప గలను కొత్త అవసరాలు, పరికరాలు తగినంతగా లేకపోవటం, అలాగే విదేశీమారక ద్రవ్యం సరిపడేంత లేకపోవటం వీటికి తగ్గట్టు పరిపాలనా యంత్రాంగాన్ని రూపొందించటంలో ఉండే సాధకబాధకాలు. ఇవన్నీ అలావుండగా మనకు ముఖ్య సమస్య ఒకటి వుంది. అదే ద్రవ్య సమస్య. మన మూడవ ప్రణాళిక రూ. 305 కోట్లది. ఇందులో మనం సమకూర్చుకోవలసిన మొత్తం రూ. 105 కోట్లు. ఈ రూ. 105 కోట్లలో సుమారు రూ. 60 కోట్లు బహిరంగ ప్రజా ఋణాల ద్వారానూ, రెవిన్యూ మిగులులు వగైరాల మూలంగానూ లభించవచ్చు. మిగతా మొత్తానికి కొత్త పన్నులే మార్గం. మూడవ ఆర్థిక సంఘపు తీర్పువలన మనకు ఒరిగేదల్లా, తప్పించుకొనటానికి వీలు కావి మన ఇతర బాధ్యతలు కొన్ని తగ్గటం, అంతే. ఇదివరకు ఒక సందర్భంలోనే చెప్పినట్లు, మూడవ ప్రణాళికలో అప్పుడే ఒక సంవత్సరం మనం చూస్తూ వుండగానే గడచిపోయింది కాబట్టి గౌరవ సభ్యులు ఈ బాధ్యతకు వాస్తవిక దృక్పథంతో పూను కుంటే తప్ప కాకపోతే ప్రజానీకపు అభ్యుదయానికి పునాదిలాంటి వైన మన బహు-ముఖ-అభివృద్ధి కార్యక్రమాలు దెబ్బతింటాయి. మన బాధ్యతలను నిర్వర్తించటంలో నేను గౌరవ సభ్యుల సాను భూతిని, సహకారాన్ని అభ్యర్థిస్తున్నాను. గతంలో ఆంధ్రప్రదేశ్ ప్రజలు సర్వదా ఉత్సాహంతో ముందుకు వచ్చి, పన్నులద్వారా, ఋణాలద్వారా రాష్ట్రద్రవ్యనిధికి దోహదపడే పెన్నిధిగా వుంటూ వస్తున్నారు. ఆర్థిక పరిస్థితులబట్టి ఇతర పరిస్థితులబట్టి భూమి శిస్తులో పెరుగుదల. అలాగే ఇతర పన్నులు సమంజసమైనట్టివే. మరి ప్రజలు వీటిని పూర్వంలోవలెనే ఆమోదించి, ప్రభుత్వంతో సహకరిస్తారనే గాఢ విశ్వాసం నాకు వుంది. నాగార్జునసాగర్ ప్రాజెక్టు. శ్రీశైలం. పోచంపాడు, తుంగభద్ర ఎగువ కాల్వ విద్యుచ్ఛక్తి, చిన్న నీటివసర్లు. బస్తీ ప్రాంతాలకు. గ్రామ ప్రాంతాలకు మంచినీటి సప్లై. మలేరియా నిర్మూలన వగైరా ముఖ్య కార్యక్రమాలకు ఎక్కువ డబ్బును సమకూర్చటానికై ప్రస్తుత సంవత్సరపు వినియోగాన్ని రూ. 55 కోట్లకు ప్రభుత్వం పెంచాలనుకుంటోందని ఇంతకు మునుపు నివేదించాను. ప్రభుత్వం ఈ ఆశయాలను సఫలం చేసుకొవగలి గేట్టు గౌరవ సభ్యులు చేస్తారనటంలో సందేహం లేదు.

" పరిస్థితులను ఎదుర్కొవాలి. ప్రజలపట్ల మనకున్న బాధ్యతలను నిర్వర్తించటంలో మనందరకు తగిన వివేకాన్ని, బలాన్ని, ధైర్యాన్ని ఇచ్చి, మనను శ్రేయోమార్గంలో ముందుకు నడిపించమని పరమేశ్వరుని ప్రార్థిస్తూ, ముగిస్తున్నాను నా ప్రసంగాన్ని. సకల జనులూ సుఖీభవ "

"జై హింద్"



అశ్వావలోకనంకంటె ఎన్నో రెట్లు గొప్పది సింహావలోకనం—సింహావలోకనంకంటె ఎన్నో రెట్లు గొప్పది విశ్వావలోకనం—ఈ తారతమ్యాన్ని గుర్తించకుండా విశ్వావలోకనంచేశా ననుకునేవాడు గుశ్వావలోకనం చేసినవాడవుతాడు

# పంచాయతీరాజ్య పురోగమనం

## రొఖ్ఖం విరాళం

మే నెలలో తాళ్ళరేవు పంచాయతీ సమితి గ్రామస్థులు. సంస్థలు రూ. 5,034 రొఖ్ఖం విరాళ మివ్వటమేకాక కాకినాడలో సంకల్పించిన స్త్రీల కళాశాలకు మరొక రూ. 5,380 యివ్వడానికి వాగ్దానం చేశారు.

ఖమ్మం జిల్లాకలక్టరు 14-6-62 న అశ్వారావుపేట పంచాయతీ సమితిని ప్రారంభించారు.

## ఉత్తమ గ్రా.స్థా.కా.

చేవెళ్ల బ్లాకు పంచాయతీ సమితిలో గ్రా. స్థా. కా. శ్రీ ఎ. ప్రకాశం, షాబాదు. పెంటయెరువు తయారీలో ఉత్తమ గ్రామస్థాయి కార్యకర్తగా ప్రకటింపబడ్డాడు. అతనికి, వ్యవసాయశాఖచే బహుమతి బాండ్ల రూపంలో రూ. 25/- బహుమతి యివ్వబడినది. ఈ బ్లాకులో పెంటయెరువు తయారీకి ఉత్తమ గ్రామంగా కక్లూరు గ్రామ పంచాయతీ ప్రకటింపబడినది. వ్యవసాయ శాఖ దానికి రూ. 50 విలువగల డాలును బహూకరించినది.

## సహకార సంఘాల సభ్యత్వ వుద్యమం

1962 మేలో ఆదోని పంచాయతీ సమితిలో సహకార సంఘాల సభ్యులుగా 24 మంది చేర్చుకొనబడ్డారు. రూ. 646 వాటా మూలధనంగా సేకరించబడినవి. ఆపైన, రూ. 18,600 వరకు అప్పులు యివ్వబడినవి. రెండు యువజనుల క్లబ్బులు, రెండు మహిళామండలులు, రెండు బాలసభలు ప్రారంభింపబడినవి. 3 పొగరానిపొయ్యిలు, 3 చెత్తడబ్బాలు, 26 మురుగునీటి గుంటలు. 2 పాఠశాలా భవనాలు నిర్మించబడివి. పశు సంపదాభివృద్ధి విషయంలో, 23 ప్రత్యక్ష ప్రదర్శనలు, 22 ప్రచార సభలు జరుపబడినవి.

## ఆధునిక వ్యవసాయ పద్ధతులు

ఆధునిక వ్యవసాయ పద్ధతుల క్రింద, నగరి పంచాయతీ సమితిలో '62 మేలో 181 మణుగులవుత్తమవిత్తనాలు వాడబడినవి. 217 మ. రసాయన యెరువులు కూడా వాడబడినవి. ఇవికాక, "బోసునాగళ్లు" అనే 6 ఆధునికి నాగళ్లు పంపిణీ చేయబడినవి. ఆధునిక వ్యవసాయ పద్ధతుల అవలంబనకు రైతులను ప్రోత్సహించుటకై అయిదు ప్రదర్శన క్షేత్రాలు యేర్పరచబడినవి. చీడల నివారణ కార్యక్రమం క్రింద, 8 యెకరాల ప్రదేశం, చీడలనుంచి, జబ్బులనుంచి కాపాడబడినది. భూమి సాగు కార్యక్రమం క్రింద 19 యెకరాల భూమిసాగుక్రిందకు తేబడినది.

## చెరువు మరమ్మతు

మిర్యాలగూడ పంచాయతీ సమితి వెంకటాపురం గ్రామస్థులు మే నెలలో, తమ గ్రామంలో గండిపడిన కుంటను, శ్రమదానంతో, బాగు చేసుకున్నారు. ఈ పని విలువ రూ. 250 అని అంచనా నర్సాపురం గ్రామస్థులు, గ్రామంలో మురుగు కాల్వలు, పాఠశాల భవనం నిర్మాణానికై రూ. 200/- ఖరీదుచేసే రాళ్లను సేకరించారు. ఇంటి పన్ను వుద్యమం ఫలితంగా రూ. 3,900/- వచ్చినవి.

## నీటిపారుదలకింద అదనపుభూమి

పెద్దాపురం పంచాయతీ సమితిలో మే నెలలో 2,311 మ. వుత్తమ విత్తనాలు, 2,078 మ. రసాయన యెరువులు పంపిణీ చేయబడినవి. నాలుగు ఆధునిక వ్యవసాయ పరికరాలు ప్రవేశపెట్టబడినవి. మూడు పక్కా బావులు, ఒక గొట్టపుబావి నిర్మించబడినవి. ఒక పంప్‌సెట్టు నెలకొల్పబడినది. అదనంగా 24 యెకరాల భూమి నీటి పారుదలక్రిందకు తేబడినది. పది ఎకరాల భూమి బాగు చేయబడినది.

(మిగతా 66 వ పుటలో)

# ముఖ్యవార్తలు

## రాష్ట్రంలో

**మే 20:** ఆంధ్ర కేసరి శ్రీ. శ్రీ. టి. ప్రకాశం చితా భస్మాన్ని హైదరాబాద్ సమీపంలోని సంగంలో నిమజ్జనం చేశారు.

**మే 23:** తృతీయ ప్రణాళికలో మిగతా కాలానికి ప్రభుత్వం పన్నుల కార్యక్రమాన్ని నిర్ణయించింది.

**మే 25:** మత్స్య శాఖాధికారుల వార్షిక మహాసభకు అడవులు, పశుపోషణ, మత్స్య శాఖ మంత్రి హైదరాబాద్‌లో ప్రారంభోత్సవం జరిపారు.

**మే 28:** ఆంధ్ర ప్రదేశ్, మైసూరు, మహారాష్ట్రలోని కరువు ప్రాంతాలకు సంబంధించిన ఒక పైలట్ పథకాన్ని కేంద్రానికి నివేదించడానికి తయారు చేస్తున్నట్లు రెవెన్యూ మంత్రి ప్రకటించారు.

**మే 30:** ఆంధ్ర ప్రదేశ్ కోస్తాతీరంలో విదేశీ సహాయంతో లోతు సముద్రములో చేపలు పట్టడాన్ని అభివృద్ధి చేయడానికి రాష్ట్ర ప్రభుత్వం నిర్ణయించిందని పశుపోషక, మత్స్యశాఖ మంత్రి వెల్లడించారు

**మే 31:** మద్రాసునుంచి విద్యుత్‌ను సరఫరా చేసుకునేట్లయితే మద్రాసుకు నీటిని సరఫరా చేసేటువంటి ఇచ్చి పుచ్చుకునే మార్పిడి వ్యవహారమేది మద్రాసు ప్రభుత్వంతో లేదని ఒక పత్రికా సమావేశంలో ముఖ్య మంత్రి స్పష్టీకరించారు.

**జూన్ 1:** సాంకేతిక శిక్షణ, విద్యరాష్ట్ర బోర్డు ఆరవ సమావేశాన్ని ముఖ్య మంత్రి ప్రారంభించారు.

**జూన్ 6:** శిక్షణ పొందిన నర్సుల అసోసియేషన్ 5వ రాష్ట్ర మహాసభకు ఆరోగ్యశాఖ మంత్రి గుంటూరులో ప్రారంభోత్సవం జరిపారు.

**జూన్ 9:** వైద్యకళాశాలల ప్రిన్స్‌పాల్స్, వైద్యశాఖాధికారులు మొదలైనవారి రెండు రోజుల సమావేశానికి ముఖ్యమంత్రి హైదరాబాద్‌లో ప్రారంభోత్సవం చేశారు.

**జూన్ 14:** రాష్ట్రంలో భూమిశిస్తును అధికం చేయాలన్న ప్రభుత్వ నిర్ణయాన్ని ప్రకటించే బిల్లును గెజెట్‌లో ప్రకటించారు.

**జూన్ 18:** ఆంధ్ర ప్రదేశ్ శాసన సభ శరదృతు సమావేశం ఆరంభమైంది.

**జూన్ 19:** తృతీయ ప్రణాళికలో రాష్ట్రానికి కేటాయించిన రూ. 305 కోట్లు పెరగడానికి అవకాశముందని ప్రణాళికా మంత్రి అసెంబ్లీలో వెల్లడించారు.

**జూన్ 16:** ఐదవ ఆంధ్ర ప్రదేశ్ వైద్య మహాసభను ఆరోగ్య మంత్రి విజయవాడ వద్ద గల గుణదలలో ప్రారంభించారు.

## భారత దేశంలో

**మే 21:** ఇండియా అమెరికాలకు మధ్య ఐదు ఒప్పందాలు ముగిసినవి. ఇందువల్ల ప్రజారోగ్య పథకాలకు మొత్తం 33.9 కోట్ల రూపాయలవరకు అమెరికా గ్రాంటుగా ఇస్తుంది.

**మే 26:** ఇనుము, ఉక్కుకై నాల్గవప్రణాళిక కార్యక్రమాన్ని రూపొందించడానికి రాష్ట్రంలో పరిశీలక బృందాలను ఏర్పాటు చేయడానికి— ప్రణాళికా సంఘం, కేంద్ర భారీ పరిశ్రమల మంత్రి మధ్య జరిగిన చర్చలలో నిర్ణయించినట్లు తెలుస్తుంది.

**మే 28:** ప్రభుత్వానికి సలహా లివ్వడానికి ప్రైమరీ, సెకండరీ, విశ్వ విద్యాలయ, సాంఘిక విద్యలకు నాలుగు స్థాయీ సంఘాల ఏర్పాటును గురించి కేంద్ర విద్యా మంత్రి నేడు లోక్‌సభలో ప్రకటించారు.

**మే 31:** డాక్టర్ సి. పి. రామస్వామి అయ్యర్ నాయకత్వాన హిందూ దేవాదాయ ధర్మాదాయ కమిషన్ తన నివేదికను కేంద్ర ప్రభుత్వానికి సమర్పించింది.

**జూన్ 2:** మేజర్ జాన్ దియాస్ నాయకత్వాన ఏర్పడిన ఎవరెస్ట్ శిఖరారోహణ ద్వితీయ బృందం 29,028 అడుగుల ఎత్తుగల ఆ శిఖరాన్ని చేరుకోలేక తిరోముఖం పట్టింది.

జూన్ 6: శ్రీ టి. టి. కృష్ణమాచారిని కేంద్ర మంత్రి వర్గంలో పోర్టుఫోలియో లేని మంత్రిగా నియమించారు.

జూన్ 19: భారత దేశానికి బ్రిటన్ చేసే ఆర్థిక సహాయ కార్య క్రమాన్ని గురించి బ్రిటిష్ కామన్వెల్త్ కార్యదర్శి, భారత ఆర్థిక మంత్రి చర్చలు జరిపారు.

## విదేశాలలో

మే 23: భారత దేశానికి పది నుంచి 15 మిలియన్ డాలర్లవరకు అదనపు వాణిజ్య ఋణాలనివ్వడానికి జపాన్ ప్రభుత్వం నిర్ణయించింది.

మే 24: " ఆరోరా VII " అనే వ్యోమ నౌకలో అంతరిక్షంలో సంచరించిన అమెరికన్ గగనవిహారి కార్పెంటర్ భూమి చుట్టు మూడు సార్లు తిరిగి సురక్షితంగా భూమికి చేరుకున్నాడు.

మే 26: దక్షిణ లావోషియన్ రాష్ట్ర రాజధాని శరవాణె, వామ పక్ష పాథెట్‌లావో దళాలకు వశమైంది.

మే 28: ఇండియా, పాకిస్తాన్‌ల మధ్య ద్విపార్శ్వక చర్చలు ప్రారంభం కావాలని భద్రతా సమితిలో ఐదు చిన్న రాజ్యాలు ప్రతిపాదించిన తీర్మానాన్ని పాకిస్తాన్ నిరాకరించింది.

జూన్ 20: కాశ్మీర్ సమస్యపై పునఃసమావేశమైన భద్రతా సమితిలో, అరబ్ రిపబ్లిక్, రుమేనియా, ఘనాతో సహా పెక్కు రాజ్యాలు, ఈ సమస్యను ముఖాముఖి చర్చల ద్వారా పరిష్కరించుకోవాలని ప్రకటించాయి.



( 64 వ పుట తరువాయి )

## గ్రామస్థుల కృషి

ఆదిలాబాదు పంచాయతీ సమితి సుంకిడి గ్రామంలో, గ్రామస్థులు శ్రమదానంతో నాలుగు ఫర్లాంగుల నిడివిగల రోడ్డును నిర్మించారు. గ్రామాలలో వాడకానికై పదిహేను పంచాయతీలు ఒక సెట్టు ఆధునిక వ్యవసాయ పరికరాలను కొన్నవి. రూ. 75,000 అంచనా ఖర్చుపై రంపూరు, పోచెర్లమీదుగా ఆదిలాబాదు నుంచి కొహదాద్ వరకు నిర్మింప తలపెట్టిన రోడ్డుపని జరుగుతున్నది. మట్టిపని పూర్తి అయినది. ఈ రోడ్డుక్రింద బడేభూములు గల ఆసాములందరూ, వాటిని వూరికే యిచ్చివేయడం విశేషం.

## రసాయన యెరువుల కార్డులు

బన్సువాడ పంచాయతీ సమితి నస్వ గ్రామానికి 1962 మేలో విద్యుచ్ఛక్తి సరఫరా ఆరంభింపబడినది. విస్తృత పౌష్టికాహార కార్యక్రమం క్రింద చేపలు, గ్రుడ్లు పంచిపెట్టబడినవి. గాలిపురం మహమ్మద్ నగరాలలో సామాజిక అల్పాహారం యేర్పాటు చేయబడినది. విత్తనాల శుద్ధికై రైతులకు అగ్రోసన్ పంపిణీచేయబడినది. రైతు నగరంలో కొత్తగా ఒక మహిళా మండలి యేర్పాటు చేయబడినది. రైతులకు భూమిని బట్టి లభించే రసాయన యెరువుల గరిష్ఠ ప్రమాణాన్ని కార్డులపై గుర్తించి అవి రైతులకు యివ్వబడినవి.

## బట్టల పంపణీ

కోట నందూరు పంచాయతీ సమితి అధ్యక్షుడు, పత్యులు కాకినాడలో స్త్రీల కళాశాల స్థాపనకై రూ. 5000 విరాళమిచ్చారు. సమితి సభ్యురాండ్రు, యీ విషయంలో మిగుల శ్రద్ధతీసుకొని గ్రామాలలోని స్త్రీలనుంచి రూ. 100 సేకరించారు. తరువాత, మల్లవరం, కాకరపల్లిలలో అగ్నిప్రమాదానికి గురియైన వారికి బట్టల పంపిణీకై రూ. 500 ఖర్చుచేయటానికి యీ సమితి తీర్మానించినది.

# గ్రంథ సమీక్ష

## సంసార శోభ

**(కుటుంబ నియంత్రణ నాటిక)**

రచయిత: శ్రీ శ్రీరాం వీరబ్రహ్మకవి వెల: 50 న. పై.

సంసార శోభ అనే ఈ చిన్న నాటిక కుటుంబ నియంత్రణావశ్య కతను ఉద్బోధించటానికి ఉద్దేశించబడినట్టిది. కవిరత్న, ఆంధ్ర భాషా వాచస్పతి బిరుదాంకితులు, సహస్రావధాని అగు శ్రీ కవి గారు కుటుంబ నియంత్రణ విషయంలో మూఢనమ్మకాలు ఎంత అసంగతమైనవో భారతోదంతములతో నిరూపించారు. బహు సంఖ్యాక మగు కుటుంబము మధ్యతరగతి గ్రామీణులకు ఏవిధంగా భారమయినది, దానిలోని ఈతిబాధలు ఈ చిన్ననాటిక ద్వారా తెలియచేస్తారు. కుటుంబనియంత్రణ ప్రచార సాధనంగా ఈ చిన్న నాటిక సహాకారికాగలదు.

## పువ్వుపుట్టగనే పరిమళం

**(బాల సాహితి)**

రచయిత: మధురాంతకం రాజారాం. వెల; 50 న. పై. ప్రకాశకులు: శ్రీ గోదాగ్రంధమాల, శ్రీమన్నారాయణపురం ఉల్లి పాలెం పోష్టు దివితాలుకా: కృష్ణాజిల్లా. శ్రీ మధురాంతకం రాజా రాం ఎనిమిది పుష్పాలను ఎంచుకొని అవి మొగ్గలోనే ఎలాపరి మళాన్ని వెదజల్లినది తమ కథాకలితార్థయుక్తితో తెలియచేశారు. ఆ పుష్పాలు మరేవోకాక మనందరికి ఆరాధనీయులగు పూజ్యబాపూజీ, సుభాశ్చంద్రబోస్, వీరేశలింగం, రవీంద్రకవీంద్రుడు, కె. యస్. కేసరీ, డాక్టర్ రాధాకృష్ణ, జయప్రకాశనారాయణ, రామకృష్ణ పర మహంసలయొక్క జీవిత పుష్పాలనే ఉదాహరణగా తీసికొన్నారు. వారు తమ బాల్యంలో వెదజల్లిన సుగంధాన్ని ఈ చిన్ని కథలలో చక్కగా చొప్పించగలిగారు. హృదయానికి హత్తుకునేలా సరళ మైన శైలిలో సాగిన ఈ కథలను బాలురను చక్కగా ఆకర్షించ గలవు. బాలసాహితికి ఈ చిన్న కథల సంపుటి మంచి కానుక.

## ఆంధ్రభల్లటము

**(అన్యాపదేశ కావ్యము)**

కావ్యకర్త: శ్రీ ధనకుధరం వేంకటాచార్య. వెల: రూ 1.00 దొఱుకు చోటు: బుక్ లవర్సు ప్రైవేట్ లిమిటెడ్, అరండల్ పేట–గుంటూరు–1. 'భల్లటకవి' సంస్కృతంలో రచించిన అన్యా పదేశకావ్యానికి ఆంధ్రానువాదమే 'ఆంధ్రభల్లటము'. క్లిష్టతరమైన కావ్యానువాదాన్ని చేపట్టి శ్రీ "ధనకుధరం" కృతకృత్యుల య్యారన టానికి సందేహము లేదు. అన్యాప దేశకావ్యాలను అర్థం చేసు కోవడమే చాల కష్టమైనపని. ఇక అనువదించవలసి వచ్చినపుడు వేరే చెప్పవలసిన అవసరంలేదు. కవికాల పరిస్థితులను సంపూర్ణ ముగా అవగాహన చేసుకొని అనువదించటంలో ప్రకర్ష చూపించగలిగారు అలభ్యములయిన భల్లటుని శ్లోకాలు సేకరించగలగటం, సేకరించిన వాటి ననువదించగలటం అసాధా రణ విషయం. ఈ పుస్తకంలో ఆంధ్రానువాదంతో పాటు భల్లటుని సంస్కృత శ్లోకాలను కూడ ఇవ్వడంచేత రెంటిని సమన్వయించి పఠించడానికి వీలు కలుగచేశారు. అనువాదము సరళమైన శైలిలో చక్కని తెలుగు నుడికారాన్ని ఉగ్గడింపచేస్తుంది. "స్ఫూర్తిశ్రీ" వ్రాసిన ప్రస్తావిక అనువాదానికి చక్కని జిగీషలిస్తుంది. సం స్కృత భాషా ప్రవేశంకల వారికి ఈ అనువాదము ఎక్కువ సంతోషదాయక మవుతుంది.

## కథాలహరి

ప్రచురించినవారు: సాహిత్యగౌతమి వెల: 1–30 న. పై. దొరకుచోటు: సి. హెచ్. సుబ్రహ్మణ్యం, 10/820 వీరభద్రపురం రాజమండ్రి–1. సాహిత్య గౌతమివారు నూట ముప్పయ్ నయాపైసలకు ఆరు మంచి కథలను సమకూర్చి కథాల హరిఅనే ఈ కథల సంపుటిద్వారా పాఠకలోకానికి అందిస్తున్నారు. ఇందులో 'జమదగ్ని' 'కనక్ ప్రవాసి' 'రంధిసోమరాజు' 'మరమ'

'మంజుశ్రీ' 'కమలేమనోహర్' 'ఉషశ్రీ'లచే రచింపబడిన ఏడు కథలున్నాయి. ఈ కథలు ఒక గంట కాలక్షేపాన్ని ఆనందాన్ని కలుగచేస్తాయి

''శ్రీనివాస్''

## శ్రీ రాజలింగేశ్వర శతకము

కర్త: లొల్లా సుబ్బరామయ్య, ప్రతులకు: శ్రీ పూర్ణానంద నిలయము, (H.O.) బాపట్ల, గుంటూరు జిల్లా. బ్రాంచి: షక్కర్‌నగర్. మూల్యము: 0-37 న.పై.

భారతదేశమున భక్తి తత్పరతకు, ఆధ్యాత్మిక భావ సంపత్తికి లోటులేదు. ఈ ప్రపంచం మాయ అని, జీవితం బుద్బుద ప్రాయమని, చర్విత చర్వణమైన సంసార సాగరము నీది మోక్ష తటమును చేరుటకు దైవభక్తియే సరియైన నావ అని భారతీయుల ప్రగాఢ విశ్వాసం. శాపవశాత్తూ ఆసన్న మృత్యువైన పరీక్షిన్నరేంద్రుడు, ఐహిక చింతను మాని, తనకు గల స్వల్ప వ్యవధిలో పుణ్య చరిత్ర అయిన మహాభాగవతమును విన్నాడు అటులనే వ్యాధిగ్రస్తుడై "జీవితము అనుమానాస్పద" మైన సమయంలో పరమేశ్వరచరణ రాజీవధ్యానమే పరమావధియని నిశ్చయించినట్లు యీ కవి చెప్పుకున్నాడు. ఆ భక్తికి బాహ్యచిహ్నమే యీ శతకమని చెప్పవచ్చు.

నిజామాబాదు జిల్లాలో ఏకచక్రపురమని నామాంతరము గల బోధన్ అనే గ్రామానికి చుట్టూ గల యెత్తయిన దిబ్బలను త్రవ్వినపుడు ఒక ఆలయము బయటపడినదట. తదధి దైవతమైన రాజలింగేశ్వరస్వామి పేరిటనే యీ శతకం రచించబడినది.

ఇందులో భక్త్యావేశము, రచనా పాటవము జోడు గుర్రాల వలె నడచినవి. పద్యాలకు చక్కని ధార ఉన్నది ఆలయముతో పాటు స్వామి కొంత కాలము మరుగుపడి వుండుటకు యిప్పుడు వెలికివచ్చుటకు యీ కవి వూహించిన కారణములు మనోజ్ఞముగా వున్నవి.

నీలెంకనై
ఢంకాగొట్టి ఢణంఢణల్‌జగమునిండన్నిన్ను బోల్ దైవమే
వంకన్‌లేదని సాటెదన్

వంటి పద్యాలు దాశరధీ శతకాన్ని గుర్తు తెస్తున్నవి ఇది భక్తులే కాక సాహిత్యప్రియులు సైతం చదువదగిన పుస్తకం.

## అస్పృశ్యత

కర్త: గోపి హంపయ్య మూల్యము: 0-75 న. పై ప్రాప్తిస్థానము: రాయలసీమ న్యూస్‌పూర్ట్, మెయిన్‌రోడ్డు, తిమ్మన చెర్లపోస్టు, గుంతకల్

దేశంలో అస్పృశ్యులుగా అగచాట్లు పడుతున్న వేలాది ప్రజలకు గాంధీమహాత్ముని చలువ వల్ల గౌరవనీయమైన హరిజనులనే పేరువచ్చి, వారి వుద్ధరణకు కృషి ఆరంభమైనది. ఆనాడు కొత్తగా జాగరితమైనజాతి "మాలను కోసిన రక్తము రాదా పీలో నున్నది పాలా" అని ఆవేదన వెల్లడించినది. నేడు యీ కవి అదే ఆవేదనను సుమారు నూరు పద్యాలలో వెల్లడించాడు.

రచన సోదర. 'నకం' విశేషణాలతో సుహృద్భావ పూర్వకంగా నడపడం విశేషం. అక్కడక్కడ "పోగాల" ము వంటి కలకు పదాలు దొర్లకుండా వుంచే యిది మరింత వన్నెకెక్కేది, భావ ప్రకటన నూతన పక్కీలో జరిగినది

ప్రజల ప్రతిశక్తి సంఘమ్ము ప్రతిభ(ఖ)ంఢింది
ప్రజల సృష్టించినారువో, ''పంచములను!''
ధర్మపరుల
స్వార్థహీనుల, దీనుల, సాధుజనుల!
మహిని "యస్పృశ్యు!" లను వారె "మాలవారు!!"

వంటి ఆకర్షణీయమైన ప్రయోగాలు వున్నవి. విశాల దృక్పథము, జాతీయ భావాలు గల యీ కవి రచన సమర్థతతో సాగినది.

## రుద్రభూమి

కర్త. డాక్టర్ అరిశే వేంకటేశ్వర్లు. మూల్యం: రూ 2-00

ప్రాప్తి స్థానం: డాక్టర్ అరిశే వేంకటేశ్వర్లు, రాజమ్మ చికిత్సాలయం & గర్భవతుల సంరక్షణశాల, పెదకళ్లేపల్లి (పోస్టు) దివి తాలూకా (కృష్ణా)

"వల్లి"

## ప్రణయసౌధం

రచయిత: శ్రీ యం. హీరాలాల్ మోరియా

అనంతమైన ఈ ప్రపంచంలో ఏదీ శాశ్వతం కాదు. కాని కొన్ని మాత్రం అమూల్య చారిత్రిక విలువలను సంతరించుకొని యుగయుగాలుగా నిలిచి వుంటవి. ఇటువంటి వాటిని కొన్నింటిని శ్రీ మోరియా తమ 'ప్రణయసౌధం' లో ప్రస్తుతించారు ఇందులో ప్రణయసౌధం నాగార్జున నాగరికత, నేస్తగాడా. స్మృతి, అజంతా శిల్పి ఖులీకుతుబుషా. చార్‌మీనార్ అనే గేయాలున్నాయి.

షాజహాన్ తన ప్రేమకు అమరత్వాన్ని సిద్ధింపచేసుకున్నాడు-తాజ్‌మహల్‌ను నిర్మించి. ఇదే ప్రణయసౌధం. ఇందులో-

'నీవాకిట నాగుండియ
జీవంతో నినదించెను'

అనే భావన ఎంతో మహోదాత్తంగా వుంది

నాగార్జున పర్వతాన్ని గతాగతాల కూడలిగా 'నాగార్జున నాగరికత' గేయంలో అభివర్ణించారు.

'నేస్తగాడా!' అనే మరొక గేయంలో—

"లోకమున చిరకాలముండెడి
రుచ్యవస్తువు మంచి ఒకటే"

అనే నగ్న సత్యాన్ని చాటుతూ—

"నీదు క్రౌర్యము నిన్నే మింగును
నీ అశాంతియే నిన్ను చంపును"

అని హెచ్చరిస్తారు

"స్మృతి" అనే గేయంలో—

"ప్రణయము కారాదున్నాదమ్మ చెలీ!
ప్రేమ యనగ మహా త్యాగం
ప్రేమే జగదాకర్షణ" అని ప్రేమ స్వరూపాన్ని

మహోన్నతంగా వివరించారు.

అజంతా శిల్పి అనే గేయం కవి శిల్పాభిమానాన్ని, ఖులీ ఖుతుబుషా, చార్‌మీనార్ అనే గేయాలు కవికి ఖుతుబుషా పట్ల, వారి ప్రణయం పట్ల వున్న ఆకర్షణను గోచరింపచేస్తాయి

శ్రీ మోరియా కథా రచయితయేగాదు ఉత్తమ కవికూడా! అని అనిపించే ఈ కవితా సంపుటిలో మన సంస్కృతీ సంప్రదాయపు విలువలు, చారిత్రిక పూర్వవైభవం, దేశభక్తియేగాక భావాలలో సహజత్వం, విశ్వాసం కనుపిస్తవి

శ్రీ మోరియా హిందీలో వ్రాసిన ఈ గేయాలను—ప్రముఖ కవి శ్రీ దాశరధి చక్కటి తెలుగులోకి అనువాదం చేశారు అనువాదం అతి సహజంగా వుంది. ముద్రణ, ముఖచిత్రం ఆకర్షణీయంగా వున్నాయి

'ప్రణయం సౌధం' మూల్యం ఒక రూపాయి. ప్రతులకు "జిల్లా రచయితల సంఘం, మోహన్ రోడ్, ఖమ్మం" అనే చిరునామాకు వ్రాయాలి.

''ఆనంద వర్ధన''

# ఉండ్రాళ్ళు

రచన: శ్రీ జి కోటయ్య.

నేటి సాహిత్యోద్యానంలో ఒక భాగంగా బాలసాహితీ లత ఈ మధ్యనే చిగురించి పూవులు పూయడం ఆరంభించింది. ఇటీవల అందరూ బాలసాహిత్యం పట్ల విశేషాభిమానం చూపుతున్నారు. ఎన్నో పుస్తకాలు కూడా వెలువడినై. అలాంటి వాటిలో ఒకటి "ఉండ్రాళ్ళు" అనే పాటల పుస్తకం

పిల్లలకు ఏం చెప్పాలన్నా అతి సునిశితంగా, వారి ఊహలకు చేష్టలకు తగినట్లుగా చెప్పేనేర్పు రచయిత శ్రీ కోటయ్యగారిలో గోచరిస్తుంది. "ఉండ్రాళ్ళు" అనే మొదటి గేయం వినాయకునికిసంబంధించింది ,ఇది పిల్లలను తెగనవ్విస్తుంది. అలాగే 'మా బావ'లో బావ శ్రీరామనవమి పండుగకు ఇంటికివస్తే అన్నీపెట్టి పంపుతారు తీరా తన వూరెళ్ళి 'ఆదరణ బాగలేదని అందరితో చెప్పాడట'. అల్లుళ్ళ స్వభావం ఇందులో గోచరిస్తుంది ఇంకా ఇలాగే ఇందులో సముద్రం, చిట్టిగాడు, మొక్క, జామకొమ్మ మీద ఉయ్యాలలో చిట్టి, మల్లెమొక్క, విమానం, మిఠాయి, నేనేకవినైతే అనే పాటలున్నాయి ఇవన్నీ ఇదివరకు ఆయా పత్రికలలో ప్రచురింపబడినవి.

ఈ పాటల పుస్తకం పిల్లలకుత్సాహంగా వుంటుంది. పిల్లలకై తేలిక. ఈ పుస్తకాన్ని వ్రాసిన శ్రీ కోటయ్యగారు అభినందనీయులు

"ఉండ్రాళ్ళు" వెల 0 60 న, పై. ప్రతులకు: ప్రసాద్ పబ్లికేషన్స్ ఏలూరు"

"ఆనంద వర్ధన"

# అంతర్యాలు

(నవల)

రచన — శివం, ప్రజాప్రచురణలు, ఏలూరు,
వెల 1—50 న పై పుటలు 104.

నేటి తెలుగు వచన సాహిత్యంలో నవలలకు గిరాకి ఉన్నది అందువల్లనే మార్కెట్‌లోకి కుప్పతిప్పలుగా నవలలు వచ్చిపడుతున్నాయి పాఠకుల అభిరుచిని కనిపెట్టి ప్రచురణ కర్తలు వాటిలను అధికంగా ప్రచురిస్తున్నారు. వీటిలో ఉత్తమమైనవి, పఠితల హృదయాల స్పందింపచేసి కొంతలో కొంతగానైనా వారిపై ముద్రవేయగలిగేవి అరుదే. శ్రీ "శివం" ది, ఇది తొలి ప్రయత్నమైనా పాత్రల మనస్తత్వ చిత్రణను, కథను ఆకర్షకంగా నడిపించడంలోను కృతకృత్యులైనారనే చెప్పాలి.

అప్పుడే కాఫీ త్రాగి పత్రిక చూస్తున్న రంగనాథంగారికి పైనుండి సన్నని కూనిరాగం విన్పించింది. భార్య విశాలాక్షిని పిలిచి కూతురు శాంత వివాహం విషయం ప్రస్తావిస్తాడు. శాంతకు తండ్రి తెచ్చిన సంబంధం నచ్చదు తాను మరొకర్ని ప్రేమి

స్తున్నటుల తల్లిదండ్రులకు చెప్పుతుంది. ఆ ప్రేమించిన వ్యక్తి తోటి విద్యార్థిఐన రాజశేఖర్. తల్లిదండ్రులకు ఇష్టం లేకపోయినా వీరిరువురి వివాహం జరగడం, మద్రాస్‌లో కాపురం పెట్టడంతో అసలు కథ ప్రారంభమవుతుంది. రాజశేఖర్ జబ్బున పడటం ఆతనికి వ్యాధి నయం చేయించడానికి తమ బంధువగు జగన్నాథం వద్ద శాంత చాటుగా అప్పు తీసుకోవడం, ఆ రుణాన్ని నెమ్మదిగా తీరుస్తూ ఉండటం జరుగుతుంది. జగన్నాథానికి తన కుమారుడగు బాబూరావుకు రాజశేఖర్ చెల్లెలు లక్ష్మితో పెండ్లిచేయాలనే సంకల్పం ఏర్పడి పన్నిన కుతంత్రంలో శాంత నలిగి ఆత్మ హత్యకు పాల్పడడం. ఆమెను బాబూరావే కాపాడటంతో రెండు కుటుంబాల మధ్య అప్యాయత పెరిగి లక్ష్మి మనస్సు అతన్ని ఆకర్షించడంతో ఈ ఇరువురిని ఏకం చేసి నవల సుఖాంతం చేశారు రచయిత.

ఈ నవలలో బాబూరావు పాత్ర విచిత్రమైంది. చాలా రౌడీగా జీవించే బాబూరావు లక్ష్మి వల్ల ఆకర్షితుడై హృదయ పరివర్తనాన్ని పొందటమే కాక తన తండ్రికిగూడా నీతులు బోధిస్తాడు. బ్యాంకులో లక్షలు మూల్గుతున్నంత మాత్రాన చాలదని హృదయంలో కరుణ ఉండాలని, మానవత ప్రధానమని చెప్పుతాడు. కొడుకు బోధనలతో జగన్నాథానికి తన కిరాతక స్వరూపం కండ్లకు కట్టినట్టయి తనపై తనకే అసహ్యం వేసి సిగ్గుతో అవమానంతో కుమిలిపోతాడు. ఈ విధంగా ఇద్దరు పరివర్తన పొందడంతో రెండు కుటుంబాల మధ్య సన్నిహితత్వం పెరుగుతుంది. రాజశేఖర్ ఇల్లంతా నవ్వులతో మార్మోగుతుంది. దూరంగా శివాలయంలోని గంటలు గూడా సంతోషంతో గలగలా మారుమ్రోగుతాయి.

ఒకరి హృదయపు లోతులను అంతర్యాలను కనుగొనడం అంత సులభం కాకపోయినా ఈ నవలనుచదివి శాంత, జగన్నాథం తదితర పాత్రల అంతర్యాలను పాఠకులు అవగాహన చేసుకోవచ్చు.

## జీవితం (నవల)

రచన : కొడవగంటి కుటుంబరావు, ప్రజా ప్రచురణలు, ఏలూరు, వెల : రు. 2—25 న.పై. పుటలు 156.

పౌరాణికం, జానపదం, సాంఘికం అనే మూడు విభాగాలలో ఈ రచన సాగింది. దీనిలో దక్షిణామూర్తి అనే ఒక రాక్షసుడు, సాంబయ్య అనే మహారుషి కాన్పిస్తారు. రాక్షసుడంటే పెద్ద పెద్ద కోరలు దంతాలు భీకర స్వరూపం ఉంటుందని, అదే విధంగా సాంబయ్య అంటే సర్వసంగ పరిత్యాగి అయిన మహారుషి అని ఎవరూ భావించాల్సిన అవసరం లేదు. దక్షిణామూర్తి ఆధునిక భావాలు నాగరికతను జీర్ణించుకున్న వ్యక్తి. దేవుడనే వాడు వేరేలేడని ఎవరి చేతలకు వారే కర్త అనేరకం. సంఘ సంస్కర్త గూడా. సాంబయ్య అతని మెత్తని మాటల్తో పేదలకు ఇబ్బందుల్లో ఇరుక్కున్న వారికి ఎక్కువ వడ్డీకి డబ్బు ఇచ్చి ఇతరుల ఆస్తులకాజేసేరకం. దక్షిణామూర్తి ఉన్న ఆస్తి కర్పూరంలా హరించి పారవేస్తే సాంబయ్య సజ్జనుడుగా చెలామణి అవుతూ ఇంకా సంపన్నుడవుతాడు.

దక్షిణామూర్తి కొడుకు ప్రకాశం. తండ్రికివలెనే కొడుకువి అభ్యుదయ భావాలే. సంగీతం అన్నా, స్త్రీలన్నా మక్కువ అధికం. కళాశాల జీవితంలో తోటి విద్యార్థినులలో ప్రకాశం రజనికి సన్నిహితమవుతాడు. రజని కూడా తనకు సాధ్యమైనంతవరకు ప్రకాశాన్ని ప్రేమించింది. కాని ప్రకాశం రజని వివాహం పొసగలేదు. అసంభవంగా పరిణమించింది ఇద్దరూ ఉచ్చులోపడ్డ పక్షులవలె బాధపడ్డారు.

కళాశాల జీవితం ముగిసాక ప్రకాశంలో ఒక జీవితం ముగిసి రెండవ జీవితం ప్రారంభమైంది. సాంబయ్య రెండవ భార్య చూడామణితో అక్రమ సంబంధం కలుస్తుంది. ఈ విధంగా ప్రకాశం శుష్కకామాన్ని అనుభవిస్తాడు. విద్యార్థి జీవితంలో రజనిపై కురిపించిన శుష్క ప్రేమకన్న ఇది వింతైన అనుభవాన్ని ఇచ్చింది ఈతనికి. జీవితంలో ప్రేక్షకుని స్థితి నుండి తాను తన పాత్రను నిర్వహించడానికై ముందుకు రావలసి వచ్చింది. సంఘ నీతి యావత్తు అసూయపై ఆధారపడి ఉన్నదని గ్రహిస్తాడు.

కథకునిగా బ్రతుకు బాటను చూచుకోవడానికై మద్రాస్‌కు చేరుకున్న ప్రకాశం రెండు మూడు ఉద్యోగాలను మార్చవలసి వస్తుంది. ఇక్కడ కమల అనే ఎక్స్ట్రా నటితో పరిచయం ఏర్పడి ఆమెను ప్రేమించబోగా ఆ ప్రయత్నం విఫలమవుతుంది. దీనితో తానై ఒక స్త్రీని ప్రేమించడానికి ప్రయత్నించేదిలేదని ఏ స్త్రీ గూడా తనను ప్రేమించి వెతుక్కుంటూ రాదన్న నిర్ణయానికి వచ్చి కొనకు తల్లిదండ్రులు చూచిపెట్టిన వసంత అనే అమ్మాయిని పెండ్లిచేసుకుంటాడు. ఈ విధంగా జీవితమంటే అందులో ఎన్ని మెలికలు సుడిగుండలుంటాయో మన కోర్కెలు ప్రయత్నాలు భిన్నించి బ్రతుకు ఎక్కడికి లాగుకో వెళ్లుతుందో, ఎట్టి పరిణామాలు వస్తాయో ఈ నవలలో కొడవగంటి కుటుంబరావుగారు చాలా బాగా చిత్రించారు. ప్రతి ఒక్కరూ చదవవలసిన నవల ఇది.

"సి. హెచ్. ఆచార్య"

# రచయితలు

1. శ్రీ చెలమచెర్ల రంగాచార్యులు, ఉస్మానియా విశ్వవిద్యాలయం, హైదరాబాదు
2. "ఉదయభాను" ఎ-7 యం యల్. ఏ. క్వార్టర్సు, హైదరాబాదు
3. "విద్యారత్న" శ్రీ నిడుదవోలు వెంకట్రావు, మద్రాసు విశ్వ విద్యాలయం, మద్రాసు.
4. పద్మశ్రీ శ్రీ సి. నరసింహం, ఐ. ఏ. యస్., ప్రత్యేక కార్యదర్శి, ప్రణాళికశాఖ, హైదరాబాదు.
5. శ్రీ పోతుకూచి సాంబశివరావు, బోయిగూడెం, సికింద్రాబాదు
6. శ్రీ బి. కృష్ణమూర్తి నాయుడు, హిమాయత్‌నగర్, హైదరాబాదు.
7. డాక్టర్ పోతుకూచి సుబ్రమణ్యశాస్త్రి, నాగపూర్.
8. శ్రీ బొడ్డుబాపిరాజు, ఏలూరు, పశ్చిమ గోదావరి జిల్లా
9. శ్రీ తాళ్ళూరి నాగేశ్వరరావు, బి. కాం. యల్. యల్ బి. తెనాలి
10. శ్రీ పి. వి. యల్. నరసింహారావు పి. ఆర్ ఒ నౌకా నిర్మాణ కేంద్రం విశాఖపట్నం.

---

## ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం
## సమాచార, ప్రజాసంబంధశాఖ, హైదరాబాదు
### ప్రచురణల పట్టిక

**ఇంగ్లీషు**

| | | రూ. న. పై. |
|---|---|---|
| 1. అరకులోయ | ... | 0 – 60 |
| 2. ఆంధ్రప్రదేశ్–విశేషాలు | ... | 0 – 25 |

**తెలుగు**

| | | |
|---|---|---|
| 1. శ్రీ అల్లూరి సీతారామరాజు జీవితచరిత్ర | ... | 2 – 75 |
| 2. 'ప్రగతి గీతాలు' | ... | 0 – 25 |
| 3. మూడవ మెట్టు | ... | 0 – 25 |

**ఉరుదు**

| | | |
|---|---|---|
| 1. ఆహారోత్పత్తి | ... | 0 – 12 |
| 2. గిరిజన సంక్షేమం | ... | 0 – 12 |
| 3. మత్స్యసంపద | ... | 0 – 12 |

పోస్టేజి అదనం

ప్రతులను సమాచార, ప్రజా సంబంధ శాఖ
**సమాచార** కేంద్రంనుంచి పొందవచ్చు.

# దేశంతోపాటు మీరుకూడా అభ్యుదయం పొందండి !

మీరు మిగుల్చుకున్న డబ్బును

భారత ప్రభుత్వ చిన్న మొత్తాల పొదుపు పథకమునకు పెట్టుబడి పెట్టండి !

భారత దేశం యొక్క

సమాజాభివృద్ధి కార్యక్రమమునకు, గొప్ప నదీలోయ ప్రాజెక్టులకు,
రైలుమార్గములు, రోడ్ల అభివృద్ధికి తోడ్పడండి !

మీ డబ్బును ఈ క్రింది ఆకర్షణీయమైన గ్యారంటీడ్ సెక్యూరిటీలలో దేనిలోనైనా పెట్టుబడి పెట్టండి !

**12 సంవత్సరముల జాతీయ ప్రణాళికా పొదుపు పత్రాలు**

పరిణతి పొందిన పిమ్మట నూటికి సంవత్సరానికి 5.41 వంతుల చొప్పున వడ్డీ ఇవ్వబడుతుంది. ఇవి రూ. 5 లవి మొదలు రూ. 25,000 లవి వరకూ లభిస్తాయి. వ్యక్తిగతంగా ఒక్కొక్కరు రూ. 25,000 ల వరకూ కొనవచ్చు. రూ. 25,000 ల విలువ పత్రాలు ప్రావిడెంటు ఫండ్ పెట్టుబడులకు మాత్రమే.

**10 సంవత్సరముల ట్రెజరీ సేవింగ్సు డిపాజిట్ సర్టిఫికెట్లు**

ఏటా నూటికి 4 వంతులు వడ్డీ చెల్లించబడుతుంది. ఒక్కొక్కరు రూ. 50 లవి మొదలు రూ. 25,000 ల వరకూ కొనవచ్చు.

**15 సంవత్సరాల యాన్యుయిటీ సర్టిఫికెట్లు**

జారీ చేయబడు ధరలు : రూ. 1,330, రూ. 3,325, రూ. 6,650, రూ. 13,300, రూ. 26,600. ఈ సొమ్ము నూటికి యేడాదికి 4.25 కు కొంచెమెక్కువగా వచ్చే చక్రవడ్డీతోసహా నెలసరి వాయిదాలలో 15 సంవత్సరాలలో తిరిగి చెల్లించబడుతుంది. ఒక్కొక్కరు రూ. 26,600 ల వరకూ కొనవచ్చు.

**పోస్టాఫీసు సేవింగ్సు బ్యాంకు అకౌంట్లు**

25 నుంచి 10,000 ల వరకు గల నిల్వలపై నూటికి 2½ చొప్పున, రూ. 10,000 లకు మించిన నిల్వలపై నూటికి 2 చొప్పున వడ్డీ ఇవ్వబడుతుంది.

**క్యుములేటివ్ టైమ్ డిపాజిట్ పథకం**

నెలనెలా రూ. 5, 10, 20, 50, 100 లేక 200 వంతున 5 లేక 10 సంవత్సరాలపాటు డిపాజిటు చేస్తే, వడ్డీతోసహా మొత్తం అంతా ఒక్కసారే చేతికి వస్తుంది.

ఆదాయంపన్ను లేకుండా మీకు మంచి ఆదాయం లభిస్తుంది! భావిభారత సౌభాగ్యానికై పెట్టుబడి పెట్టండి!

ఈ పెట్టుబడులకు సంబంధించిన నిబంధనలను గూర్చి యితర వివరాలు మీకు చేరువగా వున్న పోస్టాఫీసు వద్దగాని రీజియనల్ నేషనల్ సేవింగ్స్ ఆఫీసర్, 10-2-2, ఎ.సి. గార్డ్సురోడ్డు, హైదరాబాదు, లేక, మీ జిల్లా కలెక్టరు ఆఫీసులోని, జిల్లా ఆర్గనైజరు వద్దగాని తెలుసుకోవచ్చు.

Edited & Published by the Director of Information & Public Relations, Andhra Pradesh, Hyderabad-1
Printed at Vir Milap Press, Mukarramjahi Road, Hyderabad.

# ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం

## విస్తీర్ణం, సివిల్‌డివిజన్లు (1961 జనాభా లెక్కలు)

| | |
|---|---|
| వైశాల్యం ... | 1,06,052 చదరపు మైళ్ళు |
| జనాభా ... | 359.8 లక్షలు |
| జిల్లాలు ... | 20 |
| తాలూకాలు ... | 189 |
| పట్టణాలు, నగరాలు | 223 |
| జనసాంద్రత (చదరపు మైలుకు) | 340 మంది |

## పంచవార్షిక పశుగణన — 1961

(వేలలో)

| | |
|---|---|
| పశువులు ... | 123.45 |
| గేదెలు ... | 69.49 |
| గొర్రెలు ... | 83.63 |
| మేకలు ... | 42.47 |
| గుర్రాలు ... | 71 |
| ఇతర జంతువులు ... | 6.76 |

## సమాజాభివృద్ధి కార్యక్రమం

| వివరాలు :— | 1959—60 | 1960—61 | 1961—62 |
|---|---|---|---|
| బ్లాకులు ... | 282 | 326 | 378 |
| సగటున వేయిగ్రామాలకుగల బ్లాకులు ... | 10.66 | 16 | 17 |
| సగటున పదిలక్షల జనాభాకు గల బ్లాకులు | 7.72 | 16 | 16 |
| బ్లాకులక్రింద వున్న గ్రామాలు ... | 178,87 | 20,901 | 245 02 |
| బ్లాకు ప్రాంతాల్లో నివసించే ప్రజలు | 187,31 | 205.73 | 235,65 |

## ఖనిజోత్పత్తి

| | 1959—60 టన్నులు | 1960—61 టన్నులు |
|---|---|---|
| బొగ్గు ... | 2296,000 | 2596,000 |
| ముడిఇనుము ... | 203,000 | 233,000 |
| మాంగనీస్ ... | 16,000 | 24,000 |
| అభ్రకం ... | 3,000 | 3,000 |
| సున్నపురాయి ... | 776,000 | 1,036,000 |

